# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మార్చ్ 2008 80 రు. 10

- ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలు
- కాకినాడలో సెజ్ కల్లోలం
- బడుగులకు రాజ్యాధికారం?
- సమస్యల వలయంలో వ్యవసాయరంగం
- ముంబైకార్ వివాదం
- ఎస్.సి. రిజర్వేషన్‌ల వర్గీకరణ

అందరికీ అందుబాటు అయిన ధరలో




# యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ పై ఏకైక విశిష్ట సమాచార, విశ్లేషణా గ్రంథం

## సిడిఆర్‌సి ప్రచురణ
## ఇంగ్లిషులో, 568 పేజీలు
## రు. 225

## FIFTY YEARS OF ANDHRA PRADESH
## 1956 - 2006

ప్రస్తుతం మార్కెట్లో ఉంది

యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ జయాపజయాలపై,
అభివృద్ధి పథంలో ఒడిదుడుకులపై
నలభై విశ్లేషణాత్మక, సమాచార భరిత వ్యాసాలు, పట్టికలు
చరిత్ర, వ్యవసాయం, పరిశ్రమలు, మౌలిక సౌకర్యాలు, ఆర్థిక వ్యవహారాలు,
సామాజిక పరిణామాలు, విద్యా వైద్య రంగాలు
ఆంధ్రప్రదేశ్ పురోగతి గురించి తెలుసుకోదలచిన వారందరూ
తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన గ్రంథం
ప్రతి గ్రంథాలయంలోనూ ఉండవలసిన గ్రంథం




ప్రతులకు, వివరాలకు

**సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫ్యాక్స్, ఫోన్ : 040 - 66843495 ఇమెయిల్ : reachcdrc@yahoo.com

వీక్షణం 80 రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

మార్చ్ 2008
సంపుటి : 6
సంచిక : 3

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

## సంపాదకీయం

# ఎవరి కోసమీ బడ్జెట్ ?

రాష్ట్రంలో 2004 మేలో అధికారానికి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వ పదవీకాలం ముగిసిపోతున్న చివరి ఆర్థిక సంవత్సరానికి గాను సమర్పించిన 2008-09 బడ్జెట్ ఊహించినట్టుగానే వాగాడంబరంతో అబద్ధపు వాగ్దానాలతో, అంకెల గారడీతో నిండి ఉంది. ఈ బడ్జెట్ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకూ, ప్రజలకూ ప్రకటిత వాగ్దానాల మేరకు ఏమైనా మేలు చేస్తుందో లేదో అనుమానమే గాని అధికారపక్షపు ఆశ్రితులకూ, ప్రపంచీకరణ శక్తులకూ, 2009 ఎన్నికలలో కాంగ్రెస్ పునరాగమన ఆకాంక్షలకూ మాత్రం చాల ఎక్కువగా ఉపయోగపడుతుంది. ఈ బడ్జెట్ సాధారణంగా బడ్జెట్లకు ఉండవలసిన సంపద పంపిణీ స్వభావాన్నీ, ప్రజానుకూల పన్నుల విధానం ద్వారా ప్రభుత్వాదాయాన్ని పెంచుకుని సంక్షేమ విధానాల మీద వెచ్చించవలసిన పద్ధతినీ, ఆర్థికవ్యవస్థ అభివృద్ధి కోసం శాశ్వత వనరులను పెంపొందించవలసిన అవసరాన్నీ సంపూర్ణంగా మరిచిపోయింది. ఎన్నికల సంవత్సరంలో ప్రజలను ఆకర్షించడానికీ, భ్రమల్లో ముంచడానికీ, మాయచేయడానికీ తద్వారా తన ఓట్లను పెంచుకోవడానికీ ప్రయత్నించింది. కొత్త పన్నులు వేయడం లేదని ప్రగల్భాలు పలుకుతూనే ఆదాయ వ్యయాల తేడా భారాన్ని మరో రూపంలో తీర్చుకోవడానికి ప్రయత్నించింది. పరోక్షపన్నుల ద్వారా, ప్రజల జీవనోపాధిని, ఉమ్మడి సంపదను, భవిష్యత్తును కొల్లగొట్టడం ద్వారా బడ్జెట్‌ను విపరీతంగా పెంచి చూపడానికి ప్రయత్నించింది. సంపన్న వర్గాలకు, బహుళజాతి సంస్థలకు రాయితీలను, భవిష్యత్ అవకాశాలను ప్రకటించి తాను ఎవరికి ఊడిగం చేయడానికి ఉన్నదో చెప్పింది. పాలకపక్ష నాయకులకు, ఆశ్రితులకు, కాంట్రాక్టర్లకు ఉపయోగపడే, ఇబ్బడిముబ్బడిగా సంపద చేకూర్చి పెట్టే విధానాలను, పథకాలను ప్రకటించింది. దేశమంతా నిరసిస్తున్న ప్రత్యేక ఆర్థిక మండలాలను రాష్ట్రంలో విరివిగా నెలకొల్పుతామని చెపుతూ బహుళజాతి సంస్థలకు, దేశదేశాల సంపన్నులకు, పెట్టుబడిదారులకు, దళారీలకు దాసోహం ప్రకటించింది. దేశంలో కెల్లా ఎక్కువ ప్రత్యేక ఆర్థిక మండలాలను స్థాపిస్తామని చెప్పిందంటే మరిన్ని వేల ఎకరాల భూమిని రైతుల దగ్గరినుంచి లాక్కుని పెట్టుబడిదారులకు అప్పనంగా అందిస్తామని అంటున్నదన్నమాట. ఈ ప్రకటనకు ప్రజల నుంచి వ్యతిరేకత వచ్చే అవకాశం ఉంది గనుక ఈ సెజ్‌ల ద్వారా కొత్తగా ఎనిమిది లక్షలమందికి ఉపాధి దొరుకుతుందని ఒక అబద్ధపు వాగ్దానం కూడ జతచేసింది. ప్రజల ఆస్తి, తరతరాల ఉమ్మడి సంపద అయిన భూమిని సంపన్నులకు కట్టబెట్టి తద్వారా పన్నెండు వేల కోట్ల రూపాయలు సంపాదిస్తామని అంటూ, దాన్ని ఆదాయంలో చూపుతున్నదంటే ఈ ప్రభుత్వం ఎంత బరితెగించినదయి ఉండాలి! ఒకవైపు సామూహిక సంపదను, వనరులను ఈ రకంగా కొల్లగొడుతూ, మరొకవైపు సామూహిక వనరుల కల్పన, శాశ్వత జీవనోపాధి అవకాశాల కల్పన కాకుండా వ్యక్తిగత స్థాయి ప్రయోజనాల పథకాలను ప్రకటించడం ద్వారా సామాజిక విలువలలోనే ఉమ్మడి ప్రయోజనాల స్థానంలో స్వార్థాన్ని పెంచి పోషించడానికి ప్రయత్నిస్తోంది. ఆ వ్యక్తిగత ప్రయోజనాల పథకాలు కూడా - 30 లక్షల ఇందిరమ్మ గృహాలు గాని, 1.41 లక్షలమందికి రాజీవ్ ఉద్యోగశ్రీ ఉపాధి గాని, 15 లక్షల దీపం గ్యాస్ కనెక్షన్లు గాని - అంకెల్లో కనబడినంత ఆకర్షణీయంగా వాస్తవంలో ఉండవు. ఈ బడ్జెట్ అంకెలగారడీలో అంతిమంగా మిగిలేది జలయజ్ఞం వంటి పథకాల ద్వారా కాంట్రాక్టర్లకు, మొత్తంగా సంపన్నులకు అందే ప్రయోజనాలు, పెరిగిపోతున్న రాష్ట్ర రుణభారం మాత్రమే. ఈ ఆర్థిక సంవత్సరాంతానికి రాష్ట్ర రుణభారం రు. 93,593 కోట్లు అవుతుందని అంచనా వేసి, తొమ్మిది సంవత్సరాల తెలుగుదేశం పాలనా కాలంలో పెరిగిన రుణభారానికి సమానమైన రుణభారాన్ని ఐదు సంవత్సరాలలోనే సాధించిన ఘనత కాంగ్రెస్‌కు దక్కుతుందని ఈ బడ్జెట్ చూపుతున్నది. ◆

గౌరవ సంపాదకులు:
**వి. హనుమంతరావు**

సంపాదకులు:
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు
**డి.వి.రామకృష్ణారావు**

సర్క్యులేషన్ మేనేజర్
**వై. రామచంద్రం**
**9949391028**

కంపోజింగ్ & లే ఔట్
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్,** హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

## మళ్లీ తెలంగాణ

పార్లమెంటరీ రాజకీయ ఎత్తుగడలు పిల్లిమొగ్గలకన్న, ఊసరవెల్లి రంగులమార్పిడి కన్న క్షణభంగురమైనవీ, తాత్కాలికమైనవీ అని ఇటీవలి తెలంగాణ పరిణామాలు రుజువు చేస్తున్నాయి. ఒకే భాష, ఒకే జాతి అనే కలలతో, భవిష్యత్ రక్షణ హామీలతో నిర్మించుకున్న సమైక్య రాష్ట్రంలో తమ న్యాయమైన వాటా తమకు దక్కక, ఆ అసమానతకు, వివక్షకు అవమానాలు కూడ తోడయి, ఐదు దశాబ్దాల సమైక్య జీవనం తర్వాత, విభజన అయినా ఏమేరకయినా న్యాయం ఇస్తుందేమోనని కలలుగంటున్న మూడున్నరకోట్ల తెలంగాణ ప్రజలు ఒకవంక, ఆ న్యాయమైన ప్రజా ఆకాంక్షలను తమ రాజకీయ చదరంగపు పావులుగా మార్చుకుంటున్న రాజకీయ పక్షాలు మరొకవంక ఉన్న దృశ్యం రోజు రోజుకూ మరింత విషాద, సంక్షోభమయంగా మారుతున్నది. తెలంగాణ ప్రజా ఆకాంక్షలను గౌరవిస్తానంటూ తెలంగాణ రాష్ట్ర సమితితో ఎన్నికల పొత్తు పెట్టుకుని నిట్టనిలువునా మోసం చేసిన కాంగ్రెస్ నుంచి, తెలంగాణ కోసమే ఉన్నానంటూనే తెలంగాణ ప్రజలను కదిలించడంపై కాక సోనియాగాంధీ కటాక్ష వీక్షణాలకోసం, 'ఏకాభిప్రాయసాధన' కోసం కాలమంతా వృథాచేసిన తెలంగాణ రాష్ట్ర సమితి దాకా అందరికీ తెలంగాణ ప్రజలను వంచిస్తున్న పాపంలో తలాపిడికెడు భాగస్వామ్యం ఉంది. ఎన్నికల సంవత్సరంలో ప్రవేశించాం గనుక ఇప్పుడు ప్రతి ఒక్కరూ క్షణక్షణం రంగులు మారుస్తున్నారు. తమంత తెలంగాణ ప్రేమికులు మరెవ్వరూ లేరని నటించే రసవత్తర పాత్రలు పోషిస్తున్నారు. నిన్నటిదాకా తామే అన్న మాటలను ఇవాళ తామే ఖండిస్తున్నారు. కొత్త పొత్తులు, కొత్త ఎత్తుగడలు, కుట్రలు, కుహకాలు, వాగ్దానాలు, అబద్ధాలు, నమ్మబలక డాలు, ఆత్మస్తుతులు, పరనిందలు రాజ్యం చేస్తున్నాయి. ఈ గందరగోళపు అస్తవ్యస్త సామాజిక రాజకీయ చిత్రం మధ్య తమకు కావలసిందేమిటో, అది సాంధించుకునే మార్గమేమిటో తెలంగాణ ప్రజలు నిర్దిష్టంగా స్పష్టంగా ప్రకటించవలసిన సమయం మళ్లీ ఒకసారి వచ్చింది.

నికులకు ఉపాధి అవకాశాల కోర్కెలు, సొంత అస్తిత్వాల గుర్తింపు ఆకాంక్షలు, ప్రత్యేక రాష్ట్రాల ఏర్పాటు కోర్కెలు వంటి న్యాయబద్ధమైన, ప్రజాస్వామికమైన డిమాండ్లు చెలరేగుతున్న సమయంలోనే ఒక ప్రాంతంలో మరొక ప్రాంతం వారి సాంస్కృతిక వ్యక్తీకరణలు ఉండగూడదని విధి నిషేధాలు విధించే సాంస్కృతిక దురహంకారం కూడ పెల్లుబుకుతున్నది. ఈ రెంటి మధ్య తేడా చూడకపోతే రెంటినీ ఒకే గాటన కట్టి తిరస్కరించే ప్రమాదం ఉంది. మహారాష్ట్ర మహారాష్ట్రీయులకే అనే నినాదంతో బొంబాయిలో నివసించే దక్షిణ భారతీయుల మీద హింసతో 1960ల చివర ప్రారంభమైన శివసేనకు మొదటి నుంచీ పునాది ప్రాంతీయ విద్వేషాన్ని, హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొట్టడమే. కాలక్రమంలో రాజకీయ అధికారం కొరకు తన హింసోన్మత్తతను కొద్దిగా తగ్గించుకున్నట్టు నటించినప్పటికీ శివసేన తన అసలు రంగును కూడ ఎప్పటికప్పుడు బయట పెట్టుకుంటూనే ఉంది. అందులో భాగమే ఇటీవల ఉత్తరప్రదేశ్, బీహార్‌ల నుంచి ప్రత్యేకంగా, ఉత్తరాది రాష్ట్రాల నుంచి మొత్తంగా ముంబాయికి చేరిన పేద, మధ్యతరగతి ప్రజానీకం మీద మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన (ఎం.ఎన్.ఎస్.) నాయకుడు రాజ్‌థాకరే చేసిన వ్యాఖ్యల, ఆ వ్యాఖ్యల ఫలితంగా చెలరేగిన హింసాకాండ. మహారాష్ట్ర స్థానికుల తరఫున పోరాడుతున్నట్టుగా నటిస్తున్న శివసేన ముంబాయి నగరం దేశదేశాల సంపన్నులకు, దళారీలకు రాజధానిగా మారి పోయినప్పుడు వారికి వ్యతిరేకంగా, స్థానికుల కోసం పోరాడాలని ఎప్పుడూ ఆలోచించలేదు. ఇప్పుడు మాత్రం పొట్టచేతపట్టుకుని మహానగరంలో ఉపాధి అవకాశాలు వెత్తుక్కుంటూ వచ్చి కూలీలుగా, డ్రైవర్లుగా, నిర్మాణకార్మికులుగా, పనిమనుషులుగా, చిరుద్యోగులుగా అతిసాధారణమైన బతుకు బతుకుతూ ముంబైనగర మనుగడకు పునాదిగా ఉన్నవారిని వెళ్లగొట్టాలని మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన నినదిస్తోంది. ఉత్తరాది ప్రజలు తమ పండుగలు జరుపుకోగూడదని, ముంబైకార్‌ల పండుగలు మాత్రమే జరుపుకోవాలని శాసిస్తోంది. మైకెల్ జాక్సన్ తన స్నానాల గది వాడుకుంటే పునీతమయిందని ప్రకటించిన శివసేన అధిపతి బాల్ థాకరే ఎటువంటి సామ్రాజ్యవాద సంస్కృతికి దళారీగా ఉన్నాడో, అదే సంస్కృతిని ఇవాళ రాజ్ థాకరే ప్రకటిస్తున్నాడు. ఇది జాతీయ అస్తిత్వ ఆకాంక్షకాదు. ఇది పాలకవర్గాలకు, సంపన్నులకు అవసరమైన జాతీయోన్మాదం. ప్రజల అస్తిత్వ ఆకాంక్షల మీద నిర్మాణమయ్యే ఉద్యమం ఏదయినా మరొక జాతి ప్రజలకు వ్యతిరేకం కాగూడదని, ఆ పోరాటం తమను దోపిడీ పీడనలకు గురిచేస్తున్న పాలక, సంపన్న వర్గాలమీదనే తప్ప మరొక ప్రజా సమూహం మీద కాదని నేర్చుకోవలసిన అవసరాన్ని ముంబాయి హింస మన దృష్టికి తెస్తున్నది.

నేక ప్రజాసంక్షేమ రాజకీయార్థిక విధానాలతో, అమెరికా సామ్రాజ్యవాద దుర్మార్గాలపట్ల మొక్కవోని వ్యతిరేకతతో ఒకరకంగా ప్రపంచ ప్రగతిశీలశక్తులకు ప్రేరణగా ఉన్న క్యూబా అధ్యక్షుడు ఫిడెల్ కాస్ట్రో ఎట్టకేలకు పదవీ విరమణ చేశాడు. చాలా కాలంగా అనారోగ్యంతో ఉన్నప్పటికీ, యాభై సంవత్సరాలుగా దేశంలో నెలకొని ఉన్న వ్యక్తిగత ఆరాధన వల్ల, మరొక నాయకుడి చేతిలో దేశాన్ని పెడితే అది సక్రమంగా నడుస్తుందో నడవదో అనే అనుమానాల వల్ల కాస్ట్రో ఆ పదవిలో కొనసాగుతూ వచ్చాడు. కొద్ది నెలల కింద తీవ్రమైన అనారోగ్యంతో, ఎనభయో పడిలో పడిన తర్వాత తన సోదరుడు రౌల్ కాస్ట్రోకు కొన్ని బాధ్యతలు అప్పగించాడు. ఇప్పుడు ఫిడెల్ పదవీ విరమణ తర్వాత జాతీయ అసెంబ్లీ రౌల్ నే అధ్యక్షుడిగా ఎన్నుకుంది. ఫిడెల్ కాస్ట్రో నాయకత్వంలో క్యూబా సాధించిన విజయాలను, సోషలిస్ట్ నిర్మాణ కృషిలో క్యూబా అందించిన కానుకలను వినమ్రంగా అంగీకరిస్తూనే భవిష్యత్తు సోషలిస్ట్ ప్రయోగాలు గుర్తించవలసిన ప్రమాదాలను కూడా కాస్ట్రో అనుభవం చూపుతున్నది. నాయకుడి పట్ల మితిమీరిన ఆరాధన, యాభై సంవత్సరాలపాటు, ఎనభై సంవత్సరాల వయస్సు వచ్చేవరకు ఒకే నాయకుడి తిరుగులేని పాలన, ఆ నాయకుడు పదవీ విరమణ చేయదల చుకున్నపుడు కుటుంబ సభ్యుడికే అధికారం కొనసాగింపు అనేవి ఎటువంటి పరిస్థితులలోనైనా అంగీకరించదగినవి కావు. సోషలిస్ట్ సమాజ నిర్మాణక్రమంలోనయితే తీవ్రంగా చర్చించవలసినవి. అమెరికా సామ్రాజ్యవాదాన్ని ఎదిరిస్తూ పక్కలో బల్లెంలా ఐదు దశాబ్దాల పాటు కొనసాగగలిగినందుకు, సామాజిక సంక్షేమంలో ముఖ్యంగా విద్య, వైద్య, ఆరోగ్య రంగాలలో ఆదర్శవంతమైన ప్రజానుకూల పాలన నమూనాను నిర్మించినందుకు గౌరవిస్తూనే కాస్ట్రోకు వీడ్కోలు చెప్పవలసి ఉన్నది. ఆయన అనివార్యంగానో, ఉద్దేశ్యపూర్వకంగానో చేసిన పొరపాట్లనుంచి ప్రగతిశీల శక్తులు గుణపాఠం నేర్చుకోవలసి ఉన్నది. ◆

## లోపలి పేజీల్లో...

### ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలు

ప్రభుత్వం చేయబోయే సంస్కరణలు, ఆచరణలో పనికిరాని భూములకు నష్టపరిహారం పేరుతో ప్రజాధనం చెల్లించి భూస్వాముల్ని పెట్టుబడిదారులుగా మార్చడానికి జరిగేవే తప్ప, వ్యవసాయ కార్మికులకి, పేద రైతులకి భూమిని పంచి వ్యవసాయోత్పత్తిలో తగిన భాగం వారికి లభింపజేయడం ద్వారా వారి కొనుగోలు శక్తిని పెంచడానికి ఉద్దేశించిన సంస్కరణలు కావు. అశేష రైతాంగాన్ని ఆవహించిన దరిద్రానికి కారణం కొద్దిమంది భూస్వాముల చేతుల్లో అత్యధిక భాగం భూమి కేంద్రీకరించబడి ఉండటమే నని, ఆ కేంద్రీకరణను రద్దు చేయడమే భూ సంస్కరణల లక్ష్యమనీ ఒకవైపు దొంగ కబుర్లు చెబుతూనే మరోవైపు పరిశ్రమల కింద, పెద్ద పెద్ద పండ్ల తోటల కింద, దేవాలయాల కిందగల వేలాది ఎకరాలకూ మినహాయింపులు ప్రకటించడం ఇలా ఈ 'సంస్కరణల' కిందికి రాని అంశాలెన్నో ఉన్నాయి.

### ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలు



'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028












- **మేటి భారతదేశం** – చారిత్రక తాత్విక స్ప్రింగ్ బోర్డు పరిశీలన – సాధు సుబ్రహ్మణ్యం శర్మ, సాధు ప్రచురణలు – 769 పేజీలు, క్రౌన్ సైజ్, రు. 350, ప్రతులకు : సాధు పబ్లికేషన్స్, 69-3-4ఎఫ్, రాజేంద్రనగర్, గైగోలుపాడు, కాకినాడ – 5. ఫోన్ : 0884-2372907
- **మా అమ్మ 'నీల'** – ముచ్చట్లు, జ్ఞాపకాలు, వంటలు – రమ మెల్కోటె – లిఖిత ప్రెస్, 51 పేజీలు, 1/5 డెమీ, రు. 25,
- **మంచులోయ** – కథా సంపుటి (1994-2003) – ఒమ్మి రమేష్‌బాబు – లిఖిత ప్రెస్, 175 పేజీలు, 1/8 డెమీ, రు. 95

  పై రెండు ప్రతులకు : లిఖిత, హెచ్.ఐ.జి.-II , బి-12, ఎఫ్-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 44. ఫోన్ : 040 – 27660000
- **నిర్మల్ చరిత్ర** – అంకం రాములు – 105 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : అంకం రాములు, ఇ.నెం. 3-1-138, బేస్తవార్‌పేట్ వీథి, నిర్మల్, ఆదిలాబాద్ – 504 106.
- **అనలానిలము** – కవితా సంపుటి – వరిగొండ కాంతారావు – సహృదయ దశాబ్ది ప్రచురణ, 124 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : శ్రీమతి వరిగొండ సూర్యప్రభ, ఇ.నెం. 5-70, 'ఆదిత్య', జీవనమిత్ర నగర్, విద్యారణ్యపురి, హనుమకొండ – 506 009. ఫోన్ : 0870 – 2438812, సెల్ : 94418 86824, 94400 19849, విశాలాంధ్ర, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **అంటరానివసంతం** – జి. కళ్యాణరావు – విరసం ప్రచురణ, 240 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : సహచర బుక్ మార్క్, ఎ.పి.హెచ్.బి., హెచ్.ఐ.డి. (ఓజి), బ్లాక్ నెం. 5, షాప్ నెం. 29, సుందరయ్య పార్క్ దగ్గర, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044. ఫోన్ : 040 – 27679998, సెల్ : 9848348173
- **ఆధునిక భాషాశాస్త్రం** – మోడరన్ లింగ్విస్టిక్స్ – ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న – దళిత సాహిత్య పీఠం ప్రచురణ, 419 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు : శ్రీమతి వి. పార్వతి, 4-39-123, మునిసిఫ్ వారి వీథి, పెదవాల్తేరు, విశాఖపట్నం – 17. ఫోన్ : 0891 – 2538528, సెల్ : 9440641617, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **భారత్ బంజారా బాపోతి** – ది హిస్టరీ ఆఫ్ బంజారాస్ – కేతావత్ సోమ్లాల్ – సహచరా బుక్‌మార్క్ పబ్లికేషన్స్, 154 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : సహచరా బుక్ మార్క్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044.
- **కవాతు** – ఉగ్రవాదం పై నిరసన కవిత్వం – షేక్ కరీముల్లా – ముస్లిం రచయితల సంఘం – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : షేక్ కరీముల్లా, 21-36, పెద్ద మసీదు బజారు, వినుకొండ – 522 647, గుంటూరు జిల్లా. సెల్ : 94415 02990, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **సాహితీ వీక్షణం** – నాగసూరి వేణుగోపాల్ – 141 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ఎన్.కె. పబ్లికేషన్స్, 24-8-1, సమీరా రెసిడెన్సీ, విజయనగరం – 535 001. సెల్ : 94403 43479











## పాఠకుల వీక్షణం

'వీక్షణం' ఫిబ్రవరి సంచికలో 'మాల మాదిగల మధ్య అపోహలు లేని ఐక్యత కావాలి' అన్న జె. గౌతమ్ గారి వ్యాసం రాష్ట్రంలో జరుగుతున్న ఉద్యమంలోని అనేక కోణాలను పాఠకుల ముందుంచింది. తెలియని చాలా సమాచారాన్ని అందించింది. నిజంగానే మాల మాదిగల మధ్య ఉన్న అపోహలను తొలగించేదిగా ఉంది. అవకాశవాద రాజకీయాల స్వభావాన్ని కూడా బట్టబయలు చేసింది.

**– ఎల్. సంతోష**
కరీంనగర్

'వీక్షణం' పత్రిక సమాచార భరితంగా ఉంటోంది. విశ్లేషణలతో కూడిన వ్యాసాలు వస్తే మరింత బాగుంటుంది.

**– దాస్**
హైదరాబాద్

సామాజిక పరిశోధనా అంశంగా వీక్షణంలో సీరియల్‌గా ప్రచురితమైన 'చెంచుల జీవన స్థితిగతులు – సామాజిక మూలాల అన్వేషణ' వ్యాసం చెంచుల గురించి, వారి జీవన విధానం గురించి, అంతరించిపోతున్న వారి స్థితిగతులు గురించి ఎన్నో అంశాలపై పాణిగారు చాలా విశ్లేషణాత్మకమైన, పరిశోధనాత్మకమైన కృషి చేశారు. వాస్తవానికి ఇలాంటి పని విస్తృతస్థాయిలో పరిశోధనాంశాలుగా విశ్వవిద్యాలయాలు చేయాల్సిన అవసరం ఉంది. ఇలాంటి పరిశోధనా ప్రయత్నం చేపట్టినందుకు సిడిఆర్‌సి అభినందనీయం.

**– పి. శ్రీనివాసరావు**
నెల్లూరు

'వీక్షణం' వ్యాసాలు వామపక్ష తెలంగాణ మేధావుల(?) వ్యక్తిగత భావాలను ప్రతిబింబిస్తున్నాయనిపిస్తోంది. ఇటువంటి వ్యాసాలు ముఖ్యంగా 'తెలంగాణలో ఇటీవలి పరిణామం', 'తెలంగాణపై సాంస్కృతిక దాడి', మందు వేయాల్సింది ఏ వైరస్‌కు' వంటివి ఆ ప్రాంత పాఠకులకు మాత్రమే నచ్చుతాయని, మిగతా ప్రాంతంలో పత్రిక పట్ల వ్యతిరేకత పెంచుతాయని గమనించాలి. మతోన్మాదంపై వ్యాసం మైనారిటీలను మంచి చేసుకోవడానికి రాసినట్లుంది. వ్యాసం చివరలో వారి చర్యలన్నింటినీ ఒక వాక్యంతో సమర్థిం చేశారు. బి.జె.పి.కు ఓటేసిన ప్రజలందరూ మతోన్మాదులు అనుకోవాలా? పరిచయ పుస్తకాల పేర్లు చూస్తుంటే వామపక్ష పుస్తకాలు మాత్రమే విడుదలవుతున్నాయా అనిపిస్తుంది. ఇక కన్నబిరాన్ గారి వ్యాసం బ్యాలన్స్‌డ్‌గా ఉంది. 'మనుషులూ, మాటలూ' చాలా బాగుంది. ఇటువంటి శాస్త్రీయ వ్యాసం మరొక్కటిస్తే బాగుంటుంది. చరిత్ర వ్యాసం బాగున్నా 'శ్రీకాకినాడ విద్యార్థిని సమాజం' గురించి అంత రాయాలా అనిపిస్తుంది.

**– డి. సుధాకర్**
కోసూరువారి పాలెం

'వీక్షణం'లో వాకపల్లి ఘటనపై వచ్చిన వ్యాసంగానీ, ఇతర వ్యాసాలు గానీ వాస్తవాధారితంగా, ఆలోచింపజేసేవిగా ఉంటున్నాయి.

**– కె.వి. రమణారెడ్డి**
మార్కాపురం

'వీక్షణం' ఫిబ్రవరి సంచికలో 'బాక్సైట్ తవ్వకాల వల్ల నదీ జలాలకు ప్రమాదకరం' అనే వ్యాసం బాక్సైట్ గనుల తవ్వకాల వల్ల పర్యావరణానికి జరిగే ముప్పును మన ముందుంచింది. ఎటువంటి పర్యావరణ అనుమతులు లేకున్నా బహుళజాతి కంపెనీలకు ప్రభుత్వం అనుకూలంగా వ్యవహరించడం వారి బాధ్యతా రాహిత్యాన్ని తెలియజేస్తుంది. భవిష్యత్తు తరాలు ఇటువంటి విధానాల వల్ల తీవ్రంగా నష్టపోయే ప్రమాదం ఉంది.

**– పి. రవికుమార్**
తిరుపతి

'వీక్షణం' పత్రిక రాష్ట్రంలోనూ, దేశంలోనూ జరుగుతున్న పరిణామాలపై సమగ్రమైన వ్యాసాలను పాఠకులకు అందిస్తోంది. తెలుగు సమాజంలో వెలువడుతున్న మాసపత్రికల్లో వీక్షణం తనవంతు సామాజిక బాధ్యతను నెరవేరుస్తున్నదనడంలో ఎటువంటి సందేహం లేదు. అంతర్జాతీయంగా వస్తున్న మార్పులపై కూడా లోతైన వ్యాసాలు రావాల్సిన అవసరం ఉంది.

**– కె.వెంకటేశ్వర్లు**
ఖమ్మం

### అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా, అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యనైనా నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. మీ జిల్లాలో అసహజంగా చనిపోతున్న వారి వివరాలను మాకు పంపండి. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం. ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి. ఫోన్ నెం. 99891 89250, 99493 91028

**– సంపాదకులు**

### వీక్షణం మీ ముంగిట

'వీక్షణం' పత్రిక ఇప్పుడు మీకు మరింత చేరువలోకి వచ్చింది. రాష్ట్రంలోని అన్ని పట్టణాలలో, టౌన్‌లలోని న్యూస్ స్టాండ్‌లలో అందుబాటులో ఉంది. ఇక ఆలస్యమెందుకు... వెంటనే మీ ప్రతిని తెచ్చుకోండి!

**జ**నవరి 23న తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో వరంగల్‌లో పెద్ద ఎత్తున బి.సి. గర్జన బహిరంగసభ జరిగింది. మధ్యంతరం లాంటి ఊహాగానాలు కొనసాగుతున్న క్రమంలో తెలుగుదేశం పార్టీ కోల్పోతున్న పట్టును నిలబెట్టుకోవడానికి, ఆవిర్భావ కాలం నాటి వ్యూహాన్ని అమలు చేయడానికి ఈ సభతో ప్రారంభించింది. చిరంజీవి, మాయావతి, ఇంకా వివిధ సామాజిక వర్గాలు లేవనెత్తుతున్న ప్రశ్నలకు ప్రధాన పార్టీలన్నీ ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని తమ వ్యూహాలను సిద్ధం చేసుకుంటున్నాయి. రాష్ట్ర జనాభాలో సగం జనాభాగా ఉన్న 92 బి.సి. కులాలవారిని ఆకర్షించడానికి ఈ సభ ఏర్పాటు చేశారు. విద్యార్థులకు, రైతులకు, మహిళలకు చంద్రబాబు నాయుడు అనేక వరాలు కురిపించారు. మొత్తం మీద బహుజనుల్లో పెరుగుతున్న రాజకీయ చైతన్యం అగ్రకుల అధికారాన్ని ఇరుకున పెడుతోంది.

**చి**కాగోలో కార్మికులు ఎనిమిది గంటల పనిదినాల కోసం పోరాడి సాధించుకున్నారు. ఇది గత చరిత్ర. 120 ఏళ్లు గడిచిపోయాక సైన్స్, టెక్నాలజీలు విపరీతంగా అభివృద్ధి చెందాక, జనాభా పెరిగాక వాస్తవానికి పని గంటలు తగ్గాలి. మనుషులకు కాస్త విజ్ఞానం, విరామం కూడా ఉండాలి. కాని ఈ కాలంలో ఏ ఉద్యోగాలు చూసినా కనీసంగా పది పన్నెండు గంటలు, ఐ.టి. వంటి రంగాలలో పదిహేను నుంచి పద్దెనిమిది గంటలు ఉద్యోగాలు చేయాల్సి వస్తోంది. రకరకాల గందరగోళాల్లో (సెల్, టి.వి., ఇంటర్‌నెట్ సంస్కృతి వలన) హింసా ప్రవృత్తి జీవితంలో భాగమైపోయింది. మనసు విప్పి మాట్లాడుకుంటే పరిష్కారమయ్యే సాధారణ విషయాలు కూడా జటిలంగా మారిపోతున్నాయి. ఇదంతా ఎందుకంటే సంక్రాంతికి సెలవు ఇవ్వలేదన్న కోపంతో చాంద్రాయణ్‌గుట్ట సి.ఆర్.పి.ఎఫ్. క్యాంపస్‌లో అడిషనల్ డి.ఐ.జి. గా పనిచేస్తున్న, హైదరాబాద్‌కు చెందిన సయ్యద్ సిరాజుద్దీన్ అలీ ఖాన్ (56)ను కర్నూలు జిల్లా ఆలూరుకు చెందిన కానిస్టేబుల్ హనుమంతరావు తుపాకితో కాల్చి చంపాడు. ఉద్యోగులలో పెరిగిపోతున్న మానసిక ఒత్తిడికి ఈ చర్య నిదర్శనం. ఈ రకమైన చర్యలు మనిషితనం కోల్పోతున్న ఒక సామాజిక ఆవరణకు చిహ్నం.

**మ**న రాష్ట్రంలో 2001 జనాభా లెక్కల ప్రకారం 13.6 లక్షల మంది బాలకార్మికులు ఉన్నట్లు తెలుస్తోంది. వీరిలో ఒక లక్షా ముప్పై వేల మంది పత్తి చేలలో, జిన్నింగ్ మిల్లులలో పనిచేస్తున్నారు. అందులో 92 వేలమంది ఒక్క గుంటూరు జిల్లాలోనే ఉన్నారు. గుంటూరు, దాని చుట్టుపక్కల దాదాపు 400 వరకు జిన్నింగ్ మిల్లులు ఉన్నాయి. ఈ జిన్నింగ్ మిల్లులలో, పత్తి చేలలో పిల్లలు రోజుకు ఎనిమిది నుంచి పది గంటలు నడుములు విరిగే పనిచేస్తారు. మిల్లులలో పనిచేసే పిల్లలు శ్వాస సంబంధ, ఊపిరితిత్తుల వ్యాధుల బారిన పడుతుంటే, పత్తి చేలలో పనిచేసే పిల్లలు పురుగుమందుల ప్రమాదాలకు గురవుతున్నారు. జిన్నింగ్ మిల్లులలో ఉదయం 8 నుంచి సాయంత్రం 6 వరకు, యంత్రాలతో సమానంగా పరుగుపెడతారు. పత్తి చేలలో రోజుకు ఇరవై నుంచి ముప్పై కేజీల పత్తి ఏరుతారు. అనేక రిపోర్టుల ద్వారా ఈ విషయం మనకు తెలుస్తూనే ఉంది. ఇది వ్యాపారులకు తెల్ల బంగారమే, బాల కార్మికులకే మృత్యుకూపం.

**వి**జయవాడ శివార్లలోని ఇబ్రహీంపట్నంలో ఉన్న దుర్గా లేడీస్ హాస్టల్ గదిలో బీ ఫార్మసీ విద్యార్థిని ఆయేషామీరాను డిసెంబర్ 27న గుర్తు తెలియని వ్యక్తులు అత్యాచారం చేసి, దారుణంగా హతమార్చి, ఈడ్చుకెళ్లి బాత్‌రూంలో పడేశారు. హత్య జరిగి రెండు నెలలైనా ఈ కేసులో పోలీసులు ఎలాంటి పురోగతి సాధించలేదు. మంత్రి కోనేరు రంగారావు మనవడి పాత్రపై, హాస్టల్ వార్డన్ దంపతుల ప్రవర్తనపై, ఆయేషా సమీప బంధువుపై ఇలా రకరకాల అనుమానాలు, ఆరోపణలు జవాబు లేని ప్రశ్నలుగానే మిగిలిపోయాయి. మరోపక్క 'ఇంతటితో ఊరుకోండి. లేకుంటే మీ రెండో కూతురును కూడా చంపేస్తా'మంటూ ఆయేషా తల్లిదండ్రులకు బెదిరింపులు వస్తున్నాయి. పోలీసులు ప్రదర్శించిన ఉద్దేశపూర్వక నిర్లక్ష్యం, ప్రభుత్వం అనుసరించిన ఉదాసీన వైఖరి వల్లే కేసు నీరుగారిపోతోందని తల్లిదండ్రులు, వివిధ ప్రజాసంఘాలు విమర్శిస్తున్నాయి. గతంలో కూడా ప్రముఖుల ప్రమేయం ఉన్నట్లు ఆరోపణలు ఉన్న కేసుల విషయంలోనూ (సినీనటి ప్రత్యూష, కళాచౌదరిల కేసులు) ఇదే జరిగింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ కేసును సి.బి.ఐ.కి అప్పగించినా అటు బాధితులలోనూ, ఇటు ప్రజానీకంలోనూ విశ్వాసం కలిగించలేదు. ఇది ఆయేషా ఒక్కరి విషయం కాదు, మొత్తంగా మహిళల భద్రతపై అందరూ ఆందోళన చెందాల్సిన తరుణం.

**ఫి**బ్రవరి నెల 8 నుంచి 12 మధ్య రాష్ట్రంలో కురిసిన భారీ వర్షాలకు ఆరు జిల్లాల్లో (ప్రకాశం, గుంటూరు, నెల్లూరు, కృష్ణ, శ్రీకాకుళం, విశాఖపట్నం) రైతులు తీవ్రంగా నష్టపోయారు. గత శతాబ్ద కాలంలో ఇంత పెద్ద ఎత్తున ఫిబ్రవరి నెలలో వర్షం కురవడం ఇది మూడో సారి మాత్రమే. 1902లో 64.5 మి.మి., 1988లో 278.9 మి.మి., ఈసారి ఒక్క మూడురోజుల్లోనే 175.9 మి.మి. వర్షపాతం నమోదైంది. అధికారులకు అందిన ప్రాథమిక సమాచారం మేరకు ఆరు జిల్లాల్లో మిర్చి రైతులకే ఈ వర్షాల కారణంగా 350 కోట్ల రూపాయల వరకు నష్టం వాటిల్లింది. వరి, పొగాకు, మినుము, శనగ, కంది, పెసర పంటలు నీట మునగడం తో రైతులు తీవ్రంగా నష్టపోయారు. కోత దశలో ఉన్న మామిడి, నిమ్మ కాపు పై తీవ్ర ప్రభావం చూపుతుందని రైతులు వాపోయారు. మొత్తంగా ఆరు వందల కోట్ల రూపాయల మేరకు రైతులు పంటలు నష్టపోయారు.

◆

*దున్నేవారికే భూములు పంచాలంటూ ప్రభుత్వం పై చైతన్యయుతమైన పోరాటాలు నిర్వహించిన తెలుగు సమాజం, అదే ప్రభుత్వంతో సొంత భూమిని కాపాడుకోవడానికి పోరాటం చేయాల్సి రావడమే ఓ విషాదం అంటున్నారు* **ఎస్. రాజేష్**

# కాకినాడలో సెజ్ కల్లోలం

కోస్తా తీరం అనగానే, సిరులు పండే పంటలు గుర్తుకొస్తాయి. భూమికి ఆకుపచ్చ రంగేసినట్లు పొలాలు మన కళ్లముందు కదలాడుతాయి. విశాలమైన జీడిమామిడి, కొబ్బరి, సపోటా తోటలతో కనువిందు చేసే ఈ దృశ్యాన్ని చెరిపేసేందుకే కాబోలు, 'పెట్రో, కెమికల్, పెట్రోకెమికల్ ఇండస్ట్రియల్ రీజియన్' తెరముందుకు వస్తోంది. ఈ సెజ్‌లను ప్రభుత్వం రెండేళ్ల క్రితమే ప్రకటించింది. దీనిని రైతులు, మత్స్యకారులు వ్యతిరేకిస్తూనే ఉన్నారు. 'పచ్చని పంట పొలాలను నాశనం చేసే సెజ్‌లు మాకొద్దు. భూసేకరణ వెంటనే ఆపి వేయాలి. మా జీవన సంస్కృతిని ధ్వంసం చేయకండి, గో బ్యాక్ సెజ్ గో బ్యాక్' అంటూ చిన్న, సన్నకారు రైతాంగం, వ్యవసాయ కూలీలు గొంతు చించుకొని నినదిస్తున్నా ప్రభుత్వానికి మాత్రం చెవికెక్కడం లేదు.

### అక్షరాలా లక్షన్నర ఎకరాలకు మంగళం

ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు కోసం అత్యధిక భూములు సేకరిస్తున్న రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ దేశంలోనే మొదటి స్థానంలో నిలిచింది. వీటికోసం విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలోని ఒకటిన్నర లక్షల ఎకరాల్లో 'పెట్రో, కెమికల్, పెట్రోకెమికల్ ఇండస్ట్రియల్ రీజియన్' ఏర్పాటవుతున్నాయి. భూములు కొనుగోలు పై స్టాంప్ డ్యూటీ ఉండదు. నిర్మాణ సామాగ్రిపై పన్నులు ఉండవు. పరిశ్రమల ఏర్పాటుకు రాయితీలే రాయితీలు. దిగుమతి సుంకాలు ఉండవు. పదేళ్లపాటు పన్నులకు మినహాయింపులు కల్పించారు. ఇంకా, ఈ జోన్‌లో పరిశ్రమలు పెట్టుకునే వారికి నిర్వహణ స్వేచ్ఛ ఉంటుంది. కార్మిక, కంపెనీ చట్టాలు వర్తించవు. సేకరించిన భూమిని నేరుగా కంపెనీలకు ఇవ్వడానికి బదులు డెవలపర్‌కు అప్పగిస్తున్నారు. ఆ భూమిని సదరు డెవలపర్ అన్ని విధాల ఉపయోగకరంగా మార్చి అందులో 25 శాతం భూమిని మాత్రమే పరిశ్రమ నెలకొల్పబోయే సంస్థకు ఇవ్వాల్సి ఉంటుంది. మిగతా స్థలంలో సినిమా హాళ్లు, పాఠశాలలు, ఆసుపత్రులు తదితర నిర్మాణాలను డెవలపర్లే చేపడతారు. మిగతా భూమిని వారికిష్టం వచ్చినట్లుగా ఉపయోగించుకునే స్వేచ్ఛను ప్రభుత్వం కల్పించింది.

### పచ్చని పొలాలను దహిస్తున్న సెజ్ మంటలు

రాష్ట్ర వ్యాప్తంగా 1.07 కోట్ల హెక్టార్లలో పలురకాల పంటలు సాగవుతున్నాయి. ఇందులో ఆహార పంటల విస్తీర్ణం 78.83 లక్షల హెక్టార్లు. అందులోనూ మూడొంతులు పండేది కోస్తా జిల్లాల్లోనే. ఇప్పుడు ఏకంగా లక్షన్నర ఎకరాలకు కోస్టల్ కారిడార్ పేరిట ఎసరు పెట్టారు. ఇవన్నీ వ్యవసాయ భూములే. ఇక్కడ ప్రధానంగా వరి పండుతుంది. ఆ తర్వాతి స్థానం కొబ్బరి, చెరకు పంటలది. తూర్పు గోదావరిలో 15.09 లక్షల టన్నులు, విశాఖ జిల్లాలో 3.31 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తి అవుతున్నాయి. ఇప్పుడు ఈ రెండు జిల్లాల్లోని 42 మండలాల పరిధిలో ఉన్న లక్షన్నర ఎకరాలను పరిశ్రమల కోసం బలిచేస్తున్నారు. దీనివల్ల ఆహార భద్రతకు ప్రమాదం తప్పదని నిపుణులు అంటున్నారు. ఇది ఆహార, ఆర్థిక అంశాల సంగతి. ఇక సామాజిక విపత్తు విషయానికొస్తే కోస్టల్ కారిడార్ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రెండు కోట్ల మంది వరకూ రైతులు, రైతు కూలీలు, వ్యవసాయంపై ఆధారపడి జీవించే ఇతర కులవృత్తుల వారిపై తీవ్ర ప్రభావం పడుతుంది. సేకరించిన భూమిలో 46 శాతం ప్రభుత్వరంగ సంస్థ ఒ.ఎన్.జి.సి. దాని అనుబంధ సంస్థకు ఇవ్వాలని 2005లోనే రాష్ట్ర ప్రభుత్వం, సదరు సంస్థ అవగాహన ఒప్పందం (ఎం.ఒ.యు.) కుదుర్చుకున్నాయి. తీరా భూసేకరణ జరిపాక కాకినాడ సెజ్ ప్రైవేట్ లిమిటెడ్‌కే భూములన్నీ అప్పగించాలని చూడడాన్ని బట్టి ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను అర్థం చేసుకోవచ్చు.

### మరణశయ్యపై మత్స్య సంపద

పెట్రో, రసాయన పరిశ్రమల నుంచి వెలువడ్డ కలుషితాలు అంతిమంగా చేరేది సముద్రంలోకే. ఇది తలచుకుని మత్స్యకారులు బెంబేలెత్తుతున్నారు. ఇప్పటికే కోస్తా తీరంలో వంద దాకా రసాయన, ఇతర పరిశ్రమలున్నాయి. ఇవి వదిలే కాలుష్యం వల్ల కలుగుతున్న నష్టం అంతా ఇంతా కాదు. విశాఖ నుంచి ఎగుమతైన రొయ్యల్లో క్రిమి సంహారక అవశేషాలున్నాయంటూ రెండు మూడేళ్ల క్రితం ఎనిమిది కంటైనర్లను ఆయా దేశాలు వెనక్కి పంపేశాయి. రైతులు, వ్యాపారులకు కోట్లలో నష్టం వాటిల్లింది. కోస్తా తీరంలో రసాయన పరిశ్రమలున్న ప్రాంతంలో వేటాడిన చేపలను ఎవరూ కొనడం లేదని మత్స్యకారులు అంటున్నారు. రసాయన పరిశ్రమల నుంచి వచ్చిన వ్యర్థాల దెబ్బకు చేపలు, తాబేళ్ళు, డాల్ఫిన్లు చచ్చి తీరానికి కొట్టుకు వస్తున్నాయి. ఇప్పుడే పరిస్థితి ఇలా ఉండగా, ఇక పెద్ద స్థాయిలో పెట్రో, రసాయన పరిశ్రమలు వచ్చి పడితే ఎలా ఉంటుందో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు.

విశాఖ నుంచి ఏటా 36,596 టన్నుల మత్స్య సంపద ఎగుమతి అవుతోంది. తద్వారా 1264.75 కోట్ల రూపాయల ఆదాయం లభిస్తోంది. గోపాలపట్నం, చెన్నైల నుంచి ఎగుమతి అవుతున్న వాటి విలువ మరో

వెయ్యికోట్ల దాకా ఉంటుందని అంచనా. కాకినాడ సముద్ర తీరంలో రసాయన పరిశ్రమలు ఏర్పాటు చేస్తే, మత్స్య సంపదలో అత్యధిక భాగం అదృశ్యమయ్యే ప్రమాదముంది. ఇది సుమారు 8 లక్షల మంది మత్స్యకారులు, ట్రాలర్లు, మరపడవల యజమానులకు అశని పాతమే. 75 రొయ్యల చెరువులు సైతం నేల మట్టం కానున్నాయి. పెట్రో, రసాయన పరిశ్రమలకు భారీగా నీరుఅవసరం. కోస్తాలో, మరీ ముఖ్యంగా తూర్పుగోదావరి, విశాఖ జిల్లాల్లో అందుకు కొదవలేదు. పోలవరం ఎడమకాలువ ద్వారా రోజుకు 1848 మిలియన్ లీటర్లు, ప్రస్తుతం విశాఖ నగరవాసుల దాహార్తిని తీరుస్తున్న ఏలేరు ఎడమకాలువ ద్వారా 385 మిలియన్ లీటర్లు, సామర్లకోట ప్రాంతంలో ఉన్న గోదావరి కాలువ ద్వారా 220 మిలియన్ లీటర్ల నీటిని సరఫరా చేయాలని నిర్ణయించారు.

### ఉద్యమంపై ఉక్కుపాదం మోపుతున్న ప్రభుత్వం

కాకినాడ కారిడార్‌కు వ్యతిరేకంగా సెజ్ వ్యతిరేక కమిటీ ఆధ్వర్యంలో ఆందోళనలు ఉధృతమవుతున్నాయి. నర్మదా బచావో ఆందోళన్ నాయకురాలు మేధా పాట్కర్ ఈ గ్రామాలు సందర్శించారు. మానవ హక్కుల వేదిక నేతలు బాధితుల తరపున న్యాయ పోరాటం చేస్తున్నారు. కాకినాడ పరిధిలోని తొండంగి, యు. కొత్తపల్లి మండలాల్లోని పదహారు గ్రామాల ప్రజలు ముక్తకంఠంతో నినదిస్తున్నారు. బలవంతంగా సేకరించిన భూమిలో ప్రభుత్వం వేసిన ముళ్ల కంచెను కదలి నెట్‌వర్క్, సెజ్ వ్యతిరేక కమిటీ, ఇతర ప్రజా సంఘాల ఆధ్వర్యంలో స్థానిక ప్రజలు తొలగించారు. దీంతో పద్దెనిమిది మందిని అరెస్ట్ చేసి, కేసులు నమోదు చేశారు. బాధిత ప్రజల అభిప్రాయాలు తెలుసుకోవడానికి మేం శ్రీరాంపురం అనే గ్రామం వెళ్లాం. వారితో సంభాషిస్తుండగా 28

**తడారి అప్పారావు** (రైతు)

మా భూములకు ఒక ఎకరానికి మూడు లక్షల రూపాయలు ఇస్తామని చెప్పారు. మా భూములు నిస్సారమయినవి, పంటలు ఫలసాయాన్ని ఎక్కువ అందించలేవని, అంగీకార పత్రాలు రాసుకున్నారు. ఒకరైతు మాకు భూములు ఇచ్చాడని ఇంకొక రైతుకు అబద్ధం చెప్తూ బలవంతంగా పత్రాల మీద సంతకాలు చేసుకుంటున్నారని, మా భూములకు పది లక్షల రూపాయలు ఇచ్చినా మేము మా భూములివ్వం అని ఆందోళన చేస్తుంటే, ఎం.ఆర్.ఒ., ఆర్.డి.ఒ., గ్రామ కార్యదర్శులే మమ్మల్ని భయపెడుతున్నారు. మా గ్రామాన్ని 1400 మంది పోలీసులు చుట్టూముట్టారు. అయినా మేం భయపడలేదు. స్త్రీలు అని చూడకుండా మా భూముల నుండి తోసివేశారు. ఒక ఎకరానికి నలభై బస్తాల వరి పండుతుంది. మూడు పంటలు పండుతుంది. ఇక్కడి రైతులకు, సపోట, కొబ్బరి, జీడి మామిడి తోటలున్నాయి. వీరికి సంవత్సరానికి లక్ష రూపాయల పైననే ఆదాయం వస్తుంది. మా గ్రామంలో పదవ తరగతి పైన చదివినవారు ఎవరూ లేరు. ఇప్పుడిప్పుడే మా పిల్లలను చదివించుకుంటున్నాం. అసలు ప్రభుత్వ ఉద్యోగస్తులు లేరు. ఒక్కసారి కూడా మాగ్రామాలకు ఎం.ఎల్.ఎ. రాలేదు. మాకు ప్రభుత్వం ఏ సహాయం, ఏ పథకం ఇవ్వకున్నా మా భూముల్ని మాకు వదిలితే మేమే ప్రభుత్వానికి సహాయం చేస్తామని గుండె బరువుతో చెప్పాడు.

**పాటిగంగా నాగేశ్వరమ్మ** (రైతు)

శ్రీరాంపురం యు. కొత్తపల్లి మండలం మహిళ ఆవేదనతో ఇలా మాట్లాడింది. 'మా భూములు పనికిరావని, నిస్సారమయినవని, పంటలు పండవని బెదిరించి దొంగ అంగీకార పత్రాల మీద సంతకాలు పెట్టించుకొని బలవంతంగా మా భూములను గుంజు కుంటున్నారని, మాయే మూడు పంటల పండుతున్నాయని, గత రెండు సంవత్సరాల నుండి ఒక్క పూట తింటే ఇంకొక పూట తిండి తినడం లేదని, మాకు ఓ పండుగా లేదూ, సంతోషం లేదు. ఏ రాత్రి వచ్చి పోలీసోల్లు మా పిల్లలను, భర్తను తీసుకపోతారనే భయంతో రాత్రిళ్లు నిద్ర కూడా పోవడం లేదని' ఆవేదనను వ్యక్తం చేసింది. అంతేగాకుండా 'చంద్రబాబును ఓడించి వై.ఎస్.ను గెలిపిస్తే మా పంట పొలాలను లాక్కోమని ఆజ్ఞాపించాడు. మేం ఎలా బతకాలి? మాకు ఏ పంచభక్ష పరమాన్నం వద్దు ఏచెట్టు కాయో పండో తింటాం కాని మా భూముల్ని వదిలి వెళ్లం. ఈ ఎస్.ఇ.జెడ్. వచ్చాకే మాకు బెంగ మొదలయ్యింది. మాకు ఎవరు సహాయం చేసినా వాళ్లకు మొక్కుతాం' అని దీనంగా తన గుండెలోని బాధను వ్యక్తం చేసింది.

సంవత్సరాలున్న ఓ యువకుడు మైక్ తీసుకొని ఏదో చెప్పాలనే తపనతో బా... బా... అని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు. ఆ తర్వాత తెలిసింది అతను మూగవాడని. అయితేనేమి అతను మాత్రం గత సంవత్సర కాలంగా గ్రామంలోకి అధికారులు, పోలీసులు వచ్చి రైతులతో బలవంతంగా రాయించుకుంటున్న అంగీకార పత్రాలు చించివేయడం, వాహనాలు రాకుండా గోతులు తవ్వడంలాంటి నిరసన కార్యక్రమాల్లో అగ్రభాగాన ఉంటున్నాడని అక్కడి ప్రజలు చెప్పడంతో మాకు ఒకింత ఆశ్చర్యమేసింది.

ప్రజలను బెదిరించి మరీ అంగీకార పత్రాల మీద సంతకాలు పెట్టించుకుంటున్నారు. అధికారులు బలవంతంగా భూములు లాక్కుంటున్నారు. సెజ్ కుంపటి రగులుతున్న ప్రాంతాల ప్రజలు రెండు సంవత్సరాలుగా రోజొక యుగంగా కాలం వెళ్లదీస్తున్నారు. కాళ్ల కింద భూమి కదిలిపోతోందని ఆందోళన చెందుతున్నారు. ఒక్కో ఎకరాకు మూడు లక్షల రూపాయలు చెల్లించినట్లు అధికారులు ప్రకటిస్తున్నారు. పది లక్షల రూపాయలు ఇచ్చినా భూములు అమ్మబోమని రైతులు తెగేసి చెబుతున్నారు. ఇన్నాళ్లు ఈ గ్రామాల వైపు కన్నెత్తి చూడని స్థానిక ఆర్.డి.ఒ., ఎం.ఆర్.ఒ., గ్రామ కార్యదర్శులు ఊళ్లోనే తిష్ఠవేస్తున్నారు. అంతేగాక ఒక్క శ్రీరాంపురం గ్రామంలోనే 1400 మంది పోలీసులను మోహరించి ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తున్నారు.

ప్రభుత్వాల అభివృద్ధి నమూనా ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబించాలి. కానీ దేశంలో ప్రజలను నిర్వాసితులను చేసి పెట్టుబడిదారుల ఆకాంక్షలు నెరవేర్చే విధంగా పాలకులు అభివృద్ధి ప్రణాళికలు రూపొందిస్తున్నారు. బహుళజాతి సంస్థల కోసమే సెజ్ చట్టం అమల్లోకి తీసుకువచ్చారు. నందిగ్రామ్ స్ఫూర్తితో కాకినాడ సెజ్ బాధితులు పెద్ద ఎత్తున ఆందోళనకు సన్నద్ధమవుతున్నారు. దున్నేవారికే భూములు పంచాలంటూ ప్రభుత్వం పై చైతన్యయుతమైన పోరాటాలు నిర్వహించిన తెలుగు సమాజం, ప్రస్తుతం ఆ ప్రభుత్వం బారీ నుంచే సొంత భూమిని కాపాడుకోవడానికి పోరాటం చేయాల్సి రావడమే ఓ విషాదం. ◆

*గత నాలుగు దశాబ్దాలుగా ప్రాంతీయతనూ, మతతత్వాన్నీ కలగలిపి ముంబై నగరంలో మహారాష్ట్ర రాజకీయాలలో శివసేన చేస్తున్న ప్రచారమే ఇవాళ మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన చేస్తోందంటున్నారు* **ఎస్. యాకయ్య**

# గాడి తప్పిన నినాదం

'మీ ముంబైకార్' (నేను ముంబై వాసిని) అనే నినాదం దేశ వాణిజ్య రాజధాని ముంబై మహానగర వీథుల్లో మరోసారి మార్మోగు తోంది. వారం రోజులపాటు ఉత్తరాది రాష్ట్రాల ప్రజలపై మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన (ఎం.ఎన్.ఎస్.) కార్యకర్తలు చేసిన దాడులతో ముంబై అట్టుడికిపోయింది. ఈ మహానగరం మరాఠీ మాట్లాడేవారి కోసమేనని, దీన్ని వాళ్లే పాలించాలని తొలి నాళ్లలో శివసేన చేసిన వాదనను మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన వ్యవస్థాపకుడు రాజ్ థాకరే మరోసారి తెరపైకి తెచ్చారు. ఫలితంగా ప్రశాంతంగా ఉన్న ముంబై మహానగరంలో అలజడి రేగింది. అక్కడ నివసిస్తున్న పక్క రాష్ట్రాల ప్రజల్లో ఆందోళన మొదలైంది.

## నాలుగు దశాబ్దాలుగా నలుగుతున్న వివాదం

ముంబైలోని శివాజి పార్కులో ఇటీవల నిర్వహించిన యు.ఎన్.పి.ఎ. సభలో మరాఠీ వ్యతిరేక వ్యాఖ్యలుండే 'గంగా' అనే భోజ్‌పురి సినిమా ప్రదర్శన మహారాష్ట్ర నవనిర్మాణ్ సేనకు ఆగ్రహం తెప్పించింది. రాజ్ థాకరే విమర్శలకు సమాధానంగా అదే సభలో 'శివసేన అధినేత బాల్ థాకరే, కార్యనిర్వాహక అధ్యక్షుడు ఉద్ధవ్ థాకరే తప్ప, నాకే థాకరే తెలియదు' అంటూ అమితాబ్ సతీమణి జయాబచ్చన్ చేసిన వ్యంగ్య వ్యాఖ్యలు మరింత వివాదాన్ని రేపాయి. 'రియల్టర్ రాజ్ థాకరేకు మహారాష్ట్ర నలుమూలలే గాక, ముంబై నడిబొడ్డున వందల కోట్ల రూపాయల విలువైన భూములున్నాయి. వాటిలో కాస్త భూమిస్తే బాలికల కళాశాల పెట్టడానికి సిద్ధమే' అంటూ ఆమె ఘాటుగా స్పందించినతీరు ఈ వివాదానికి తక్షణ కారణాలుగా పైకి కనిపిస్తున్నాయి. కానీ, మహారాష్ట్రేతరులపై రాజ్ థాకరే లేవనెత్తిన నినాదం ఇవ్వాల్టిది కాదు. 1966లోనే 'బొంబై ఉద్యోగాలు బొంబై వాసులకే' అని బాల్‌థాకరే ఇచ్చిన నినాదం శివసేన మహారాష్ట్రలో బలపడడానికి ఊతమిచ్చింది. ఈ నినాదంతో ప్రాంతీయత, మతతత్వాన్ని కలగలిపి గత నాలుగు దశాబ్దాలుగా ముంబై నగరంలో, మహారాష్ట్ర రాజకీయాలలో శివసేన అంతర్లీనంగా ప్రచారం చేస్తూ వస్తోంది. అయితే తొలినాళ్లలో తెలుగువారి మీద, తమిళుల మీద శివసేన దాడి చేయగా, ఆ పార్టీ చీలికనేత, మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన వ్యవస్థాపకుడు రాజ్ థాకరే మాత్రం తన గురిని ఉత్తరాది రాష్ట్రాలైన బీహార్, ఉత్తర్‌ప్రదేశ్, బెంగాల్‌ల మీద ఎక్కుపెట్టారు. బయటి రాష్ట్రాల నుంచి వలస వస్తున్న ప్రజలతో ముంబై మహానగరం పెద్ద మురికివాడగా తయారవుతోందని ఆయన ఆగ్రహం, ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. రాష్ట్రంలో ఉద్యోగాలన్నీ శాశ్వత నివాసులకే రిజర్వ్ చేయాలని, ప్రజలు వ్యక్తిగతంగా నిర్వహించుకునే మత వేడుకలు స్థానికులకు చెందినవై ఉండాలనేది రాజ్ థాకరే డిమాండ్. ఆధిపత్యాన్ని ప్రదర్శించడానికే ఉత్తర భారతీయులు ముంబైలో 'ఛాత్' పూజలు నిర్వహిస్తున్నారని ఆరోపణ.

ఇటీవల ఆయన దాయాది ఉద్ధవ్ థాకరే ఉత్తర్‌ప్రదేశ్ వలస కార్మికుల సమావేశం ఏర్పాటు చేసి, వారి సమస్యలు గురించి చర్చించారు. అప్పటి నుంచే రాజ్ థాకరే మనసులో ఉత్తరాది వలసను ఓ ఆయుధంగా చేసుకోవాలనే ఆలోచన వచ్చినట్లు కనిపిస్తోంది. ఈ అంశానికి అధిక ప్రాచుర్యం కల్పించడం కోసం ఆయన 'బిగ్ బీ' అమితాబ్‌ను తొలి లక్ష్యంగా చేసుకున్నారు. అమితాబ్ మహారాష్ట్రలో ఉంటూ తన సొంత రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండటం, తన కోడలు ఐశ్వర్యరాయ్ పేరిట ఉత్తర్‌ప్రదేశ్‌లో విద్యాలయాన్ని కట్టించడం లాంటి అంశాలనే రాజ్ థాకరే అస్త్రాలుగా మార్చుకున్నారు. ముంబైలో నివసిస్తున్న ఉత్తరాది ప్రజలపై మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన కార్యకర్తలు దాడులు జరిపి, వారి ఆస్తులను ధ్వంసం చేశారు. అంతటితో ఆగక అమితాబ్ ఇంటిపై సీసాలు, రాళ్లు విసురుతూ నానా దుర్భాషలాడారు. ఈ దాడుల్లో అనేక మంది గాయాల పాలవగా, నాసిక్‌లో ఒకరు మృతి చెందారు. సుమారు 15,000 మంది ఉత్తర భారతీయులు తమ స్వస్థలాలకు వెళ్లిపోయారు. 70 దాకా కంపెనీలు మూతపడ్డాయి. ట్యాక్సీ డ్రైవర్లు, చిల్లర వర్తకులు, వలస కూలీలు, కార్మికులపైన ప్రతాపం చూపించడం ద్వారా తమ ప్రాబల్యం పెంచు కోవాలనుకోవడం సిగ్గుచేటు. సామాన్య ప్రజలపై దాడులకు పాల్పడ్డ మహారాష్ట్ర నవనిర్మాణ్ సేనకు గాని, శివసేనకు గాని ముంబై లో బహుళజాతి కంపెనీలు చేస్తున్న లక్షల కోట్ల రూపాయల దోపిడీ కనిపించకపోవడం దారుణం.

## వారసత్వ ముద్ర కోసమే

నాలుగు రోజులు జాతీయ వార్తల్లో నలిగిన పేరు రాజ్ థాకరే. శివసేన యువజన విభాగం నాయకుడిగా ఆయన రాజకీయ రంగ ప్రవేశం చేశారు. 1990లో జరిగిన ఓ రాజకీయ హత్యకేసులో ఆయనకు సంబంధం ఉందని ఆరోపణలు ఎదుర్కొన్నారు. బాల్ థాకరే వయసు పైబడుతుండడంతో ఆయన వారసత్వం కోసం పోటీ ఏర్పడింది. ఆయన తన కుమారుడు ఉద్ధవ్ థాకరేను క్రియాశీల రాజకీయాల్లో పాల్గొనేలా

ప్రోత్సహించడంతో, రాజ్ థాకరేకు పార్టీలో ప్రాధాన్యత తగ్గుతూ వచ్చింది. దీంతో ఆయన రెండు సంవత్సరాల క్రితం మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన స్థాపించారు. శివసేనకు తానే సిసలైన వారసుడినని నిరూపించుకోవడానికి తగిన సందర్భం కోసం ఎదురు చూస్తున్నాడు. ఎం.పి. జయాబచ్చన్ చేసిన వ్యాఖ్యలనే ఆయుధంగా మలుచుకొని ఉత్తరాది రాష్ట్రాల ప్రజలపై దాడికి పిలుపునిచ్చారు.

## సంకట స్థితిలో శివసేన, ప్రేక్షక పాత్రలో కాంగ్రెస్

మొదట 'మీ ముంబైకార్' నినాదాన్ని ప్రచారంలోకి తెచ్చిన శివసేన వైఖరిలో కొంత మార్పు కనిపిస్తోంది. గత కొన్ని దశాబ్దాలుగా ముంబైలో నివసిస్తున్న వారికి తాము వ్యతిరేకం కాదని, కేవలం దోచుకోవడానికే ఈ మహానగరానికి వస్తున్న ఉత్తర ప్రదేశీయులు, బీహారీలకు వ్యతిరేకమని శివసేననేత ఉద్ధవ్ థాకరే తొలుత ప్రకటించారు. కొద్ది రోజుల క్రితం ఉత్తరాది వలస కూలీలతో ఉద్ధవ్ ఓ సమావేశం కూడా నిర్వహించి, వారి సమస్యలపై చర్చించడం, బాల్ థాకరే ప్రస్తుత వివాదంలో అమితాబ్‌కు మద్దతుగా నిలవడం కూడా మారిన శివసేన వైఖరికి దృష్టాంతాలు. రాష్ట్రపతి ఎన్నిక విషయంలో తప్పితే శివసేన ఇటీవలి కాలంలో మహారాష్ట్ర ప్రాంతీయ తత్వాన్ని స్పష్టంగా ప్రకటించిన దాఖలాలు లేవు. అయితే ఎం.ఎన్.ఎస్. కార్యకర్తలు ముంబైలోనే గాక మహారాష్ట్ర నలుమూలల స్వైర విహారం చేస్తుండడంతో ఆ పార్టీ సంకట స్థితిలో పడింది. తమ ఉనికికి ఎక్కడ భంగం వాటిల్లుతుందోననే భయంతో శివసేన కూడా రాజ్ థాకరే రాజేసిన మంటలకు ఆలస్యంగానైనా ఆజ్యం పోసింది. ఆ పార్టీ కార్యకర్తలు హిందీ, ఇంగ్లిష్ బోర్డులకు నల్లటి రంగువేసి వాటి స్థానంలో మరాఠీ బోర్డులు తగిలించారు. రెండు పార్టీల పరిస్థితి ఇలా ఉంటే పాలక పక్షమైన కాంగ్రెస్ మాత్రం ప్రేక్షక పాత్ర పోషించింది. శివసేన ఓట్లు ఎలాగైనా చీల్చాలనేది కాంగ్రెస్ అసలు లక్ష్యం. అందుకే ఇరు పార్టీల మధ్య నెలకొన్న వైరం తమకు లాభిస్తుందనే ఆలోచనతో వివాదం ముదిరే వరకు మౌనం దాల్చింది. అంతేగాక అవకాశం దొరికినప్పుడల్లా ప్రాంతీయ వాదాన్ని రెచ్చగొట్టే నేషనలిస్ట్ కాంగ్రెస్ పార్టీ (ఎన్.సి.పి.) అధినేత శరద్‌పవార్ కూడ ఎం.ఎన్.ఎస్. ఆగడాలను ఖండించే సాహసం చేయలేదు.

వివాదానికి మూలకారకుడైన అధినేత రాజ్ థాకరే రెచ్చగొట్టే ప్రసంగాలు చేశారని ఆరోపిస్తూ పోలీసులు పలు సెక్షన్ల కింద కేసులు నమోదు చేశారు. అయితే అరెస్ట్ చేయడానికి మొదట తత్సారం చేసిన పోలీసులు ఎట్టకేలకు ఆయనను ఫిబ్రవరి 13న అరెస్ట్ చేశారు. 'రెచ్చగొట్టే ప్రసంగాలు చేయరాదనే షరతు'తో న్యాయమూర్తి బెయిల్ ఇవ్వడంతో మూడు గంటల్లోనే విడుదల చేశారు. విడుదలైన రెండో రోజే రెచ్చగొట్టే వ్యాఖ్యలు చేయడం గమనార్హం. సమాజ్‌వాదీ పార్టీ మహారాష్ట్ర శాఖ అధ్యక్షుడు అబు అసమ్ ఆజ్మీని అరెస్ట్ చేసి, విడుదల చేశారు.

నిజానికి ముంబై ఒకప్పుడు వామపక్ష కార్మికోద్యమానికి బలమైన కేంద్రం. ఈ కార్మికోద్యమం ఆయా పార్టీలకు జాతీయ నాయకత్వాన్ని అందించింది. చారిత్రాత్మకమైన సమ్మె పోరాటాలు నిర్వహించింది. దీంతో కార్మిక సంఘాలను బలహీనపర్చడానికి పెట్టుబడిదారీ వర్గాలు శివసేన లాంటి మతతత్వ శక్తులను పెంచి పోషించాయి. ఫలితంగా కమ్యూనిస్టు కార్మికోద్యమం బలహీనపడుతూ వచ్చింది.

## సామాజిక ఆర్థిక కోణాలు

'భారత హృదయం గ్రామాల్లో ఉంది' అన్నట్లే, ముంబై మహానగర హృదయం మురికివాడల్లో ఉంది. భారత పాలకవర్గాలు అవలంబిస్తున్న అభివృద్ధి నమూనాకు ఈ నగరం ప్రత్యక్ష ఉదాహరణ. తులతూగే సిరి సంపదలకు ఆకాశహర్మ్యాలు ఒకవైపు, ఆ పక్కనే రోడ్లకిరువైపుల ఫుట్‌పాత్‌ల మీద అంతస్తులను పోలిన గుడిసెల్లాంటి నిర్మాణాలు మరోవైపు దర్శనమిస్తాయి. బతుకుదెరువు కోసం వివిధ రాష్ట్రాల నుంచి వలసవచ్చిన ట్యాక్సీ డ్రైవర్లు, దినసరి కూలీలు, కార్మికులు తదితర సెక్షన్ల ప్రజల ఆవాసాలు ఈ కుటీరాలు. ఇక్కడి జనాభాలో సగం మంది మురికివాడల్లో బతుకులు వెళ్లదీస్తున్నారంటే అతిశయోక్తి కాదు. వీరులేని ముంబై మహానగరాన్ని ఊహించుకోవడం కష్టమే. అయితే ఇక్కడ మత, ప్రాంతీయతత్వ శక్తులు విజృంభించినప్పుడల్లా మురికివాడల ప్రజలే బలికావడం విషాదం. తాజా వివాద నేపథ్యంలో కూడా అదే పునరావృతమైంది.

స్వాతంత్ర్యం వచ్చి అరవై ఏళ్లు గడిచినా సామాజిక, ఆర్థిక అంతరాలు తొలగిపోకపోగా మరింత పెరిగాయి. పాలకవర్గాలు అనుసరిస్తున్న అభివృద్ధి నమూనాతో అసమానతలు మరింతగా పెరిగాయి. ఆయా రాష్ట్రాల (ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, బీహార్, ఉత్తరప్రదేశ్, బెంగాల్) ప్రభుత్వాలు స్థానిక ప్రజలకు ఉపాధి చూపడంలో విఫలం కావడమే వలసలకు ప్రధాన కారణం. పరిశ్రమల స్థాపనలో చిన్న పట్టణాలు, నగరాలను నిర్లక్ష్యం చేయడం మరో కారణం. అధికారంలో ఉన్నప్పుడు సమస్యకు శాశ్వత పరిష్కారం చూపెట్టలేక పాలకవర్గ పార్టీలు ఓటు బ్యాంక్ రాజకీయాలకోసం ఉన్మాదాన్ని రెచ్చగొడుతూ ఇలాంటి నినాదాలు ముందుకు తెస్తున్నాయి. ప్రస్తుతం ముంబైలో పరిస్థితి ప్రశాంతంగా కనిపించినప్పటికీ, కొన్ని దశాబ్దాలుగా శివసేన, ఇవ్వాళ్టి మహారాష్ట్ర నవనిర్మాణ్ సేన సృష్టించిన మత, ప్రాంతీయ తత్వ ఉన్మాద ధోరణులు నివురు గప్పిన నిప్పులా మహారాష్ట్ర సమాజాన్ని వెంటాడక మానవు. మహారాష్ట్ర సమాజానికి ఇప్పుడు కావాల్సింది ఓదార్పు కాదు. చికిత్స కావాలి. మహారాష్ట్ర భూమి పుత్రుల ఆకాంక్షలు నెరవేరుస్తూనే, పొట్ట చేత పట్టుకుని ముంబైకి వలస వస్తోన్న లక్షలాది శ్రమ జీవులకు రాష్ట్ర ప్రభుత్వం భరోసా ఇవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. మనీ ఆర్డర్లులోని స్పేస్ కాలంలో అడ్రస్ పూర్తిగా రాయాలి. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

**- సర్క్యులేషన్ మేనేజర్**

*భాషతో ప్రమేయం ఉన్న అన్ని రంగాల్లోనూ మాతృభాషనే ప్రోత్సహించాలి. తెలుగు భాషా వ్యాప్తికి - భాషాభిమానులందరి కృషి అవసరం, అనివార్యం అంటున్నారు* **విద్యాభూషణ్**

# తెలుగు భాషా వికాసం - పూర్వాపరాలు

'దేశ భాషలందు తెలుగు లెస్స' అన్న కృష్ణదేవరాయుని ప్రస్తుతి ఓ అక్షర వాస్తవం. ఈనాటికీ సుమారు పదికోట్ల ఆంధ్రుల తెలుగుభాష ప్రపంచ వ్యాప్తంగానే అరుదైన భాషగా గుర్తింపును సంతరించుకుంది. చరిత్ర పుటలను పరికిస్తే, అష్ట దిగ్గజాలుగా పేరొందిన తెలుగు కవుల తెలుగుభాషా మాధుర్యానికి పులకించి, శిరస్సు వంచి శ్రీకృష్ణదేవరాయలు చేసిన సాహిత్యారాధన ఓ గర్వకారణంగా నిలుస్తుంది. పోతన భాగవతం లోని తెలుగు సొగసు, నన్నయ్య భారతం, అలాగే త్యాగయ్య, రామదాసు, క్షేత్రయ్య, అన్నమయ్యల కృతులు, కీర్తనలు, అష్టపదులు ఒక్కసారి వింటేచాలు గుండె గొంతులో అనుభూతిని నింపిన అనుభవం కలుగుతుంది.

వేమన రాసిన శతకాన్ని తడిమితే వడబోసిన జీవన సత్యాలు అత్యంత సులభశైలిలో మనసును హత్తుకునే అనుభూతిని పొందగలుగు తామంటే అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. ఆ వరసనే గురజాడ, రాయప్రోలు వారి దేశభక్తి గేయాలతో దేహం గగ్గుర్పొడుస్తుంది. అలాగే కాటూరి, దేవులపల్లి, తిలక్, దాశరథి, సినారె మొదలగువారు తమతమ కవితా ధోరణులతో నూతనపుంతలతో తెలుగుభాషకు వన్నె తెచ్చారు. ప్రయోగరీత్యా చూస్తే ఆర్ద్రత, భాషా సౌందర్యంతో శ్రీశ్రీ పలికించిన విప్లవకాంక్ష నాటికీ, నేటికీ, ఏనాటికీ సజీవంగానే నిలిచి పోతుంది. ఇక తెలుగు వచనా కవిత్వ విషయానికి వస్తే ఎంతమంది మహానుభావులో. చిలకమర్తి, అడవి బాపిరాజు, చలం, బుచ్చిబాబు, పానుగంటి, రావిశాస్త్రి మొదలైన ఘనులంతా ఈ దిశగా చేసిన కృషి అపారం. సాహితీ రంగాల్లో తెలుగుకు ఇంతటి విస్తృతి ఎలా సాధ్యమైందని ప్రశ్నించుకుంటే.

### వ్యావహారిక భాషోద్యమం

'భాష' అంటే భావ ప్రకటనా సాధనం. అందుకనే భాష భావ వినిమయానికి, సులభ గ్రహణకు అమితంగా తోడ్పడాలి. ఎంతటి ప్రగతిదాయకమైన అంశమైన భాషా మాధ్యమం ద్వారానే ప్రజలకు చేరువ కావాలి కదా. ఈ క్రమం ఓ నిరంతర ప్రవాహం. ఇందులో కొత్తపాతలు, భిన్న జాతుల ప్రమేయం, వారివారి ప్రాంతీయతా ప్రభావం, తద్వారా తలెత్తే ఉచ్చారణా భేదాలు అనివార్యంగా చోటుచేసుకుంటాయి. ఇన్ని విభిన్న లక్షణాల మధ్య నిర్దిష్ట నియమాలూ అవసరమౌతాయి. వీటిని రాబోయే తరాలకు భాషా పునాదిగా అందించేందు కనువుగా నమోదు చేయాల్సి ఉంటుంది. ఈ క్రమంలోనే సాహిత్యంలో వ్యావహారిక భాషకు, భాషా నమోదులో వినియోగించే 'గ్రాంధిక భాష'కు వైరుధ్యం పొడచూపింది. అయితే ఈ వైరుధ్యం ఇతర భాషల్లో కన్నా తెలుగులో కాస్త ఎక్కువగా ఉంది. ఈ తేడాను లేదా వైరుధ్యాన్ని కుదించేందుకే వ్యావహారిక భాషోద్యమం తలెత్తింది.

ఈ వ్యావహారిక భాషోద్యమం 1910లో ప్రారంభమయింది. అయితే అప్పటికే రచనా ప్రక్రియ వ్యవహరించే తీరునే జరగాలన్నది పలువురి అభిప్రాయంగా ఉంటున్నా అమలుకు సాహసించలేదు. అయితే పాఠ్యాంశాలను వ్యావహారిక శైలిలో చేపట్టాలనే డిమాండ్ 1920 నుండి అధికమైంది. ఇందుకు కారణం 1903లో అప్పటి గవర్నర్ జనరల్ కర్జన్ విద్యాభివృద్ధిని సమీక్షించేందుకు ఓ కమిటీని నియమించాడు. ఈ కమిటీ, 'విద్యాధికులు తాము నేర్చిన అంశాలను జనసామాన్యానికి సులభంగా చెప్పగల శక్తి, సామర్ధ్యాలను తమ విద్యార్జనా పద్ధతుల ద్వారా పొందలేకపోయారని' స్పష్టం చేసింది. దీంతో భాషా వ్యాప్తి పూర్తిగా నిర్లక్ష్యానికి గురైందని నాటి పెద్దలు గుర్తించారు. ఆనాటి నుంచే 'వ్యాసరచన'ను మాతృభాషలో ఓ పాఠ్యాంశంగా ప్రవేశపెట్టారు. ఈ సందర్భంలోనే విద్యార్థులకు గ్రాంధిక భాషా శైలిని నేర్పించాలా? వ్యావహారిక భాషా శైలిని నేర్పించాలా? అన్న మీమాంస అధికారులకు కలిగింది. ఈ రెండు ధోరణుల వ్యత్యాసాన్ని వారు పూర్తిగా అవగాహన చేసుకున్నందునే ఈ సందేహం చోటు చేసుకుంది. ఈ వ్యత్యాస కారణాలను వెలికి తీసేందుకై జె.వి. ఏట్స్, పి.టి. శ్రీనివాసయ్యంగార్, గురజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి గార్లను కలుసుకుని చర్చించారు. ఈ చర్చల్లో సైతం సులభ, వ్యావహారిక భాషా శైలిలో పాఠ్యాంశాలు రూపొందించడమే విజ్ఞాన వికాసానికి దోహదపడుతుందనే అభిప్రాయం వ్యక్తమయింది. విద్యారంగంలో వచ్చిన మార్పుల కారణంగా పాఠ్య ప్రణాళికల్లోనూ మార్పులు చోటు చేసుకుంటున్న కాలమిది. పాఠ్యాంశాలు – పరీక్షాంశాలు ఒక్కటే అయినందున, వ్యాస రచనకు అనువాదానికి మధ్య పరిమితుల ప్రస్తావన తలెత్తింది. వ్యావహారిక భాషే ఇందుకను వైందిగా ఆధునిక భావాలున్న విధానవేత్తలంటే, పూర్వాచార పరాయణు లైన పండితులు దీన్ని పూర్తిగా తిరస్కరించారు. ఇదే అదునుగా గిడుగు కావ్య భాషా నిరుపయోగతను ఎలుగెత్తి చాటుతూ భాషా పరిణామాలను విశదం చేశారు. పండితులు ఈ వాదాన్ని అంగీకరించలేదు. అప్పుడే పి.టి. శ్రీనివాసయ్యంగార్ 'లాంగ్వేజ్, లైఫ్ అండ్ డెత్' అనే పుస్తకాన్ని రాసి పండితులను మరింత రెచ్చగొట్టారు. దీంతో పి.టి. శ్రీనివాసయ్యంగార్, ఏట్స్, గురజాడ, గిడుగులను దుష్ట చతుష్టయమని,

తెలుగుభాషకు ద్రోహం తలపెట్టారనీ జయంతి రామయ్య పంతులు నాయకత్వంలో ఆందోళన చేపట్టారు. విద్యార్థుల వ్యాస రచనా పాఠ్యాంశంలో వ్యావహారిక భాషను అనుమతిస్తూ ప్రభుత్వం జారీ చేసిన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని పెద్ద పెట్టున విజ్ఞాపనలు చేశారు. ఈ గ్రాంథిక వాదుల వాదం ఏంటంటే, వ్యావహారిక భాష పలు మాండలికాలతో త్వరితగతిన మారిపోతుందని. ఈ వివాద పరిష్కారానికి మద్రాస్ విశ్వవిద్యాలయం ఓ సంఘాన్ని నియమించింది. ఎం. రంగాచార్యుల అధ్యక్షతన ఈ సంఘం పలు సమావేశాలు జరిపి, శిష్ట వ్యవహారానికి అనుకూలంగా తీర్మానించింది. ఆధునిక భాష అంటే ఏంటో నిర్వచించింది. స్కూలు ఫైనల్ పరీక్షల్లో, వ్యాస రచన అనువాదాల్లో వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయం అనుమతించింది. తదనంతరం వ్యావహారిక భాషను గ్రామ్య భాషగా చిత్రిస్తూ దేశంలో పెద్ద ఆందోళనను లేవదీశారు. మాండలికం ఆయా ప్రాంతాలకే పరిమితమౌతుందనీ, భాషకు ఏకరూపత ఉండదనీ, తద్వారా పదాల అవగాహన విద్యార్థులకు కొరవడుతుందనీ, వ్యాకరణ నియమాలు లేని కారణంగా సమగ్ర పద స్వభావమే కొరవడుతుందనీ గ్రాంథిక వాదుల వాదన. చిట్ట చివరికి వ్యాసరచనలో గ్రాంథికభాషా ప్రయోగమైనా, వాడుక భాషా ప్రయోగమైనా ఆమోదమేనని తీర్మానించారు.

నామవాచక సర్వనామ క్రియారూపాల వర్గీకరణకై వెంకట్రామ శాస్త్రి, లక్ష్మణరావు, అప్పారావుగార్లతో ఓ కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీలో రాయలసీమ వారి ప్రాతినిధ్యం లేదని విమర్శ రావడంతో కోలాచలం శ్రీనివాసరావు, శంకరలింగం పిళ్లె, నాగపూడి కుప్పు స్వామయ్య, బారిస్టర్ కె. సుబ్బారెడ్డి సభ్యులయ్యారు. పదపట్టికల తయారీలో అభిప్రాయ భేదాలు తలెత్తాయి. గురజాడ 'డిసెంట్ నోట్'లో గ్రాంథిక భాషావాదుల అభిప్రాయం నెగ్గింది. దీంతో మద్రాస్ విశ్వవిద్యాలయం ఇదివరకు వ్యావహారిక భాషను అనుమతిస్తూ, తామిచ్చిన అనుమతిని 1914 ఆగస్ట్ 14న ఉపసంహరించుకుంది. తరువాత గురజాడ కన్యాశుల్కం, గిడుగు సేకరించిన నిదర్శనాల ఫలితంగా వ్యాసావళి, గద్య చింతామణి, బాలకవి శరణ్యం, ఆంధ్ర పండిత బిషక్కుల భాషా భేషజం వంటి ప్రయోగాలు వెలుగులోకి రావడం వలన వ్యావహారిక భాషోద్యమం మళ్లీ ఊపిరి పోసుకుంది. ఇంగ్లిష్‌లో తెలుగు వ్యావహారిక భాషా నిఘంటువును రచించిన గెలట్లీ దొర ప్రభుత్వ వ్యవహారాలను ఏ భాషలో నిర్వహిస్తారని ఆనాడే ప్రశ్నించాడు. గ్రాంథిక వాదులు కూడా వాస్తవాన్ని గ్రహించి సులభ శైలిలో రాయడం ప్రారంభించారు. వ్యావహారికం వివిధ రీతుల్లో ఉన్నప్పుడు పాఠ్య పుస్తకాల్లో ఏ ప్రాంతీయ భాష వాడాలని కొందరి తర్కం. దినపత్రికల్లో, కథల్లో, నవలల్లో వాడే భాష ప్రామాణికమని సమాధానం వచ్చింది. దీంతో వ్యావహారిక భాషా వినియోగం బలం పుంజుకుంది. సర్వత్రా ఆమోదం పెరగడం, వ్యావహారిక భాషా వ్యాకరణానికి ఉనికినిచ్చింది.

అనంతరం తెలుగు లాంగ్వేజ్ కమిటీ ఏర్పడి భాషా ప్రయోగంలో కొన్ని సూచనలను అకడమిక్ కౌన్సిల్‌కు అందించింది. కౌన్సిల్ ఆమోదించింది. దీని ప్రకారం విద్యార్థులు పరీక్షల్లో జవాబులను శిష్ట వ్యావహారిక భాషను గానీ, గ్రాంథిక భాషను గానీ వాడవచ్చునని సూచన అమల్లోకి వచ్చింది. పాఠ్య గ్రంథాల్లో వ్యావహారిక భాషా వినియోగం పెరుగుతూ, వ్యావహారిక భాషా ప్రయోగమే ప్రగతికి మూలం అన్న విశ్వాసం సర్వత్రా పాదుపోసుకుంది.

## విద్యారంగంలో తెలుగు

ఏ దేశంలోనైనా మాతృభాషలోనే విద్యను నేర్చుకోవడం ఉంటుంది. విషయం సూటిగా తేలిగ్గా అర్థం అయ్యేందుకు మాతృభాషా బోధన దోహదపడుతుంది. అయితే బ్రిటిష్ వారి ఏలుబడిలో మెకాలే ఇంగ్లిష్ విద్యా బోధనను మన నెత్తిన రుద్దాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 'త్రిభాషా సూత్రం' అంటే దేశ భాష, మాతృభాష, ప్రపంచ భాష మొత్తం మూడు భాషలను ప్రతి విద్యార్థి అభ్యసించాలనే నియమం అమల్లోకి వచ్చింది. మాతృభాషలో విద్యా బోధన అమల్లో ఉన్నా విశ్వవిద్యాలయ స్థాయిలో ఇంగ్లిష్ బోధనా మాధ్యమంగా అమలవుతోంది. అన్ని వృత్తి కోర్సుల అధ్యయనం ఇంగ్లిష్‌లోనే. అఖిల భారత స్థాయిలో పాలనా విభాగపు పరీక్షలు ఇంగ్లిష్‌లోనే నిర్వహించడం, మాతృభాషా బోధనకు గండికొడుతోంది. ఈ నేపథ్యంలో తెలుగు భాషా వ్యాప్తికి తెలుగు అకాడమీ, అధికార భాషా సంఘం వంటి సంస్థలు ఏర్పడి సర్వత్రా కృషి చేస్తున్నాయి. పాలనా భాషగా మాతృభాషను వాడేందుకై దశాబ్దాలుగా కృషి జరుగుతూనే ఉంది. పాలక సిబ్బందికి శిక్షణా తరగతులు, పర, మాతృభాషీయులకు ప్రాథమిక – ఉన్నత స్థాయిల్లో వలుకోర్సులు నిర్వహించారు. తెలుగు అనువాద రచనలను ప్రోత్సహిస్తున్నారు. సాంకేతిక విద్యారంగాల్లో తెలుగు వినియోగానికై పాఠ్యాంశ అనువాదులను ప్రోత్సహిస్తున్నారు. తెలుగు భాషా పరిశోధన, తెలుగు సాహిత్య వికాసానికి ప్రతి జిల్లాలో తెలుగు అకాడమి ఏర్పాటు చేయాలనే పథకానికి ఆలోచనలు చేస్తున్నారు. జిల్లాస్థాయి గ్రంథాలయాల్లోనైనా తెలుగు సాహిత్యం సమగ్రంగా లభించేలా ప్రయత్నాలు చేయాలని పలువురు అభిప్రాయ పడుతున్నారు. అలభ్య తెలుగు సాహిత్యాన్ని మళ్లీ ప్రజలకందించేదుకై తెలుగు అకాడమీ ఓ పథకాన్ని చేపడుతోంది. విశ్వవిద్యాలయాల్లో నమోదైన పరిశోధనా గ్రంథాలను తెలుగులోకి అనువదించి ప్రచురించడం భాషా వ్యాప్తికి, పరిశోధనల వ్యాప్తికి దోహదపడుతుంది.

ఈ నేపథ్యంలోనే, అంటే మాతృభాషా వ్యాప్తికి ఇన్ని రకాలుగా కృషి చేసేందుకు చేయూత నివ్వాల్సిన ప్రభుత్వాలు – ప్రపంచీకరణ నేపథ్యంలో ఇందుకు పూర్తి భిన్నమైన నిర్ణయాలను చేపడుతున్నారు. విద్య వ్యాపార దినుసైనందున కార్పొరేట్ విద్య ఇంగ్లిష్ మాధ్యమాన్నే పోషిస్తూ ఉంది. ఉపాధి వెతుకులాట దేశ పరిధులు దాటిస్తున్నందున ఆంగ్ల మాధ్యమం అనివార్యమైపోతోంది. ఆధునిక యువతకు, సర్వత్రా పోటీ నెలకొన్నందున మార్కుల శాతానికై, పరభాషలను రెండో భాషగా ఉన్నత విద్యలో ఎంచుకోవాల్సి వస్తోంది. పైగా ప్రభుత్వమే మండల స్థాయిలో వేలాదిగా కాన్సెప్ట్ స్కూళ్ల పేరిట గురుకులాలను ఏర్పాటు చేసి ప్రోత్సహించాలని నిర్ణయం తీసుకుంది. అంటే మాతృభాషా వినియోగం ప్రాథమిక స్థాయికి కుదింపబడింది. సరిగ్గా ఈ నిర్ణయాల కుట్రల మాటున యూనెస్కో ఫిబ్రవరి 21ని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా జరుపుకోవాలని 1999లో నిర్ణయం తీసుకుంది. దీని లక్ష్యం ఒక దేశ మాతృభాషపై అంతర్జాతీయ దృక్పథాన్ని అలవర్చడమే. కాన్సెప్ట్ స్కూళ్ల ఏర్పాటు ఈ అంతర్జాతీయ మాతృభాష దినోత్సవ లక్ష్యానికి వ్యతిరేకం. భాషతో ప్రమేయం ఉన్న అన్ని రంగాల్లోనూ మాతృభాషనే ప్రోత్సహించాలి. తెలుగు భాషా వ్యాప్తికి – భాషాభిమానులందరి కృషి అవసరం. ◆

*బడుగులకు రాజ్యాధికారం, సామాజిక న్యాయం అని చెబుతున్నవి నిజమైన అర్థంలో ప్రభుత్వాధికారమే తప్ప, బడుగులకు రాజ్యాధికారం కాదంటున్నారు* **పి. కృష్ణారావు**

# బడుగులకు రాజ్యాధికారమా? ప్రభుత్వాధికారమా?

ఈ మధ్య ఏ దినపత్రిక తిరగేసినా ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ కులాలకు రాజ్యాధికారం గూర్చిన వార్తలు, ఎడిటోరియల్స్, వ్యాసాలు పుంఖానుపుంఖాలుగా వస్తున్నాయి. 'సూర్య' దినపత్రిక ఏకంగా తన బ్యానర్‌పై 'బడుగులకు రాజ్యాధికారం – సామాజిక న్యాయం' పేరుతో సదస్సులు నిర్వహిస్తున్నది. విశ్వవిద్యాలయాలలో పని చేస్తున్న దళిత మేధావులు వ్యాసాలు రాస్తున్నారు. వీరు, మాజీ బ్యూరోక్రాట్స్‌తో కలిసి సదస్సులు, సమ్మేళనాలు నిర్వహిస్తున్నారు. దేశంలోను, రాష్ట్రంలోను అధికారం ప్రధానంగా ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి పదవులు ఎక్కువ కాలం బ్రాహ్మణ, వైశ్య, రెడ్డి, కమ్మ మొదలగు కులాల చేతులలోనే ఉండి పోయిందనీ, అటువంటి అధికారం ఎస్.సి., ఎస్.టి., బి.సి. మైనారిటీ కులాలకు దక్కాలనీ, రాబోయే 2009 ఎన్నికలలో అధికారాన్ని చేజిక్కించుకోవాలనీ పిలుపునిస్తున్నారు. కొందరు ప్రత్యామ్నాయంగా 'చిరంజీవి'ని పార్టీ పెట్టమంటున్నారు. మరికొందరు బి.ఎస్.పి. మాయావతిని చూపిస్తున్నారు. ఉత్తర్‌ప్రదేశ్‌లోని బి.ఎస్.పి.ని ఆదర్శంగా చూపెడుతున్నారు. ఇలా మాట్లాడుతున్న వారంతా ఉత్తర్‌ప్రదేశ్‌లో బి.ఎస్.పి. నాయకత్వంలో బడుగులకు రాజ్యాధికారం వచ్చిందనీ, కేంద్రం లో బడుగుల ప్రతినిధిగా మాయావతిని ప్రధామంత్రి చేయాలనీ చెబుతున్నారు. రాజకీయార్థిక కోణంలో రాజ్యాధికారానికి, ప్రభుత్వాధి కారానికి మధ్య గల తేడాను చెరిపేసి వీరంతా మాట్లాడుతున్నారు. అసలు రాజ్యాధికారమంటే ఏమిటో, ప్రభుత్వాధికార మంటే ఏమిటో స్పష్టతలేని గందరగోళమైన చర్చను, పదప్రయోగాలను ఈ మేధావులు చేస్తూ వస్తున్నారు.

భారతదేశ విశిష్ఠ లక్షణాలలో 'కులం' ఒకటి కాదనలేనిది. ఇక్కడ వర్గం, కులం, జాతులు కలగలసిన ఒక సంక్లిష్టమైన సమాజం ఉంది. వీటికి మతాన్ని జోడించితే ఈ దేశ సాంస్కృతిక, ఆచార సంప్రదాయాలు మరింత సంక్లిష్టతను చేకూరుస్తాయి. వర్ణవ్యవస్థ ఏర్పడిన తరువాత దేశసంపద, రాజ్యాధికారం, సంస్కృతి మొదలైనవి అగ్రకులాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులాల చేతిలోనే తరతరాలుగా ఉంటూ వస్తున్నాయి. శూద్రకులాలలో కొన్ని కులాలు అగ్రకులాల వ్యతిరేక ఉద్యమాలను నడిపిన తరువాత ఆయా ప్రాంతాలలోనూ, రాష్ట్రాలలోనూ 1947 అధికార మార్పిడి తరువాత రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకొని భూమీ, పరిశ్రమలు, కాంట్రాక్ట్ పనులు మొదలైన సంపదను పోగుచేసే వనరులను కూడబెట్టుకున్నాయి. రాజకీయ పదవులలో ఎం.పి., ఎం.ఎల్.ఏ.లు స్థానిక సంస్థల పదవులు మొదలైనవి రిజర్వేషన్ సౌకర్యం తో కొంతమంది ఎస్.సి., ఎస్.టి. కులానికి చెందినవారు పొందడం ద్వారా ఆయా కులాలలో వీరుకూడా భూమి, పరిశ్రమలు, వ్యాపార వాణిజ్యాలు చేయడం ద్వారా సంపదను పోగుచేసుకున్నారు. ఈ రకంగా శూద్రకులాలు నుంచి ఎదిగిన కొందరు ప్రభుత్వాధికారాన్ని అనుభ విస్తున్నారు. వీరందరికి మొదట్లో దేశంలోనూ, రాష్ట్రంలోనూ కాంగ్రెస్ పార్టీ గొడుగులా ఉంటే, ఇప్పుడు దేశంలోనూ, రాష్ట్రంలోనూ పాలకవర్గ పార్టీలలో (పార్లమెంటరీ పార్టీలు) వచ్చిన వైరుధ్యాలు కారణంగా బహుళ పార్టీల, సంకీర్ణ ప్రభుత్వాల గొడుగు కింద వీరంతా సమీకరించబడి ఉంటున్నారు. వ్యక్తి శ్రేయస్సు, స్వార్థం తప్ప సమాజ శ్రేయస్సును గుర్తించని భూస్వామ్య, పెట్టుబడిదారీ లక్షణాలను పునికిపుచ్చుకొన్న ఈ దేశ పార్లమెంటరీ పాలకవర్గ పార్టీలు, వాటి నాయకులు ఏ కులానికి చెందిన వారైనప్పటికీ వారు అధికారంలో ఉన్నా, ప్రతిపక్షంలో ఉన్నా వ్యక్తిగత సంపదను కూడబెట్టడంలో ఉన్న శ్రద్ధ, దేశ సంపదను పెంచి, పేదరికాన్ని పోగొట్టడంలో చూపకపోవడం వల్లే దేశంలో నేటికీ సగం మంది దారిద్ర్యరేఖకు దిగువన ఉంటూ ఆకలి చావులు, ఆత్మహత్యలకు గురౌతున్నారన్నది కాదనలేని నగ్నసత్యం. ఇక మానవ శ్రమ దోపిడీ, నిరుద్యోగం గురించి ఈ దేశంలో మరీ చెప్పనక్కరలేదు. అధికారంలో ఉన్నవారి అవినీతి అంతుచిక్కడం లేదు.

పై పరిస్థితులు ఆంధ్రప్రదేశ్‌లోనూ ఉన్నాయి, ఉత్తరప్రదేశ్ లోనూ ఉన్నాయి. ఇక్కడ కాంగ్రెస్ అధికారంలో ఉన్నా, అక్కడ బి.ఎస్.పి. అధికారంలో ఉన్నా కొద్దిపాటి తేడాలతో మౌలికంగా ఒక్కలాగే ఉంది. ఇక్కడ కమ్మ, రెడ్ల చేతిలో ఉన్న ప్రభుత్వాధికారమే, అక్కడ దళితుల చేతిలోను ఉంది. అదనంగా అక్కడ బడుగులకు వచ్చిన రాజ్యాధికారం ఏమీలేదు. పై పెచ్చు ఉత్తరప్రదేశ్‌లోని బడుగువర్గాలు (కొందరు కులరీత్యా కూడా) సమాజ్‌వాది పార్టీలోనూ, కాంగ్రెస్ పార్టీలోనూ ఉన్నారు, ఇతర పార్లమెంటరీ పార్టీలలోనూ ఉన్నారు. గతంలో ములాయం సింగ్

*మనదేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల, తగ్గుదలల అనిశ్చితితో సుస్థిరమైన ప్రగతి లేదంటున్నారు*

**డా. యిమ్మానేని సత్యసుందరం**

# ఆహార భద్రత అంతంత మాత్రమే

దేశంలో ఆహార భద్రత ఆశాజనకంగా లేదు. వ్యవసాయ రంగానికి అనుకూలంగా ఉన్న కొన్ని రాష్ట్రాలలో ఆహారోత్పత్తి పెంచాలనీ ప్రభుత్వం ఆలోచిస్తుంది. ఈ నేపథ్యంలోనే ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ ఇటీవల ఆంధ్రప్రదేశ్ వచ్చారు. దేశం మొత్తంమీద సేద్యానికి అదనపు సాయం 25,000 కోట్ల రూపాయలు సమకూరుస్తామని హామీ ఇచ్చారు. జిల్లా స్థాయిలో కూడా కార్యాచరణ ప్రణాళికలు తయారు చేయాలని సూచించారు. తగు చర్యలు తీసుకోకపోతే ఆహార భద్రత కోల్పోతామని స్పష్టమవుతుంది. పదకొండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయ ఉత్పత్తి పెరుగుదల సగటుకి నాలుగు శాతం ఉండాలన్న లక్ష్యాన్ని సాధించగలమా. 2020 నాటికి దేశానికి 260 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాలు కావాలని ఒక అంచనా.

అసలు ఆహారభద్రత అంటే ఏమిటి? అది ప్రమాదస్థితిలో ఎందుకు ఉంది? ఆహార భద్రత అంటే తగినన్ని ఆహార ధాన్యాలు ఉత్పత్తి చేయడమే కాదు, అవి పేదప్రజలకు అందుబాటులో ఉండాలి. ఉత్పత్తి బాగున్నా ప్రజల దగ్గర తగిన కొనుగోలు శక్తిలేకపోతే ప్రయోజనం లేదు.

ఇంకొక విషయం. ఆహార భద్రత, ఆహార ధాన్యాల భద్రత వేరు వేరు. మనం కొన్ని ఆహార వస్తువుల విషయంలో మంచి ప్రగతినే సాధించాం. ఉదాహరణ : పాల ఉత్పత్తి 1950-51లో 17 టన్నులు ఉండగా 2006-07లో 100 టన్నులకు చేరింది. తలసరి పాల వినియోగం ఈ కాలంలో రోజుకి 124 గ్రాముల నుండి 245 గ్రాములకు పెరిగింది. అలాగే చేపల ఉత్పత్తి ఈ కాలంలో 0.75 మిలియన్ టన్నుల నుండి 6.5 మిలియన్ టన్నులకు పెరిగింది. గుడ్ల ఉత్పత్తి 48 బిలియన్లు. 1950-51లో తలసరి గుడ్ల వినియోగం 5, ఇప్పుడు 41 ఉంది. ఆహార ధాన్యాల విషయంలో పరిస్థితి ఇప్పటి వరకూ బాగున్నా పరిస్థితి చేయి దాటుతుంది.

వ్యవసాయరంగం క్లిష్ట పరిస్థితులలో ఉందనటంలో సందేహం లేదు. ప్రస్తుతం వ్యవసాయం లాభసాటిగా లేదు. రైతుల ఆత్మహత్యలకు ఇదే ముఖ్య కారణం. సాగుభూమి, విస్తీర్ణం పెంచడం సాధ్యపడటంలేదు. భూమి సారాన్ని కోల్పోతోంది. భూమి ఉపరితల నీటిపారుదల తగినంతగా లేదు. భూగర్భజలాల స్థాయి తగ్గుతూ వస్తుంది. 70 శాతం సాగుభూమి ఇంకా వర్షాలపైనే ఆధారపడి ఉంది. అంతేకాదు, ప్రపంచీకరణ వ్యవసాయరంగంలో అభద్రతను పెంచింది.

---

యాదవ్‌కి ఉన్న అధికారం (యాదవకుల అధికారం) ఇప్పుడు మాయావతి చేతిలోనికి వచ్చింది తప్ప రాజ్యాధికారం బడుగువర్గాలకు రాలేదు. ఆంధ్రప్రదేశ్‌లో గతంలో బ్రాహ్మణులకు ఉన్న అధికారాన్ని రెడ్లు, రెడ్లకు ఉన్న అధికారాన్ని కమ్మలు గుంజుకొన్నట్లుగానే రేపు చిరంజీవి పార్టీపెట్టి అధికారం లోనికి వస్తే 'కాపులు' అధికారాన్ని చేజిక్కించుకొంటారు. ఈ కులం ఇప్పటికే భూమిపైన, వ్యాపార వాణిజ్యాలపైన పట్టుకలిగి ఉంది. బి.ఎస్.పి., అధికారంలోనికి వస్తే ఎస్.సి. కులాలలోని డబ్బుగల వారికి, మాజి ఐ.ఏ.ఎస్. ఇతర బ్యూరోక్రాట్లకి అధికారం వస్తుంది. విస్తృతార్థంలో దీన్ని ప్రభుత్వాధికారమంటారు తప్ప, బడుగులకు రాజ్యాధికారం అనలేం.

మరి రాజ్యాధికారమంటే ఏమిటి? భారతదేశ నిర్దిష్ట పరిస్థితులలో కులాన్ని, వర్గాన్ని వేరుచేయలేనంతగా రెండు కలిసిపోయి ఉన్నాయని మనం గుర్తిస్తే బడుగు కులాలలోని శ్రమజీవులు (రైతులు, కూలీలు, కార్మికులు), మధ్యతరగతికి చెందిన ప్రజలకు అధికారంలోను, ఈ దేశ సంపద (భూమి, పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు) లోను నిజమైన వాటా పంపకం జరిగినప్పుడు, వాటిపై అజమాయిషీ కలిగినప్పుడు, జాతులకు స్వయం పాలన, స్వయం ప్రతిపత్తి అందినప్పుడు, అందరికీ విద్య, వైద్యం సమానంగా అందినప్పుడు అటువంటి రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడితే, అది నిజంగా బడుగుల రాజ్యాధికారంగానే చెప్పవచ్చు. అయితే అటువంటి రాజకీయ నిర్మాణాలు ప్రస్తుత పార్లమెంటరీ పార్టీలలో లేవనే చెప్పవచ్చు. అసలు ప్రస్తుత భారత రాజ్యాంగ నిర్మాణంలోనే అటువంటి అవకాశంలేదు. అందుకే ప్రజాకవి చెరబండరాజు 'ఈ దొంగల రాజ్యాంగం రచనే ఒక కుట్రంటూ, శ్రమజీవుల శ్వాసలతో పాడుదాం, పాడుదాం' అంటాడు. ఇది అక్షరసత్యం. ఒక సామాన్యపౌరుడు నేటి ఎన్నికలలో పాల్గొనగలడా? ఒకవేళ పాల్గొన్నా గెలవగలడా? ఒకవేళ గెలిచినా ఈ వ్యవస్థలో (రాజ్యాంగంలో) మార్పులు తీసుకొనిరాగలడా? 'లేదు' అనే చెప్పవచ్చు. ఇది ఆరు దశాబ్దాల అనుభవం చెబుతుంది. కాబట్టి 'బడుగులకు రాజ్యాధికారం - సామాజిక న్యాయం' అని చెబుతున్నవి నిజమైన అర్థంలో అది ప్రభుత్వాధికారమే తప్ప, బడుగులకు రాజ్యాధికారం కాదు. 1917లో వచ్చిన అక్టోబర్ విప్లవం గానీ, 1949 చైనా లాంగ్‌మార్చ్ గానీ చరిత్రలో చెప్పిన సత్యం ఏమంటే, రాజ్యాధికారం రావాలంటే దోపిడీకి గురౌతున్న వారు (కులాలు, వర్గాలు, జాతులు) దోపిడీ చేస్తున్నవారిని (ఏ కులానికి, వర్గానికి, జాతికి చెందినవారైనా) ఓడించినప్పుడే అది సిద్ధిస్తుంది తప్ప దానికి వేరే అడ్డదారులు ఉండవని మనమంతా గుర్తిస్తే మంచిది. ◆

మన దేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గుతూ, పెరుగుతూ వస్తోంది. సుస్థిరమైన ప్రగతిలేదు. మన ఆహార ధాన్యాల ఉత్పత్తి 1973-74లో 104.7 మిలియన్ టన్నులు (మి.ట.) ఉండగా, 1996-97 నాటికి 199.44 మి.ట. కు చేరింది. అయితే, 2000-01 కి 196.8 మి.ట. కు తగ్గింది. 2003-04 లో 213.2 మి.ట., 2006-07లో 209.2 మి.ట.గా అంచనా.

చిరుధాన్యాల (జొన్న, మొక్కజొన్న, సజ్జలు మొదలైనవి) విషయం లో ప్రగతి లేదు వీటి ఉత్పత్తి 1973-74లో 28.83 మి.ట. ఉండగా 2001-02 నాటికి 33.4 మి.ట. కు పెరిగింది. అయితే, 2006-07లో ఈ ఉత్పత్తి 32 మి.ట.గా అంచనా.

పప్పుధాన్యాల విషయంలో ప్రగతి లేదు. వీటి ఉత్పత్తి 1973-74 లో 10.01 మి.ట. ఉండగా 1996-97లో 14.24 మి.ట.కి పెరిగింది. అయితే 2002-03లో 11.1 మి.ట. కు తగ్గింది. 2006-07లో 14 మి.ట. ఉండవచ్చని అంచనా.

ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గినా, పెరిగినా జనాభా మాత్రం పెరుగుతూనే ఉంది. ఈ కారణంగా ఆహార ధాన్యాల తలసరి వినియోగం రోజుకి 1951లో 394.9 గ్రాములు ఉంటే 1980లో 410.4 గ్రాములకు మాత్రం చేరుకుంది. 1997లో 503.1 గ్రాములు ఉంటే, 2005లో కేవలం 422.4 గ్రాములు మాత్రమే. పప్పు ధాన్యాల విషయంలో తలసరి వినియోగం 1951లో 60.7 గ్రాములు ఉంటే 1992లో 34.3 గ్రాములకు పడిపోయింది. 2005లో 31.5 గ్రాములని అంచనా.

వ్యవసాయ రంగంలో పెట్టుబడి తగ్గిపోతూ వస్తుంది. ముఖ్యంగా ప్రభుత్వ పెట్టుబడి తగ్గుతూ వస్తుంది. 1999-2000లో ఇది రు. 7,754 కోట్లు ఉంటే 2002-03లో రు. 7,849 కోట్లకు మాత్రమే పెరిగింది. 2004-05లో ఇది రు. 12,591 కోట్లకు పెరిగింది. వ్యవసాయ రంగంలో మొత్తం పెట్టుబడి 1999-2000లో రు. 43,473 కోట్లు, 2004-05లో రు. 43,123 కోట్లు.

వ్యవసాయ రంగానికి బ్యాంక్ రుణాలు గణనీయంగా పెరిగాయి. ఇవి 2000-01లో రు. 52,827 కోట్లు ఉండగా 2005-06లో 1,80,486 కోట్లు. అయితే, ఈ పెరుగుదల చిన్న, సన్నకారు రైతులకు ఎంతవరకు ఉపయోగపడిందో అనుమానమే.

అన్ని రకాల ఎరువుల వినియోగం 2001-02లో 173.60 లక్షల టన్నులు ఉంటే 2005-06 నాటికి 203.40 లక్షల టన్నులకు పెరిగింది. అయితే, ఎరువుల వాడకం హేతుబద్ధంగా లేదు. దీనివలన దిగుబడి విషయంలో ఆశించిన ఫలితాలు లభించడం లేదు.

ఉత్పాదకత విషయంలో బాగా వెనుకబడి ఉన్నాం. వరి విషయంలో హెక్టారుకి సగటున దిగుబడి మన దేశంలో 2915 కేజీలు ఉంటే, బంగ్లాదేశ్‌లో ఇది 3448 కేజీలు, జపాన్‌లో 6582 కేజీలు, అమెరికాలో 7372 కేజీలుగా ఉంది. గోధుమల విషయంలో ఈ దిగుబడి మనదేశంలో బాగానే ఉంది. ఇది మనదేశంలో 2770 కేజీలు ఉంటే, అమెరికాలో 2872 కేజీలు. అయితే, మొక్కజొన్న విషయంలో మనదేశంలో ఇది 1705 కేజీలు ఉండగా అమెరికాలో 8398 కేజీలు.

మన దేశంలో కొన్ని రాష్ట్రాలే వ్యవసాయ పూర్తి సామర్థ్యాన్ని వినియోగించుకొంటున్నాయి. ఉదాహరణకు, గోధుమల విషయంలో ఉపయోగించని సామర్థ్యత శాతం పంజాబ్‌లో 6 అయితే మధ్యప్రదేశ్‌లో 84. వరి విషయంలో అస్సాం, బీహార్, చత్తీస్‌గఢ్, ఉత్తర్‌ప్రదేశ్ రాష్ట్రాలలో దిగుబడిని రెట్టింపు చేసే అవకాశం ఉంది.

ప్రభుత్వం కనీస మద్దత్తు ధరలను ప్రకటిస్తూనే ఉంది. ఈ విధంగా రైతులకు ప్రోత్సాహం కల్పించాలని ప్రభుత్వ యోచన. ఇది సరికాదు. అధిక మద్దతు ధరలు ఎవరికి లాభం? మార్కెట్ మిగులు ఉన్నవారికి మాత్రమే. ఇకనైనా ఉత్పాదకత పెంచటానికి కృషిచేస్తే చిన్న, సన్నకారు రైతులు కూడా లబ్ధిపొందుతారు. వ్యవసాయం లాభసాటిగా మారుతుంది.

మన ప్రజా పంపిణీ వ్యవస్థ (పి.డి.ఎస్.) సమర్థవంతంగా పని చేయటం లేదు. బోగస్ కార్డుల బెడద ఉంది. పేదలు కూడా పి.డి.ఎస్. వల్ల లాభం పొందటంలేదు (రేషన్‌కార్డులు లేక). పి.డి.ఎస్. ధరల స్థిరీకరణకు తోడ్పడుటలేదు. ఇకనైనా పి.డి.ఎస్. అతిపేద వారికి అండగా ఉండేటట్లు చూడాలి.

వ్యవసాయ రంగంలో పరిశోధనకు పెద్దపీట వేయాలి. ఉత్పాదకత ను పెంచేందుకు ఉన్న ఆటంకాలను నిర్మూలించాలి. పరిశోధన ఫలాలు చిన్న, సన్నకారు రైతులకు చేరాలి. పాలి భూములపైన ఉత్పాదకతను పెంచితే మొత్తం ఉత్పత్తిని పెంచడమే కాకుండా వ్యవసాయం లాభసాటిగా ఉంటుంది. వ్యవసాయ వృథాను తగ్గించాలి. విలువను పెంచే పంటలకు ప్రాధాన్యతఇవ్వాలి. పంటల మార్పిడి వలన నీటిపై ఒత్తిడిని తగ్గించవచ్చు. కాయగూరలు, పండ్ల పంటలకు ప్రాధాన్యత పెంచాలి. రసాయినిక ఎరువుల వినియోగం తగ్గించి, సేంద్రీయ ఎరువుల వాడకం పెంచాలి. ◆


Statement about ownership and other particulars of periodical **VEEKSHANAM** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly (applied) |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date : March 1st, 2008

*Sd/-*
*(N. Venugopal Rao)*
Signature of the Publisher

*స్వాతంత్ర్యం వచ్చిన తొలి రెండున్నర దశాబ్దాలు వ్యవసాయానికిచ్చిన ప్రాధాన్యత తరువాతి కాలంలో లేదనీ, నాయకత్వ దృష్టి వ్యవసాయం నుండి లాభసాటి వ్యాపారానికి మారిపోయిందని అంటున్నారు* **కూరపాటి వెంకటనారాయణ, డా. సి.హెచ్ దినేష్‌కుమార్**

# సమస్యల వలయంలో వ్యవసాయరంగం

గత పది సంవత్సరాల నుండి వ్యవసాయరంగం సంక్షోభంలో పడినట్టు నిరంతరం జరుగుతున్న ఆత్మహత్యల ద్వారా స్పష్టమౌతోంది. వ్యవసాయాభివృద్ధి రేటు నాలుగు శాతం (1990 పూర్వం) నుండి రెండు శాతానికి (2000 తర్వాత) పడిపోవడం అందులోను ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరుగుదల స్తంభించిపోవడంతో వ్యవసాయం సంక్షోభంలో పడినట్లు తెలుస్తోంది. మన ఆర్థికవ్యవస్థ 8 నుండి 9 శాతం వరకు వృద్ధిని సాధించినా 60 శాతం శ్రామికులు శ్రమిస్తున్న వ్యవసాయరంగం కేవలం రెండు శాతం వృద్ధిరేటు సాధించటం ఆందోళనకరం. అంతేగాక మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గడ్, కర్ణాటక, పంజాబ్, కేరళ, గుజరాత్ వంటి రాష్ట్రాలలో సన్నకారు, ఉపాంత రైతుల ఆత్మహత్యలు జరుగుతున్నట్లు అధికార, అనధికార నివేదికలు తెలియజేస్తున్నాయి. ఈ ఆత్మహత్యలు ప్రతిసంవత్సరం పెరుగుతున్నాయి కాని తగ్గడం లేదు. దేశ జనాభాకు ఆహారం అందించే రైతన్నలు ఆత్మహత్యలు చేసుకొనే ఈ సంక్షోభాన్ని గురించి సరియైన అవగాహన చేసుకొని తగిన నివారణ చర్యలు చేపట్టాల్సి ఉంది.

### నెహ్రూ-ఇందిర విధానాలు : వ్యవసాయాభివృద్ధి

1947 నుండి ఆర్థిక, సామాజిక రంగంలో పెనుమార్పులు చోటుచేసుకున్నట్లే వ్యవసాయరంగంలో కూడ అనేక సంస్థాగత, సాంకేతిక మార్పులు వచ్చాయి. మొదటి మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవసాయరంగం అభివృద్ధికై కోట్లాది రూపాయల పెట్టుబడులు పెట్టడం జరిగింది. ముఖ్యంగా బహుళార్థసాధక నీటి ప్రాజెక్ట్‌లు, కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమాలు, విస్తరణ కార్యక్రమాలు, వ్యవసాయ పరిశోధనా కేంద్రాలు, వ్యవసాయ విశ్వవిద్యాలయాలు స్థాపించడం జరిగింది. ఎరువుల కర్మాగారాలు నిర్మాణం చేయడం జరిగింది. నెహ్రూగారు ప్రధానమంత్రిగా ఉన్న కాలంలో వ్యవసాయరంగానికి తగు ప్రాధాన్యతనిచ్చి అభివృద్ధికి కృషిచేసినట్లు రుజువులు ఉన్నాయి. భాక్రానంగల్, హిరాకుడ్, నాగార్జునసాగర్ ప్రాజెక్ట్‌లు నిర్మించడం జరిగింది. పంత్ వ్యవసాయ విశ్వవిద్యాలయంతో పాటు అనేక రాష్ట్ర స్థాయి వ్యవసాయ విశ్వ విద్యాలయాల్ని స్థాపించడం జరిగింది. 1966-85 కాలంలో పంజాబ్, హర్యానా, పశ్చిమ ఉత్తర ప్రదేశ్, తాంజావూర్, ఆంధ్రకోస్తా ప్రాంతాలలో హరిత విప్లవ ప్రభావాన్ని స్పష్టంగా చూడగలిగాం. వ్యవసాయ బ్యాంకు నాబార్డ్ స్థాపనతో పాటు సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం ప్రారంభించ బడింది. ఇంకా 1985 నుండి వ్యవసాయదారులు వ్యాపార పంటలవైపు అడుగులు వేయడం ప్రారంభించినారు. కాయ ధాన్యాలు పండించే దిశ నుండి పత్తి మొదలగు వ్యాపార పంటల వైపు రైతుల దృష్టి మరలింది. నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టిన దరిమిలా వ్యవసాయరంగంపై ప్రభుత్వ పెట్టుబడులు శీఘ్రగతిన తగ్గినాయి. 1947-90 కాలంలో సగటున దాదాపు 4 శాతం వృద్ధిని సాధించిన వ్యవసాయరంగం 1993 నుండి కేవలం 2 శాతానికే పరిమితం కావల్సివచ్చింది. విధానాలలో, ఉత్పత్తిలో అలసత్వం చోటుచేసుకోవడం జరిగింది.

1950-80 కాలంలో పాలకవర్గానికి వ్యవసాయానికి మధ్య దృఢమైన అనుబంధం ఉండేది కాబట్టి వ్యవసాయదారుల సమస్యలు పార్లమెంట్‌లో చర్చించి వ్యవసాయాభివృద్ధికి కృషిచేయడం జరిగింది. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ కార్యక్రమాలు ఆవిష్కరించిన తర్వాత పాలక పక్షానికి వ్యవసాయం అవసరమనిపించలేదు. వారికిది ఏమాత్రం గిట్టుబాటు కూడా కాదు. పాలక వర్గం దృష్టంతా తక్షణమే అత్యధిక లాభాలు లభించే వ్యాపారాలైన రవాణా, కాంట్రాక్ట్స్, మద్య వ్యాపారం, హోటల్స్, రియల్ ఎస్టేట్, పరిశ్రమలు మొదలగువానిపై పడింది. ప్రైవేట్, ప్రభుత్వ రంగాలు తమకు అనుకూలంగా మల్చుకొని ప్రభుత్వ విధానాల ద్వారా వనరులు, అవకాశాలు, ఆదాయంలో సింహభాగం కైవసం చేసుకొనే మార్గాన్ని అవలంబించారు. గ్రామీణ ప్రాంత వ్యవసాయాన్ని సన్నకారు రైతులకు వదిలి, పట్టణ ప్రాంత భూములు కారుచౌకగా స్వాధీనం చేసుకొన్నారు. ఉన్నతస్థాయి ప్రజాప్రతినిధులైన ఎం.ఎల్.ఎ, ఎం.పి, మంత్రులు వ్యవసాయం చేయడం లేదు. కేవలం పండ్ల తోటలతో వందలాది ఎకరాల భూమిని స్వంతం చేసుకొన్నారు. కేవలం రైతుల తలపాగలు (రుమాళ్లు) మాత్రం ఎన్నికల ముందు పార్టీల నాయకత్వం ధరించి బీదరైతుల ఓట్లకు గాలం వేయడం జరుగుతోంది. పాలకవర్గాల స్వంత ప్రయోజనాల వలన రైతులకు కనీస న్యాయం జరగడం లేదు.

### నూతన ఆర్థిక విధానాలు - రైతుల పరిస్థితి

స్వేచ్ఛా విపణి ఆర్థిక వ్యవస్థలో భాగంగానే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవసాయరంగానికి కల్పించే సబ్సిడీలు క్రమంగా (1991 నుండి) ఉపసంహరించడం జరిగింది. స్థానిక అవసరాలకు కాకుండా మార్కెట్ అవసరాలకు పంటలు వేయడం ప్రారంభమైంది. ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, ఛత్తీస్‌గడ్ రాష్ట్రాలలో పత్తి సాగు విపరీతంగా పెరిగిపోయింది. పత్తిని తెల్ల బంగారం అని రైతులు భావించారు. ఈ పంట లాభదాయకం అని భావించారు. వ్యవసాయ ఖర్చులు అనేక రెట్లు పెరిగాయి. మార్కెట్‌లోనే విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల కోసం ప్రతి ఎకరాకు వేలాది రూపాయలు అత్యధిక వడ్డీకి అప్పుచేసి ఖర్చుచేయాల్సి

వచ్చింది. ఉత్పత్తివ్యయం కొన్ని రెట్లు పెరగ్గా ఉత్పత్తుల ధరలు నామమాత్రం గానే పెరిగాయి. ఎరువులు, పురుగుమందులు విరివిగా వాడటంతో భూసారం తగ్గడం ప్రారంభమైంది. ఆంధ్రప్రదేశ్‌లో పత్తితో పాటు వరిపంట అనేక రెట్లు పెరిగింది. బావులు, చెరువులపై ఆధారపడిన తెలంగాణలో వరి విస్తీర్ణం బాగా పెరిగింది. నిరంతరం నీరు కావాల్సి ఉంది. అధికంగా నీటి వాడకం జరుగుతోంది. ఈ పరిస్థితులలో వేలాది రూపాయల ఖర్చుతో బావులు తవ్వడం, ఆ బావులు కూడా ఎండిపోవడం జరిగింది. వాటి స్థానంలో బోరుబావులు వేయడం, కొద్దికాలంలో అవి కూడా విఫలం కావడంతో రైతుల బాధలు ప్రారంభమైనాయి. బావులు, బోర్లు, కరెంటు, కరెంటు మోటార్లు పై ఖర్చు తడిసి మోపెడు అవుతోంది. ఈ ఖర్చు అంతా ప్రైవేట్ రుణాలే కావడం విశేషం. రైతుకు ప్రతి ఎకరాకు పొందే మిగులు తగ్గిపోవడమో లేదా నష్టం రావడమో జరుగుతోంది. వ్యవసాయానికి కావలసిన అప్పుల మొత్తం బ్యాంకులు ఇవ్వకపోవడంతో రైతులు ప్రైవేట్ రుణాలు తీసుకోవలసి వచ్చింది. ఈ పరిస్థితి ఒకటి లేదా రెండు సంవత్సరాలు కాకుండా సంవత్సరాల తరబడి కొనసాగుతోంది. పూర్వం తెచ్చిన అప్పులు తీరకపోగా జరుగుతున్న కాలంలో చేసిన అప్పు మోయలేని భారంగా మారింది. దీనికి తోడు కుటుంబ వ్యవహారాల ఖర్చులు మితిమీరిపోవడం, అందులో విద్య, వైద్యం, ఆడపిల్లల వివాహాల ఖర్చులు రైతులపై మోయలేని భారాన్ని మోపినాయి. ముఖ్యంగా చిన్న, సన్నకారు, ఉపాంత రైతులు ఈ భారాన్ని సంవత్సరాల తరబడి తట్టుకోలేక, రుణదాతలు పెట్టే బాధలు భరించలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

## సంక్షోభం – ఆత్మహత్యల పరంపర

అధికార లెక్కల ప్రకారం అనగా భారత ప్రభుత్వ దేశ వ్యవహారాల మంత్రిత్వశాఖ విభాగంలోని జాతీయ క్రైమ్ రికార్డ్ బ్యూరో ఆధారంగా 1997 నుండి 2005 నాటికి 1,50,000 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకొన్నట్లు నమోదైంది. ముఖ్యంగా మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాలలో అత్యధికంగా ఆత్మహత్యలు జరిగినట్లు వివరాలు తెలుపుతున్నాయి. ఒక్క మహారాష్ట్రలోని విదర్భ ఆరు జిల్లాలలో 30,000 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకొన్నట్లు తెలుస్తోంది. తరువాత స్థానం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానిది కావడం గమనార్హం. కేరళ, పంజాబ్, గుజరాత్, గోవాలలో కూడా రైతుల ఆత్మహత్యలు జరుగుతున్నాయి. దేశంలోని ఆత్మహత్యలలో మహారాష్ట్రలో 15.2 శాతం (1997) ఉండగా 2005లో అది 27.2 శాతానికి చేరింది. ఇదే కాలంలో మొత్తం దేశంలోని ఆత్మహత్యలలో ఆంధ్రప్రదేశ్‌లో 12.9 శాతం నుండి 18.5 శాతానికి చేరింది. ఆంధ్రప్రదేశ్‌లోని 5 జిల్లాల్లో రైతుల ఆత్మహత్యలు అధికంగా ఉన్నట్లు వివరాలు తెలుపుతున్నాయి. మహారాష్ట్రలో ప్రతి ఆరు సంవత్సరాలకు ఆత్మహత్యల సంఖ్య రెండింతలు అవుతోందని మద్రాసు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ స్టడీస్ ప్రొఫెసర్ నాగరాజుగారి పరిశోధన తెలియజేస్తోందని రైతుల ఆత్మహత్యల గురించి ప్రముఖంగా పరిశోధనా వ్యాసాలు రాసిన ది హిందూ జర్నలిస్టు పి.సాయినాథ్ అభిప్రాయపడ్డారు.

గత పది సంవత్సరాల నుండి దేశంలో పండుతున్న ధాన్యం ఉత్పత్తి పెరగడంలేదు. వ్యాపార పంటలకు వ్యవసాయ భూముల కేటాయింపు పెరిగింది. ఇటీవలి కాలంలో వ్యవసాయం లాభసాటిగా లేకపోవడంతో బీడు భూముల శాతం కూడా పెరుగుతున్నది. పట్టణ ప్రాంతాల చుట్టు ప్రక్కల భూములు సాగు నుండి విరమించబడి ఇండ్ల నిర్మాణ స్థలాలుగా 'లే అవుట్' చేయబడుతున్నాయి. వ్యవసాయం లాభసాటిగా లేకపోవడం వలన రైతులలో ఉత్సాహం, విశ్వాసం సన్నగిల్లుతోంది. 1991 సంస్కరణల దరిమిలా గ్రామీణ–పట్టణ ప్రాంతాల ఆదాయాలలో వ్యత్యాసాలు పెరిగిపోతున్నాయి. తిరోగమనంలోని వ్యవసాయ వృద్ధిరేటుతో పాటు గ్రామీణ పేదరికం, రుణభారం మరీ పెరగటం ద్వారా చిన్న, సన్నకారు రైతులు, ఉపాంత రైతులు ఉక్కిరిబిక్కిరై అవమానాలు, వేధింపులను భరించలేక ఆత్మస్థైర్యాన్ని, ఆత్మాభిమానాన్ని కాపాడుకోలేక తమ భూములను అమ్మినా తీరని అప్పు భారాన్ని ఇంకెంతో కాలం మోయలేని పరిస్థితులలో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

## కారణాలు – పర్యవసానం

నూతన ఆర్థిక సంస్కరణల అమలు కాలంలో వ్యవసాయానికి ప్రభుత్వ పెట్టుబడులు క్రమేణా తగ్గాయి. చిన్న, సన్నకారు రైతులకు అవసరమైన శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం కొరవడుతున్న పరిస్థితులు నెలకొన్నాయి. భూగర్భ జలాలు అడుగంటి పోయి బావులు, బోరు బావులు ఎండి, చేసిన పెట్టుబడులు వ్యర్థమైపోయి అప్పులు మాత్రమే మిగిలిన రైతులు మిగిలారు. దీనికితోడు రైతులను పీడించే నకిలీ విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందుల వ్యాపారుల ఆగడాలు మితిమీరిన క్రమం, ఉత్పత్తులను విక్రయించే మార్కెట్లలో జరిగే అక్రమాలు వ్యవస్థాగతమైన రుణాల సప్లైలో జరుగుతున్న జాప్యం రైతుల బాధలకు తోడైనాయి. నిరాదరణ, అవమానాలు భరించలేని స్థాయికి చేరుకున్నాయి. నూతన ఆర్థిక విధానాల ప్రభావం రైతుల నడ్డి విరగకొట్టిందని చెప్పాలి. వాస్తవానికి ప్రభుత్వం తన బడ్జెట్ లోటును, వడ్డీల భారాన్ని తగ్గించటానికి వ్యవసాయాన్ని వదిలి తన బాధ్యతనుండి విరమించుకొన్నది. అంతర్జాతీయ రుణదాతలు ముఖ్యంగా ప్రపంచ బ్యాంకు సూచనల మేరకు వ్యవసాయానికి ఇచ్చే సదుపాయాలు, సబ్సిడీలు తగ్గించి రైతులను స్వేచ్ఛా విపణి పోటీలో వదిలివేయడం జరిగింది. స్వేచ్ఛా విపణిలో పరపతి, నకిలీ విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందుల యజమానులు, ఉత్పత్తి విక్రయ మార్కెటులోని దళారులు రైతులను పీడించే క్రమం మరింత వేగవంతం అయ్యింది. ఈ పరిస్థితులలో వ్యవసాయ ఖర్చులు అనేక రెట్లు పెరిగాయి. కాని వ్యవసాయ ఉత్పత్తుల ధరలు అంతగా పెరగలేదు. రైతుకు మిగిలే నికరాదాయం శూన్యానికి చేరువైంది. ప్రభుత్వం రైతులకు సబ్సిడీలు ఇవ్వాల్సింది మాని రైతే తన శ్రమను, పెట్టుబడిని సబ్సిడీగా వ్యాపారులకు, ప్రభుత్వాలకు, వినియోగదారులకు సమర్పించి ఆత్మహత్యకు పాల్పడే దురవస్థ దాపురించింది.

## వ్యవసాయం ప్రజల ప్రధాన జీవనరంగం

వ్యవసాయరంగాన్ని కొనసాగించాల్సిన అవసరం ప్రతి సమాజానికి అత్యవసరమే అనేది వేరే చెప్పాల్సిన అవసరం లేదు. పరిశ్రమలకు లాభాలు రాకుంటే అవి మూతపడినా సమాజం మనుగడకు ప్రమాదం లేదు. కాని వ్యవసాయరంగం పరిస్థితి అలాకాదు. వ్యవసాయదారులు, కూలీలు, గ్రామాల్లో నివసించే ప్రతి వ్యక్తి వ్యవసాయంపై ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆధారపడి ఉంటాడు. అనేక పరిశ్రమలు వ్యవసాయంపై ఆధారపడి ఉన్నాయి. ఈ పరిస్థితులలో వ్యవసాయం లాభసాటిగా వృద్ధిచెందాలి.

వ్యవసాయంలో ఉత్పత్తి వ్యయం తగ్గాలి. తక్కువ ధరలకే విద్యుత్తు, వంగడాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు, టెక్నాలజీ, వ్యవసాయ రుణం, విస్తరణ సదుపాయాలు, మార్కెటింగ్ ప్రక్రియ ప్రభుత్వరంగం నుండి సక్రమంగా, సరియైన సమయంలో రైతులకు అందాలి. ప్రభుత్వం

*మాలలు అగ్రవర్ణాల భావజాల మూసలోకి జారిపోతే, మాదిగలలో అభివృద్ధి చెందినవారు తమకన్నా వెనకబడినవారిని పైకి తీసుకురావడంలో విఫలమయ్యారని అంటున్నారు* **నాగరాజు వాడపల్లి, డా. జి. వీరన్న**

# ఎస్.సి. రిజర్వేషన్ల వర్గీకరణ - సామాజిక న్యాయం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రస్తుతం సామాజికంగా ఎదుర్కొంటున్న సమస్యల్లో ముఖ్యమైనవిగా మూడు విషయాలను చెప్పుకోవచ్చును. అవి 1. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం, 2. దళితుల మధ్య రిజర్వేషన్ల సూక్ష్మవర్గీకరణ, 3. నక్సలిజం. మొదటి రెండు సమస్యలు అంతర్గతమైనవిగాను, సామాజికాంశాలతోను, రాజకీయ నిర్ణయాలతో ముడిపడి ఉండగా మూడవది సామాజిక, ఆర్థిక విషయాలతో పాటు రాజకీయంగా వివిధ రాష్ట్రాలతో, కేంద్ర ప్రభుత్వంతో ముడిపడి ఉన్నది. దీనిని పరిష్కరించ డానికి రాష్ట్రస్థాయి నిర్ణయాలు సరిపోవు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సంయుక్త నిర్ణయాలు, కార్యాచరణల ద్వారానే పరిష్కరించడానికి వీలుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇప్పుడు ఒక పక్క ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం కొనసాగుతోంది. మరోపక్క షెడ్యూల్డ్ కూలాల రిజర్వేషన్ల సూక్ష్మవర్గీకరణ విషయంలో దళితుల మధ్య దళితులకు, రాష్ట్ర ప్రభుత్వానికీ మధ్య వివాదం కొనసాగుతోంది. ఒకవేళ రాష్ట్ర ప్రభుత్వం చొరవతో కేంద్ర ప్రభుత్వం రాజ్యాంగ సవరణ చట్టం ద్వారా దళితుల మధ్య సూక్ష్మ వర్గీకరణ చేసినట్లయితే అది ప్రాంతాలవారీగా దళితుల మధ్య అసంతృప్తికి దారితీసి ప్రాంతీయంగా ఉద్యమాలు బయలుదేరవచ్చు. అందుకు కారణం ఒక రాష్ట్రంలో వివిధ ప్రాంతాల వారీగా దళితులు అసమానంగా పంచబడి ఉన్నారు. ఆ క్రమంలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి దళితుల మధ్య రిజర్వేషన్లను ప్రాంతీయంగా వర్గీకరించాలన్న ఉద్యమం తోడైనట్లయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం రాజకీయంగా సంక్షోభాన్ని ఎదుర్కోవాల్సిరావచ్చు.

ఇక వివరాల్లోకి వెళితే. నిజాం హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతంలోని 9 జిల్లాలతోను, 1953లో మద్రాస్ ఉమ్మడి రాష్ట్రం నుండి ఏర్పడిన ఆంధ్రరాష్ట్రంలోని 11జిల్లాలతోను నవంబర్1, 1956 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఇది భారతదేశంలో ఏర్పడిన భాషాప్రయుక్త రాష్ట్రంల్లో మొదటిది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశంలో

---

రైతులకు చేసే ఈ సహకారం రాజకీయ లబ్ధిపై ఆధారపడే పాలకుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండటం శ్రేయస్కరం కాదు. కొన్ని కారణాల దృష్ట్యా మన వ్యవసాయం చిన్న, సన్నకారు రైతుల వ్యవసాయంగా మారింది. ఈ తరగతి రైతులకు కావలసిన వసతులన్ని ప్రభుత్వమే నామమాత్రమైన ధరలకు అందించాలి. అమెరికా లాంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా రైతులకు 80 శాతం సబ్సిడీలు ఇస్తుంటే మనదేశంలో గ్రామాలకు, ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అయిన వ్యవసాయరంగానికి ప్రభుత్వాలు ఎందుకు బాధ్యతపడవు? పరిశ్రమల అవస్థాపానా సౌకర్యాల కోసం, పట్టణ ప్రజల సౌకర్యాల కోసం, ఐటి పార్కులు కోసం వేలాది కోట్లు సమకూర్చే పాలకులు వ్యవసాయరంగ అవసరాల గురించి ఎందుకు పట్టించుకోవడం లేదు?

ఇటీవల జాతీయ స్థాయిలో రైతు సంఘాల లాబీలు బలహీన పడ్డాయి. పూర్వంలాగ పెద్దరైతుల ప్రతినిధులు పార్లమెంట్ సభలలో సభ్యులుగా ఎన్నిక కావడం లేదు. పారిశ్రామికవర్గాల ప్రతినిధులే ఎక్కువగా పార్లమెంట్ సభ్యులు కావడం గమనార్హం. దేశంలో రైతులు ఐక్యం కావడం సులభంగా లేదు. విద్యకు దూరమై, నిర్లక్ష్యం –నిరాదరణకు గురై, దోపిడికి గురౌతున్న రైతన్న గురించి పాలకులు కేవలం మొసలి కన్నీరే కార్చుతున్నారు. రైతుల సమస్యలు కేవలం ఎన్నికల్లో లబ్ధిపొందే అవకాశవాదమే అవుతోంది. కాని వ్యవసాయ సమస్యలు జాతి సమస్యలుగా పాలకులు తీసుకోవడం లేదని గత అనుభవాలు తెలుపుతున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో నివసించే ప్రజలకు దేశ ఆర్థికరంగంలోని పాత్ర, ఉనికి రోజురోజుకు కుంచించుకుపోతున్నది.

సమాజాభివృద్ధికి గాని, మనుగడకుగాని, వ్యవసాయాన్ని ప్రభుత్వరంగంగా పరిగణించాల్సి ఉంది. వ్యవసాయ ఉత్పత్తులకు మద్దతు ధరలు ఇవ్వడం హర్షణీయమే. కాని మద్దతు ధరలతో సాధారణ ధరలు పెరిగి మధ్యతరగతి వినియోగదారులు నష్టపోతారు. సాధారణ ధరలు పెరిగి ద్రవ్యోల్బణం సమస్య ఏర్పడి ఆర్థిక వ్యవస్థే సంక్షోభంలో పడుతుంది. కాబట్టి వ్యవసాయ ఉత్పత్తులను సబ్సిడీల ద్వారా వ్యవసాయ ఉత్పత్తి వ్యయం తగ్గించడం మంచిది. వ్యవసాయదారుల పట్ల అధికారులలో నెలకొని ఉన్న అలసత్వం, నిర్లక్ష్యం, లంచగొండితనం తొలగించుకొని స్వచ్ఛందంగా ఈరంగం అభివృద్ధికి సహకరించాల్సి ఉంది. రైతులు స్వేచ్ఛా మార్కెట్లపై ఆధారపడకుండా వారికి కావల్సిన నాణ్యమైన ఉత్పాదక వస్తువులు, ఇతర పెట్టుబడి వస్తువులు నామ మాత్రపు వడ్డీతో రుణాలు అవసరమైనంత ప్రభుత్వం ద్వారా లభించాలి. సాగునీరు, సాంకేతిక పరిజ్ఞానం, ఇన్సురెన్స్, అవస్థాపన పెట్టుబడులు ప్రభుత్వం కల్పించినపుడే మన వ్యవసాయానికి ఈ సంక్షోభం నుండి విముక్తి కలుగుతుంది. ఆత్మహత్యలు చేసుకొన్న రైతుల కుటుంబాలకు డబ్బులిచ్చినంత మాత్రాన సంక్షోభం సమసిపోదు. ప్రభుత్వం శాశ్వత ప్రాతిపదికన నిర్మాణత్మక కార్యక్రమం తీసుకోవాలి. రైతుల ఆత్మహత్యల గురించి, వ్యవసాయ సంక్షోభం గురించి ఎన్నో కమిషన్‌లు వేసినా రైతుల వెతలు, కన్నీళ్లు ఆగడంలేదు. దేశానికి అన్నం పెట్టి ఆదుకోవడానికి సిద్ధంగా ఉన్న రైతులకు సహకరించడానికి పాలకులు సిద్ధంగా ఉండాలి అని అన్న ప్రముఖ వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.ఎస్.స్వామినాథన్ మాటలు పాలకులు పాటిస్తారని రైతులు ఇతర ప్రజలు ఆశిస్తున్నారు. ◆

2,75,045 చ.కి.మీ విస్తీర్ణంతో దేశంలో వైశాల్యంలో 4వ స్థానంలో ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో అనంతపురం జిల్లా 19,000చ.కి.మీ వైశాల్యంతో మొదటి స్థానంలో ఉండగా, హైదరాబాద్ 7,700 చ.కి.మీ వైశాల్యంతో ఆఖరి స్థానంలో ఉంది. భారతదేశ జనసాంద్రత చ.కి.మీ.కు 324 ఉండగా, ఆంధ్రప్రదేశ్ జనసాంద్రత చ.కి.మీ.కు 275గా ఉంది. రాష్ట్రంలో హైదరాబాద్ చ.కి.మీ.కు 16,988 జనసాంద్రతతో ప్రథమ స్థానంలో ఉండగా, ఆదిలాబాద్ చ.కి.మీ.కు 154 జనసాంద్రతతో ఆఖరి స్థానంలో ఉంది. 2001 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర జనాభా 7,57,27,541 ఉండగా అందులో పురుషులు 3,82,86,811కాగా, స్త్రీలు 3,74,40,730 మంది ఉన్నారు. ఇది భారతదేశ జనాభాలో 7.5 శాతంతో 5వ స్థానంలో ఉంది.

1971 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డ్ కులాల జనాభా ప్రాంతాల వారీగా లెక్కించడంలో కొన్ని నిర్బంధాలుండేవి. వాటిని 1976లో ఒక సవరణ చట్టం ద్వారా తొలగించడం జరిగింది. 1971 జనాభా లెక్కల ప్రకారం 59 షెడ్యూల్డ్ కులాలను గుర్తించడం జరిగింది. వాటిలో 28 కులాలు ఆంధ్ర జిల్లాల్లోనూ, 27 కులాలు తెలంగాణ జిల్లాల్లోనూ, 4 కులాలు రెండు ప్రాంతాల్లోనూ ఉన్నట్లు గుర్తించడం జరిగింది. 1976లో కులాల గుర్తింపులో నిర్బంధాలను తొలగించిన తర్వాత 1981 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డ్ కులాల జనాభా 15 శాతం ఉండగా అది 2001 జనాభా లెక్కల ప్రకారం 16.19 శాతంగా ఉంది. 1961 నుండి 2001 వరకు జనాభా లెక్కల ప్రకారం షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల తెలంగాణ జిల్లాల్లోనే అధికంగా ఉంది. అది 1961 జనాభా లెక్కల ప్రకారం హైదరాబాద్, కరీంనగర్‌లలో షెడ్యూల్డ్ కులాల జనాభా అధికంగా ఉండగా, ఖమ్మం, నిజామాబాద్ జిల్లాల్లో తక్కువగా నమోదైంది. 1971, 1981, 1991 జనాభా లెక్కల ప్రకారం కరీంనగర్ జిల్లాలో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల అధికంగా ఉండగా, హైదరాబాద్ జిల్లాలో తక్కువగా నమోదైంది. 2001 ప్రకారం నిజామాబాద్ జిల్లాల్లో తక్కువగా ఉండగా హైదరాబాద్ జిల్లాలో ఎక్కువగా నమోదైంది. 1961 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్ర ప్రాంతంలో తూర్పుగోదావరి జిల్లాలోను, 1971, 1981 జనాభా లెక్కల ప్రకారం నెల్లూరు జిల్లాలోను షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల అధికంగా ఉండగా, గుంటూరు, విశాఖపట్టణం జిల్లాల్లో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల తక్కువగా నమోదైంది. అలాగే 1991, 2001 జనాభా లెక్కల ప్రకారం ఉభయ గోదావరి, నెల్లూరు జిల్లాల్లో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల అధికంగా ఉండగా, విజయనగరం జిల్లాల్లో తక్కువగా నమోదైంది. 1961 నుండి 2001 వరకు జనాభా లెక్కల ప్రకారం తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, నెల్లూరు జిల్లాలు ఆంధ్ర ప్రాంతంలో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల అధికంగా ఉంది. గుంటూరు, విశాఖపట్టణం, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల తక్కువగా నమోదైంది. తూర్పుగోదావరి, నెల్లూరు జిల్లాల్లో జనాభా పెరుగుదల అధికంగా ఉండడానికి కారణం అక్కడ మంచి జీవన పరిస్థితులు, ఉపాధి అవకాశాలు విరివిగా ఉండటమే. అలాగే రాయలసీమ ప్రాంతంలో చూసినట్లయితే కడప, కర్నూలు జిల్లాల కంటే చిత్తూరు, అనంతపురం జిల్లాల్లో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదల అధికంగా కనబడుతుంది. 1961 నుండి 2001 వరకు అన్ని జనాభా లెక్కల ప్రకారం షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదలలో చిత్తూరు ముందుండగా కడప జిల్లాలో తక్కువగా ఉంది. చిత్తూరు జిల్లాలో షెడ్యూల్డ్ కులాల జనాభా పెరుగుదలకు కారణం అక్కడ జీవన పరిస్థితులు, జీవనోపాధి అవకాశాలు మెరుగ్గా ఉండటమే.

భారతీయ హిందూసమాజం వర్ణవ్యవస్థపై ఆధారపడి ఉంది. ఇది ప్రారంభంలో చాతుర్వర్ణ వ్యవస్థగాను, కాలక్రమంలో పంచమవర్ణ వ్యవస్థగాను రూపుదిద్దుకుంది. ఈ పంచమ వర్ణంను అంటరానివర్ణంగా పరిగణించడం జరుగుతోంది. దక్షిణ భారతదేశం విషయంలో ఈ సామాజికవ్యవస్థ ప్రధానంగా మూడు భాగాలుగా చీలిపోయి ఉంది. అవి బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, అంటరానివారు. ఈ మూడవ భాగమైన అంటరాని వర్గమైన దళితులు 20వ శతాబ్దపు ప్రారంభంలో 'అనార్య' ఉద్యమానికి ప్రభావితులై ఆది-ద్రావిడ, ఆది-కన్నడ, ఆది-ఆంధ్ర, ఆది- హిందువులుగా ఉద్యమాలను ప్రారంభించారు. నిజాం హైదరాబాద్ రాష్ట్రం నుండి తెలుగు భాష మాట్లాడే దళితులు ఆది-హిందూవులుగాను, మద్రాస్ ఉమ్మడి రాష్ట్రం నుండి తెలుగు భాష మాట్లాడే దళితులు ఆది-ఆంధ్రులుగా ఉద్యమాలను నిర్వహించారు.

భారత స్వాతంత్రోద్యమ కాలంలో దళితుల హక్కుల కోసం అంబేద్కర్ జరిపిన పోరాటాల ఫలితంగా దళితులకు రాజ్యాంగం ద్వారా కొన్ని పరిరక్షణలు కల్పించబడ్డాయి. ప్రతి రాష్ట్రం జనాభాలో షెడ్యూల్డ్ కులాల నిష్పత్తి ప్రకారం విద్య, ఉపాధి, రాజకీయ రంగాల్లో రిజర్వేషన్లు కల్పించబడినవి. ఆ క్రమంలోనే ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత దళితులు తమ నిష్పత్తి ప్రకారం 15 శాతం రిజర్వేషన్‌లను రాజ్యాంగ పరంగా పొందారు. 1981 జనాభా లెక్కల ప్రకారం 15 శాతంగా ఉన్న 59 షెడ్యూల్డ్ ఉపకులాలను ప్రాంతాల వారీగా పరిశీలించినట్లయితే తెలంగాణ ప్రాంతంలో షెడ్యూల్డ్ కులాల జనాభా 29,66,187 కాగా, అందులో మాదిగలు 19,95,625 మంది ఉండగా, మాలలు 9,71,562 మంది ఉన్నారు. అంటే తెలంగాణ ప్రాంతంలో షెడ్యూల్డ్ కులాల జనాభాలో 75 శాతం మాదిగలుండగా, 25 శాతం మాలలున్నారు. రెల్లి దాని ఉపకులాలుగాని, ఆది ద్రావిడ ఆంధ్ర మాల, దాని ఉపకులాలు గాని తెలంగాణలో లేవు. ఆంధ్ర ప్రాంతంలో షెడ్యూల్డ్ కులాల జనాభాను పరిశీలించినట్లయితే 1981 జనాభా లెక్కల ప్రకారం మొత్తం షెడ్యూల్డ్ కులాల జనాభా 21,91,625 కాగా మాలలు 12,81,596 మంది ఉన్నారు. మాదిగలు 9, 10, 029 మంది ఉన్నారు. అలాగే రాయలసీమ ప్రాంతం జనాభా విషయంలో మొత్తం షెడ్యూల్డ్ కులాల జనాభా 12,00,926 కాగా, మాలలు 6,77,421 ఉండగా, మాదిగలు 5,23,505 మంది ఉన్నారు. ఈ ప్రాంతంలో రెల్లి, ఆది-ఆంధ్ర, ఆది-ద్రావిడ కులాలు లేవు.

అలాగే ప్రాంతాల వారిగా షెడ్యూల్డ్ కులాలు మధ్య అక్షరాస్యత, సామాజిక చైతన్యం, విద్య, ఉపాధి అవకాశాలు మొదలగు విషయాలను పరిశీలించినట్లయితే కోస్తా, ఆంధ్ర ప్రాంతంలో మాల, మాదిగలకు క్రైస్తవ మిషనరీల ప్రవేశంతో విద్యావకాశాలు పెరిగి అక్షరాస్యత రేటు ఎక్కువగా ఉండటమేకాక అంబేద్కర్ భావజాలంతో కూడిన సామాజిక చైతన్యం ఎక్కువగాఉంది. అలాగే అక్కడ ఆర్థిక స్థితిగతులకు అనుకులంగా భౌగోళిక పరిస్థితులుండటం వలన వారు తెలంగాణ మాల, మాదిగల కంటే విద్యావకాశాలను, ఉపాధి అవకాశాలను అందుకోవడంలోను ముందంజలో ఉన్నారు. తెలంగాణ ప్రాంతం నిజాం పాలన కింద ఉండటం, మిషనరీల వంటి సంస్థలకు ప్రవేశం లేకపోవడం వలన తెలంగాణ దళితులు వెనుకబడి ఉన్నారు. ఇక రాయలసీమ విషయాని కోస్తే, ఇక్కడి దళితులు (మాల, మాదిగలు) విద్యావకాశాలు, అక్షరాస్యత,

సామాజిక, అంబేద్కర్ భావజాల చైతన్యంలో, ఉపాధి అవకాశాలను అందుకొవటంలో సగటు స్థాయిలో ఉన్నారు.

భౌగోళిక పరిస్థితులు, మైనార్టీ సంస్థల సేవల వలన ఆంధ్ర ప్రాంతంలో మాల, మాదిగలు కొంత అభ్యున్నతిని సాధించినప్పటికీ, ఆంధ్రప్రదేశ్‌లో రాజ్యాంగపరంగా దళితులకు అందిన 15 శాతం రిజర్వేషన్‌ల ఫలాలను షెడ్యూల్డ్ కులాల్లో ఉపకులమైన మాలలు అధికంగా ఉపయోగించుకుంటున్నారని, సామాజికంగా, విద్యాపరంగా, ఆర్థికంగా, ఉపాధిపరంగా మాలలకంటే వెనుకబడిన మాదిగలు రిజర్వేషన్‌లను జనాభా నిష్పత్తి ప్రకారం వర్గీకరించాలని దశాబ్ద కాలం పాటు మాదిగలు ఉద్యమాన్ని నిర్వహించగా గత తెలుగుదేశం ప్రభుత్వం హైకోర్టు మాజీ న్యాయమూర్తి రామచంద్రరాజు అధ్యక్షతన ఏక సభ్య కమిషన్ నియమించింది. ఆ కమిషన్ సిఫార్సులు మేరకు నాటి తెలుగుదేశం ప్రభుత్వం 15 శాతం రిజర్వేషన్ ఫలాలను 59 ఉపకులాల మధ్య సామాజిక వెనుకబాటుతనం ప్రాతిపదికన నాలుగు విభాగాలుగా (ఎ,బి,సి,డి) చేసి వాటి జనాభా శాతం ప్రకారం కోటాను నిర్ణయించి దానిని ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ కులాల (రిజర్వేషన్ల హేతుబద్ధీకరణ) చట్టం 2000 తెచ్చింది. ఆ చట్టం ప్రకారం రెల్లి దాని ఉపకులాలను ఒక శాతంతో 'ఎ' కేటగిరి కింద, మాదిగ దాని ఉపకులాలను ఏడు శాతంతో 'బి' కేటగిరి కింద మాల దాని ఉపకులాలలను ఆరు శాతంతో 'సి' కేటగిరి కింద, ఆది ఆంధ్ర దాని ఉపకులాలను ఒక శాతంతో 'డి' కేటగిరి కింద రిజిర్వేషన్లను వర్గీకరించడం జరిగింది.

రిజర్వేషన్‌లు అనేవి అంబేద్కర్ తన ఉద్యమాల ద్వారా రాజ్యాంగ బద్ధంగా దళితులకు ఉమ్మడిగా అందించారని, ఈ రిజర్వేషన్‌ల వర్గీకరణ అనేది దళితుల మధ్య చీలిక తీసుకురావడానికేనని, అది దళితులపై అగ్రవర్ణాల కుట్ర అని షెడ్యూల్డ్ కులాలో ఒకటైన మాల కులం వర్గీయులు దీనిని వ్యతిరేకిస్తూ న్యాయస్థానంను ఆశ్రయించడంతో షెడ్యూల్డ్ కులాల్లో అధికంగా ఉన్న మాల, మాదిగల మధ్య యుద్ధం ప్రారంభమైంది. దీనిని రాష్ట్రన్యాయ స్థానం చెల్లనేరదని తీర్పు చెప్పగా అదే ప్రభుత్వం 20/2000 పేరిట ఒక ఆర్డినెన్స్ తీసుకువచ్చింది. దానితో మాల వర్గం దేశ అత్యున్నత న్యాయస్థానంను ఆశ్రయించగా ఆ ఆర్డినెన్స్ చెల్లనేరదనీ, రాజ్యాంగ నిబంధన 341 ప్రకారం షెడ్యూల్డ్ కులాలను వర్గీకరించే ఆధికారం రాష్ట్ర ప్రభుత్వానికి లేదనీ, రాజకీయ దురుద్దేశ్యంతో కూడుకున్నదనీ 2004లో కొట్టివేసింది.

అత్యున్నత న్యాయస్థానం ఆర్డినెన్స్‌ను కొట్టివేయడంతో మాదిగలకు ప్రాతినిథ్యం వహిస్తున్న 'మాదిగ రిజర్వేన్‌ల పోరాట సమితి' వర్గీకరణకై రాష్ట్ర ప్రభుత్వం హేతుబద్ధంగా వ్యవహరించాలని, అందుకు అఖిలపక్ష సమావేశం ఏర్పాటు చేసి, దాని నిర్ణయం ఆధారంగా కేంద్ర ప్రభుత్వాన్ని అంగీకరింపజేసి పార్లమెంట్ ద్వారా రాజ్యాంగ సవరణ చేసి వర్గీకరణ చేసే విధంగా చర్యలు తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురాగా రాష్ట్రప్రభుత్వం అఖిలపక్ష సమావేశం నిర్వహించి వర్గీకరణకు అనుకూలంగా తీర్మానం చేసి అసెంబ్లీలో అదే విధంగా తీర్మానాన్ని ఆమోదింపజేసి కేంద్ర ప్రభుత్వానికి పంపడం జరిగింది. దీనికి వ్యతిరేకంగా మాలలకు ప్రాతినిధ్యం వహిస్తున్న 'మాల మహనాడు' నిరసన ప్రదర్శనలు, మెమోరాండాం సమర్పించడం ద్వారా ప్రభుత్వాన్ని ఒత్తిడికి గురిచేసింది. కానీ, కేంద్ర ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాల రిజర్వేషన్లను సూక్ష్మంగా వర్గీకరించడానికి బదులు రాష్ట్రవ్యాప్తంగా షెడ్యూల్డ్ కులాల సామజిక వెనుకబాటుతనాన్ని అంచనా వేయడానికి జస్టిస్ దొరైస్వామి పేరున ఏకసభ్య కమిషన్‌ను సెప్టెంబర్ 2005లో నియమించింది. తర్వాత దొరైస్వామి స్థానంలో ఉషామెహ్రాను నియమించగా ఆ కమిషన్ ప్రజాభిప్రాయాన్ని సేకరించింది.

ఈ సామాజిక వెనుకబాటుతనం విషయంలో ఏ వర్గం సామాజిక బాధ్యతతో వ్యవహరిస్తుందో చూడవల్సిన అవసరముంది. వివాదాన్ని చాలామంది దాయాదుల పోరుగా వర్గీకరించడం జరుగుతోంది. ఇరువర్గాలు అంబేద్కర్‌వాదులే, అనగా అంబేద్కర్ భావజాలాన్ని అనుసరిస్తున్నవారే. ఎవరైతె సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, సంస్కృతిపరంగా దోపిడికి గురైనారో వారికి కనీస స్థాయిని అందుకోవటానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలనేది అంబేద్కర్ భావజాలం. దానికోసమే అంబేద్కర్ తన జీవత కాలం పాటుపడింది. అయితే ఆంధ్రప్రదేశ్‌లో దళితుల మధ్య జరుగుతున్నదేమిటనే విషయానికోస్తే, ఆంధ్రప్రదేశ్ మొత్తం మీద మాలలకంటే మాదిగలు వెనుకబడి ఉన్నట్లు జస్టిస్ రామచంద్రరాజు కమిషన్ ద్వారా తెలుస్తోంది. అందువలన మాలలు అంబేద్కర్ వాదులే కాబట్టి తమ సోదర కులస్తులైన మాదిగ ఉపకులాలు సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడి ఉన్నప్పుడు రిజర్వేషన్‌ల సూక్ష్మవర్గీకరణకు అంగీకరించడం సముచితం. ఎందుకంటే నాడు అంబేద్కర్ దళితుల కోసం పోరాటం చేసినప్పుడు ఆగ్రవర్ణాలు (కొందరైనా) దళితుల పరిస్థితులను ఆలోచించి మద్దతు ఇవ్వకపోతే ఆంబేద్కర్ ద్వారా వీరికి ఈనాడు వేటికోసమైతే పోరుచేస్తున్నారో అలాంటి రిజర్వేషన్లు తమకు అందేవేనా? అని ఒక్కసారి మాల సోదరులు ఆత్మ విమర్శ చేసుకోవాలి. ఆ విషయంలో మాలలు ఆగ్రవర్ణాల ధోరణిలో వ్యవహరిస్తున్నట్లు కనబడుతోంది. ఇరువర్గాల వారు దళితులే. వీరు సమాజం మొత్తం మీద చూసినట్లయితే సామాజికంగా ఆర్థికంగా సంస్కృతిపరంగా అగ్రవర్ణాల చేతిలో తరతరాలుగా దోపిడికి గురైనవారే. అందుకే వీరి ఉద్ధరణ కోసం అంబేద్కర్ తన జీవితకాలం పోరాటం చేసి ఈ రిజర్వేషన్ ఫలాలను అందించాడు. ఏదో మేరకు అభివృద్ధి చెందామని భావిస్తున్న మాల సోదరులు మాదిగలను తమకంటే తక్కువ సామాజిక స్థాయివారిగా పరిగణించడంలో అగ్రవర్ణ ధోరణి అనుసరిస్తున్నట్లుగా కనబడుతోంది. ఈ నాటికీ మాదిగల్లో అధికులు సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడి ఉండుటకు కారణమెవరనేది ఒక్కసారి ఆలోచించాలి.

మాలలు సామాజికంగా, ఆర్థికంగా కొంత వెసులుబాటు దోరకగానే అగ్రవర్ణాల భావజాల మూసలోకి వెళ్ళిపొయి సోదర మాదిగల స్థితిగతులను పట్టించుకోకుండా, వారిలో సామాజిక స్పృహను పెంపొందించకుండా, వారిని చైతన్యవంతులను చేయకుండా నిర్లక్ష్యం వహించడం సామాజిక బాధ్యతనుండి తప్పుకొని స్వార్ధంగా వ్యవహరించడంగా భావించబడుతోంది. ఒకవేళ మాదిగల స్వయం కృతాపరాధమనుకుంటే అధిక సంతానం వలన వారికి కనీస విద్యా వసతులు కల్పించలేకపోవడంతో వారు విద్యా విషయకం గాను, తద్వారా ఉపాధిపరంగా వెనుకబడి పోయారనేది మరోక అంశం. అందుకు ఎవరు బాధ్యులు. కొంచెం ముందంజలో ఉన్న మాలలు వీరిని ఆయా ఆంశాలపై చైతన్యపర్చడంలో నిర్లక్ష్యం వహించినట్లు కాదా? సరే మాలల సామాజిక బాధ్యతను పక్కనపెడితే, మాదిగల్లో ఈ రిజర్వేషన్లపరంగా కొంత వృద్ధిలోకి వచ్చిన వారి సామాజిక బాధ్యత ఏమిటి? తమ జాతి/కులం వారి అజ్ఞానాన్ని, సామాజిక అమాయకత్వాన్ని సొమ్ము చేసుకొని అందలాలను ఎక్కిన మాదిగ ఉద్యోగస్తులు, మేధావులు, మాదిగల మధ్య చైతన్యంనకు, వారి అభ్యున్నతికి చేస్తున్న నిర్మాణాత్మక చర్యలు ఏమిటనేది చూసినప్పుడు శూన్యం అని చెప్పవచ్చు. ఈ సూక్ష్మవర్గీకరణ ఫలాలు కూడా కొంచెం

ముందంజలో ఉన్న మాదిగలకే ఉపయోగపడుతాయన్నది వాస్తవం. అందుకే వారు కూడా ఏదైతే మాలలు అగ్రవర్ణాల మూస ధోరణిలోకి వేళ్తున్నారని విమర్శిస్తున్నారో అదే బాటలో వీరు కూడా ప్రయాణించడానికి వెనుకాడటం లేదు.

అలాగని మాలలందరూ అభివృద్ధి చెందారని కాదు. మాలల్లో కూడా చాలామంది అధిక సంతానం, నిరక్షరాస్యత, పేదరికంతోను మగ్గుతున్నారు. మాలల్లో అభివృద్ధి చెందినవారు తమ కులస్తుల వెనుకబాటుతనాన్ని సొమ్ము చేసుకొని ఎదిగామన్న విషయాన్ని మర్చిపోతున్నారు. అందుకే తమ కులస్తుల్లో వెనుకబాటుతనం పోగొట్టడానికి ఎలాంటి నిర్మాణాత్మకమైన చర్యలు చేపట్టక స్వార్థంతో జీవిస్తున్నారనేది నిర్వివాదాంశం. దాని ప్రకారం మాల మాదిగాలల్లోనూ ఆర్థికంగా కొంత వెసులుబాటును పొందిన వారు మాత్రమే రిజర్వేషన్‌లను అధికంగా అనుభవిస్తున్నారనేది నగ్నసత్యం. కనీస అవసరాలకూ్కడా నోచుకోని ఇరువర్గాల్లోని మిగతావారి సంగతి ఏమిటి. వారికి ఇరువర్గాలు కలిసి నిర్మాణాత్మక చర్యలను చేపట్టవల్సిన అవసరం ఎంతైనా ఉంది. అలాగే దళితుల్లో క్రిమీలేయర్ విధానాన్ని ప్రవేశపెట్టడం కంటే ఆస్తి ప్రాతిపదికనగాని, ఆదాయం ప్రాతిపదికనగాని, ఒక కుటుంబంలో రెండు తరాలకు మించి ఈ రిజర్వేషన్‌లు వర్తించకుండా మినహాయించడం ద్వారా ఇరువర్గాల్లోను అట్టడుగున ఉన్న ఉపకులాలకు కొంతమేరకైన ప్రయోజనంచేకూరే అవకాశముంది.

ఏది ఏమైనప్పటికి, రిజర్వేషన్‌లు వర్గీకరించాలన్న మాదిగల డిమాండ్‌లో ఉన్న సామాజిక న్యాయసూత్రాన్ని మాలలు గుర్తించి ఆమోదించినప్పటికీ ఇప్పుడు ఉన్న వర్గీకరణ అశాస్త్రీయంగా ఉందనేది ఒక విమర్శ. అందుకు కారణం ప్రాంతాల మధ్య భేదం సహజంగానే ఆయా ప్రాంతాలమధ్య ప్రజల్లో తారతమ్యాలను స్పష్టంగా చూపెడుతోంది. కోస్తా, ఆంధ్ర ప్రాంత దళితుల క్రైస్తవ మిషనరీలు, ఆది ఆంధ్ర మహసభల ప్రవేశంతో విద్య విషయంలో కొంత ముందంజలో ఉన్నారు. అలాగే ఆర్థికంగా స్థిరపడటానికి భౌగోళిక పరిస్థతులు కూడా వారికి అనుకులంగా ఉన్నాయి. అదే తెలంగాణ విషయంలో ఇక్కడ దళితులు 1948 వరకు నిజాం హైదరాబాద్ రాష్ట్రంలో కొనసాగారు. తెలంగాణ దళితులను చైతన్యపరచటానికి ఆది-హిందూ మహసభ కొంతవరకు ప్రయత్నించి నప్పటికి, దాని కార్యకలాపాలు జంటనగరాలను దాటి బయటకు రాలేకపోయాయి. ఆ పరిస్థితులలో తెలంగాణ దళితులు అంతగా చైతన్యవంతులు కాలేకపోయారు. ఇక్కడ క్రైస్తవ మిషనరీలు ప్రవేశించక పోవడంతో ఇక్కడి దళితులు కోస్తా, ఆంధ్ర దళితుల కంటే విద్యలో వెనుకబడి ఉన్నారు. అలాగే భౌగోళికంగా అనుకూల పరిస్థితులు లేకుండుటం వలన వీరిలో అధికులు శ్రామికులుగా మిగిలి పోయారు. మరోక విషయం తెలంగాణలో నక్సలైట్ ఉద్యమ ప్రభావం వలన దళితుల జీవన పరిస్థితులు కొంతవరకు మెరుగైనా మొత్తం మీద స్తబ్దతకు గురైనవి. ఇక రాయలసీమ విషయానికొస్తే ఇక్కడ నీటివసతులు, తక్కువగా ఉండంటవలన ముఠాపోరువలన దళితులు విద్యా విషయకంగా ఆర్థికంగా నష్టపోయారు. ఆ క్రమంలో వారు ఉపాధి అవకాశాలను అందుకొలేక పోతున్నారు. ఇలాంటి మూడు ప్రాంతాలలో మూడు భిన్న పరిస్థితులలో జీవిస్తున్న దళితులను ఒకే ప్రామాణికంగా తీసుకొని వర్గీకరణచేయడం కూడా సహేతుకంగా ఉండదు. మరోక విషయం జనాభా విషయానికోస్తే, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క కులం అధిక జనాభాను కలిగి ఉంది. ప్రాంతాల మధ్య, ఉపకులాల మధ్య సమన్వయం సాధిస్తూ జనాభా నిష్పత్తి ప్రకారం రిజర్వేషన్లను హేతుబద్ధంగా వర్గీకరించ వల్సి ఉంటుంది. అయితే ప్రాంతీయ అసమానతలను చూసినప్పుడు, ఆ ప్రాంతాల్లోని దళిత ఉపకులాల మధ్య జనాభాలోను, సామాజిక వెనుకబాటుతనంలోను తేడాలను గమనించి నప్పుడు ఈనాటి వర్గీకరణ హేతుబద్ధమైనది కాదని తెలుస్తుంది. ఈ వర్గీకరణ ద్వారా ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క కులం నష్టపోతుంది. ఈ ఉమ్మడి రిజర్వేషన్ వర్గీకరణ ద్వారా తెలంగాణలో పన్నెండు శాతం జనాభాగా ఉన్న మాదిగలు కేవలం ఏడు శాతం రిజర్వేషన్స్ మాత్రమే పొందుతున్నారు. అలాగే కేవలం మూడు శాతం జనాభా ఉన్న మాలలు ఆరు శాతం రిజర్వేషన్లను పొందుతున్నారు. అంటే మాదిగలు ఐదు శాతం రిజర్వేషన్ల ఫలాలను నష్టపోతుండగా, మాలలు మూడు శాతం రిజర్వేషన్ల ఫలాలను అధికంగా పోందుతున్నారు. అట్లాగే ఆంధ్ర ప్రాంతంలో షెడ్యూల్డ్ కులాలు జనాభాలో తొమ్మిది శాతం జనాభా కలిగిన మాలలు ఆరు శాతం రిజర్వేషన్లను పొందుతూ మూడు శాతం నష్టపోతుండగా, నాలుగు శాతం జనాభా కలిగిన మాదిగలు ఏడు శాతం రిజర్వేషన్ ఫలాలను పొందుతూ మూడు శాతం అధికంగా లాభ పడుతున్నారు. ఇక రాయలసీమ విషయానికొస్తే రెల్లి, ఆది ఆంధ్ర, ఆది ద్రావిడ కులాలు లేకపోవడంవలన ఏడు శాతం జనాభాగా ఉన్న మాదిగలు ఏడు శాతం రిజర్వేషన్ ఫలాలను పొందుతుండగా, ఎనిమిది శాతం జనాభా కల్గిన మాలలు ఆరు శాతం మాత్రమే లబ్ధిపొందుతూ రెండు శాతం రిజర్వేషన్ ఫలాలను నష్టపోతున్నారు.

మాదిగ రిజర్వేషన్ పోరాటసమితి వారి విజ్ఞాపన/ఉద్యమాల మేరకు కేంద్ర ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాల రిజర్వేషన్ల సూక్ష్మవర్గీకరణకు ఎలాంటి చర్యలు తీసుకోకుండా, రాష్ట్రవ్యాప్తంగా షెడ్యూల్డ్ కులాల సామాజిక వెనుకబాటుతనాన్ని అధ్యయనం చేయడానికి ఏక సభ్య కమిషన్ నియమించడం జరిగింది. అయితే ఆ కమిషన్ నివేదిక ఆధారంగా రాజ్యాంగ సవరణ చేసి పార్లమెంటరీ చట్టం ద్వారా రిజర్వేషన్ల సూక్ష్మ వర్గీకరణ మొత్తంగా చేయకుండా ఆయా ప్రాంతాల మధ్య, జనాభా నిష్పత్తిలో ఉన్న తేడాలు ఆధారంగా ఆయా కులాలు ప్రాంతాల వారీగా తమ జనాభా నిష్పత్తి ప్రకారం రిజర్వేషన్లు వర్గీకరించాలని కొందరు భావిస్తున్నారు. ఒకే రాష్ట్రంలో భిన్న ప్రాంతాల మధ్య వివక్ష చూపరాదని ఇంతకు ముందు ఆంధ్రప్రదేశ్ విషయంలో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రస్తుతం కేంద్రాన్ని ఒప్పించి కమిషన్‌ను నియమించేలా చేసినా, ఈ దళిత ఉద్యమాన్ని ఆపలేదు. అలాగని ఒకే రాష్ట్రంలో రిజర్వేషన్లను ప్రాంతాల వారీగా జనాభా నిష్పత్తి ప్రకారం వర్గీకరించలేదు. ఆ పరిస్థితులలో దళితుల మధ్య సామాజిక న్యాయం సాధించాలన్నా, అందిచాలన్నా ప్రాంతీయ ఉద్యమాలను పరిగణనలోకి తీసుకొనక తప్పదు. ఇప్పటికే ఆంధ్రప్రదేశ్‌లో కొనసాగుతున్న ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం, దీనికి వ్యతిరేకంగా ఆంధ్ర, రాయలసీమ ఉద్యమాలు నివురు గప్పిన నిప్పులా ఉన్నాయి. ఆ క్రమంలోనే ఆంధ్ర, రాయలసీమ లాబీలు ఏర్పడి రాష్ట్రస్థాయిలో తమ ప్రాంత ప్రయోజనాలకై పనిచేస్తున్నాయి. అసలే ప్రాంతాల మధ్య అసమానతల ఆధారంగా ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలకు దళితుల ఉద్యమం తోడైనట్లయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం రాజకీయ అనిశ్చితకు గురికాకతప్పదు. ప్రాంతీయ ఉద్యమాల సమస్యను పరిష్కరించాలన్నా, దళితుల మధ్య సామాజిక న్యాయం సాధించాలన్నా, ఒక సమగ్ర పరిశోధన జరిపి మూడు ప్రాంతాల ప్రజల అభ్యున్నతికి తగు చర్యలు తీసుకోకపోతే పరిస్థితులు చేయిదాటే ప్రమాదం ఉంది. ◆

**కాయకష్టం చేయకుండా పరాన్న భుక్కులుగా జీవిస్తున్న భూస్వాముల వద్దనున్న అదనపు భూములన్నింటిని స్వాధీనం చేసుకొని వ్యవసాయ కార్మికులకు ఎక్కువ భాగం, పేద రైతులకు కొంతభాగం పంచి పెట్టడం ఒక్కటే మార్గం అన్నారు పుచ్చలపల్లి సుందరయ్య**

(ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణగా వెలువడిన పుచ్చలపల్లి సుందరయ్యగారి ఏరిన రచనల (రెండవ భాగం) నుంచి 'భూ సమస్యపై సరియైన అవగాహన'లోని కొంత భాగాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాం. - సం.)

# భూ సమస్యపై సరియైన అవగాహన

*మన దేశంలో వ్యవసాయ సమస్యపై క్షుణ్ణంగా అధ్యయనం చేసిన కొద్దిమంది ముఖ్యులలో సుందరయ్యగారు ఒకరు. ఆయన ఈ సమస్యపై ఇంగ్లీష్‌లోనూ, తెలుగులోనూ పార్టీ అవగాహన కోసం ఎన్నో సైద్ధాంతిక పత్రాలను రచించారు. ఇప్పుడు ఇక్కడ ప్రచురించుతున్న వ్యాసాన్ని ఆయన 1970 ఆఖరులో తెలుగులో రాశారు.*

### జనతా ప్రజాస్వామ్యానికి ఇరుసు వ్యవసాయిక విప్లవం

ఆంధ్రప్రదేశ్‌లో నేటి జనాభా సుమారు అయిదారు కోట్లు. ఇందులో నూటికి 80 మంది గ్రామసీమల్లో నివసిస్తున్నారు. వ్యవసాయం మీద గాని, దానికి అనుబంధమైన వృత్తులలోగాని జీవించే వారి సంఖ్య మొత్తం జనాభాలో నూటికి 80 వరకు ఉంది. అనుబంధమైన వృత్తులంటే – పండ్ల తోటలు, చేపల పరిశ్రమ, అడవులలో కలప వగైరా పనులు; పశువులు, గొర్రెలు పెంపకం, పాల పరిశ్రమ; చాకలి, మంగలి వగైరా వృత్తులు; ధనికుల ఇండ్లలో వంటపని, ఇతర పనులు ఇలాంటి తదితర పనులు. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు నాలుగు కోట్లమంది వ్యవసాయం, దాని ఉపవృత్తులమీద జీవిస్తున్నారు.

వీరుగాక చేతివృత్తుల మీద గ్రామాలలో జీవించేవారు – చేనేత పారిశ్రామికులు, కుమ్మరి, కమ్మరి తదితర వృత్తులలో పనిచేసేవారు కూడా (వీరు జనాభాలో ఆరు శాతం ఉన్నారు) వ్యవసాయం మీద రోజు రోజుకు ఎక్కువగా ఆధారపడవలసి వస్తూ ఉంది. తమ వృత్తులలో తగిన ఆదాయం రాక పని ఒత్తిడిగా ఉన్న రోజులలో కోతలు, నాటువేతల సమయాలలో కూలికిపోవటం సహజమవుతుంది. అదేగాక వీరిలోనూ, పట్టణాలలో చిన్న చిన్న పరిశ్రమలు పెట్టుకున్నవారు లేదా ఫ్యాక్టరీలోనూ ఉద్యోగాలలోనూ ఉన్న వారిలో చాలా మందికి వారివారికి ఉన్న భూమి మీద నుండి వచ్చే ఆదాయం కూడా ఒక ముఖ్య ఉపాధిగానే ఉంటూ ఉంది.

అందుచేతనే వ్యవసాయం మీద జీవించే ఈ కోట్లాది ప్రజల జీవిత సమస్య పరిష్కారంగానిదే, వారికి సంవత్సరం పొడవునా పని, వారి కుటుంబ పోషణకు కావల్సిన కనీస జీవిత భృతి అయినా గ్యారంటీ చేయనంతకాలం దేశంలో పురోభివృద్ధి ఏ రంగంలో కూడ చెప్పుకో దగినంతగా జరగదు.

కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్) కార్యక్రమం 46వ పేరాలో ఈ విషయాన్నే ఇలా వివరించడం జరిగింది :

'భూమి పోగొట్టుకొని దైన్య స్థితిలో ఉన్న మన రైతాంగం తన వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకునేందుకు అవసరమైన కనీస వ్యవసాయ పనిముట్లుగాని, అవసరమైన ఎరువులు గాని, కొనగల స్థితిలో లేదు. కాబట్టే మన వ్యవసాయాన్ని తగినంతగా అభివృద్ధి చేసి దేశానికి అవసరమైన ఆహారాన్ని ఇతర ముడిసరుకులను ఉత్పత్తి చేసి సరఫరా చేసుకొనలేక పోతున్నాం'.

'మన దేశ జనాభాలో నూటికి 80 మందిగా ఉన్న రైతాంగం కనీస సంఖ్యలోనైన పరిశ్రమలో తయారైన వస్తువులను కొనగల స్థితిలో లేదు. కాబట్టే మన జాతీయ పరిశ్రమలను అభివృద్ధి చేయలేక పోతున్నాం. దేశాన్ని పెద్దగా పారిశ్రామికవంతం చేసుకోలేకపోతున్నాం'.

'అలాగే దారిద్ర్య బాధను భరించలేక ఆకలితో అలమటిస్తూ గ్రామసీమల నుండి వేలాది జనం పట్టణాలకు ఎగబాకి ఇప్పటికే పట్టణాలలో ఉన్న నిరుద్యోగుల సంఖ్యను మరింతగా పెంచి 'కూలిధర'ను మరింత తగ్గిస్తున్నందువలన కార్మికవర్గ పరిస్థితులను మనం మెరుగు పరచ లేకపోతున్నాం'.

'దారిద్ర్యంతో కృంగికృశించుతూ ఆకలితో అలమటించే రైతాంగమే మన జనాభాలో అత్యధికులు కాబట్టి, వారు తమ బిడ్డలకు విద్యా బుద్ధులను చెప్పించుకోగలిగే ఆర్థిక స్తోమతు కలిగి ఉండరు. కాబట్టి మనం త్వరితగతిన, వెనుకబడిన మన సాంస్కృతిక స్థితి నుండి బయట పడలేకపోతున్నాం'.

'అందువలన వ్యవసాయ రైతాంగ సమస్యలే మన దేశ జీవితానికి అత్యంత ప్రధానమైనవిగా పరిణమించాయి. అవే నేటి మన జాతీయ సమస్యలలోకల్లా మొదటి సమస్యగా ముందుకు వచ్చి ఉన్నాయి'.

అయితే వ్యవసాయం మీద జీవించేవారంతా, భూమి మీద కష్టపడి పనిచేసి జీవించడంలేదు. కొంతమంది, భూమి మీద కాయకష్టం చేయకుండానే భూమిని కౌలుకిచ్చి సాగుచేయించుకొని, వచ్చిన కౌలు ఫలితాన్ని అనుభవిస్తూ జీవిస్తున్నారు. లేదా కేవలం అజమాయిషీ మాత్రం చేస్తూ, తమ భూములను పాలేర్లచేత (జీతగాండ్రచేత) లేదా రోజు కూలీలచేత సాగుచేయిస్తూ, వారికి కొద్దిపాటి కూలీ, జీతాలిస్తూ వచ్చిన ఫలసాయాన్నంతా అనుభవిస్తున్నారు. ఈ విధంగా భూములమీద అన్ని ముఖ్య వ్యవసాయ పనులలో కూడా సంవత్సరం పొడవునా కాయకష్టం చేయని కుటుంబాలను, కేవలం భూములను కౌలుకిచ్చి ఫలసాయాన్ని అనుభవించే వారిని, లేదా అజమాయిషీ చేస్తున్న ముఖ్య వ్యవసాయ

పన్నులన్నింటినీ పాలేర్లచేత, రోజుకూలీల చేత చేయించుకొని ఫలసాయాన్ని అనుభవించే వారందరిని భూస్వాములుగా మనం పరిగణించవలసి ఉంది.

భూమి మీద అన్ని ముఖ్య వ్యవసాయ పనులలోను సంవత్సరం పొడవునా సొంతంగా కాయకష్టం చేసుకొని వచ్చిన ఫలసాయాన్ని అనుభవించే వారినందరినీ మనం రైతులుగా పరిగణిస్తాం.

## రైతులలో ఉన్న తరతమ భేదాలు

**ధనిక రైతు :** కొంతమంది తమ సొంత భూములు లేదా తాము కౌలుకు తీసుకున్న భూములు, మొత్తం తాము సాగుచేస్తున్న భూముల మీద తాము అన్ని ముఖ్య పనులలోను కాయకష్టం చేయడంతోపాటు, పాలేర్లను పెట్టుకుంటారు. పని ముమ్మరంగా ఉన్న రోజులలో ముఖ్యంగా నాటువేతలు, కలుపుతీతలు, కోతలు నూర్పిళ్లలో పాలేర్లనేగాక, రోజు కూలీలనుకూడ పెట్టుకుంటారు. తమ కుటుంబంలోనున్నవారు సంవత్సరం పొడవునా వ్యవసాయంలో పనిచేసే రోజులకన్నా, ఈ కూలీలచేత, పాలేర్లచేత పని చేయించుకొనే రోజులు ఎక్కువగా ఉంటాయి. అంటే వీరు తమ సొంత ఆర్జితాన్నే గాకుండా, కూలీల, పాలేర్ల పని ఫలితాన్నుండి అదనపు విలువను కూడా భుక్తం చేసుకుంటున్నారు. ఇలాంటి కుటుంబాలను మనం ధనిక రైతులుగా పరిగణించాలి.

కామ్రేడ్ లెనిన్, కుటుంబ శ్రమశక్తికన్న (పనిరోజులకన్న) కూలీల శ్రమశక్తి (పనిరోజులు)ని ఎక్కువగా వినియోగిస్తున్న కుటుంబాల నన్నింటిని ధనిక కుటుంబాలుగా పరిగణించాలని చెప్పాడు. చైనా కమ్యూనిస్టు పార్టీ, గ్రామసీమలలో తమ దేశంలోని రైతులలోనున్న వివిధ తరగతులను గూర్చి పరిశీలిస్తున్నప్పుడు, ఏ కుటుంబానికైనా దాని మొత్తం ఆదాయంలో నూటికి 30 పాళ్లు ఇతరుల శ్రమ ఫలితంగా వస్తే (కౌలు ఆదాయంగాని, వడ్డీ నాగుల మీదగాని, లేక కూలీల, పాలేర్ల అదనపు విలువనుండి గాని వస్తే) అట్టి కుటుంబాన్ని ధనికరైతు కుటుంబంగా పరిగణించాలని నిర్ణయించింది.

పరార్జితం మీద గణనీయంగా ఆధారపడే కుటుంబాల మానసిక తత్వం దోపిడీవర్గాల మానసిక తత్వంగా ఉంటుంది. కష్టజీవులతో కలిసి మెలసి పనిచేయడానికి కన్నా తమకన్నపై నున్న దోపిడీ వర్గాలతో కలిసి పనిచేసే తత్వం ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి ధనిక రైతు కుటుంబాలు తాము పెట్టుకునే కూలీలకు, పాలేర్లకు న్యాయమైన గిట్టుబాటయ్యే కూలీ రేట్లు, జీతాలు ఇవ్వడంలో వారితో ఘర్షణ పడుతూ ఉంటారు. అదే రీతిగా తాము ఇచ్చే అప్పులమీద ఎక్కువ వడ్డీ రేట్లు, నాగులు రాబట్టుకోడానికి ఒత్తిడి చేస్తూ ఉంటారు. అదే రీతిగా తమ భూములలో కొంత భాగాన్ని కౌలుకు ఇచ్చినప్పుడు ఎక్కువ కౌలు రేటును వసూలు చేసుకోడానికి చూస్తారు.

సామాన్యంగా ధనిక రైతుకు, తన వ్యవసాయం మీద వచ్చే నికరాదాయం తన మామూలు కుటుంబ జీవితానికి పోను, ఏటేటా మిగులుతూ ఉంటుంది. ఈ మిగిలిన ఆదాయన్ని అతడు పెట్టుబడిగా వినియోగించుకొంటాడు. తన భూకమతాన్ని అభివృద్ధి చేసుకోడానికి గాని, లేదా వడ్డీ నాగులకు ఇచ్చి లాభాలను సంపాదించుకోడానికి గాని, లేదా తదితర చిన్న చిన్న సహాయక వృత్తులకు పెట్టుబడిగా మిగులు ఆదాయాన్ని వినియోగించుకొంటాడు. వ్యవసాయ పరిస్థితులు గడ్డుగా ఉన్న ఏ కొద్ది ప్రత్యేక ప్రాంతాలలోగాని, కొన్ని కొన్ని సందర్భాలలో వచ్చే ఆదాయంలో మామూలు కుటుంబ ఖర్చులకు పోను మిగలక పోవచ్చు. అయినా అట్టి ప్రాంతాలలో కూడా కుటుంబార్జితానికన్న, పరార్జితం మొత్తం ఆదాయంలో ఎక్కువ భాగంగా ఉన్నప్పుడు ఆ కుటుంబాన్ని మనం ధనిక రైతు కుటుంబంగాన్నే పరిగణిస్తాం.

మరికొన్ని ప్రత్యేక ప్రాంతాలలో అక్కడి వ్యవసాయ పరిస్థితులు, భూసారాన్ని బట్టి, తక్కువ కూలీలను పెట్టుకున్నా, కుటుంబ శ్రమ రోజులే ఎక్కువగా ఉండి, పరార్జితం తక్కువ భాగంగానే ఉన్నా, ఏటేటా ఆదాయం మామూలు కుటుంబ పోషణకు పోను, పెట్టుబడిగా వినియోగించుకొనే మేరకు మిగులుతూ ఉండవచ్చు. అలాంటి కుటుంబాన్ని కూడా మనం ధనికరైతు కుటుంబంగానే పరిగణిస్తాం.

**మధ్యతరగతి రైతు :** తమ సొంతం మీద లేదా కౌలు భూమి మీద మొత్తం తాము సాగుచేస్తున్న భూమి మీద, తమ కుటుంబం సంవత్సరం పొడవూ అన్ని ముఖ్యపనులలో కాయకష్టం చేసి పంటలు పండిస్తారు. వీరిలో చాలామంది చిన్న పాలేర్లను ఇంటి పనులకోసం, వ్యవసాయ పనులు, గేదెలు తదితర పశువుల కాపరి పనిచేయడానికి పెట్టుకుంటారు. ముమ్మడి పనితరుణాలలో నాటు వేతలు, కోతలలో రోజు కూలీలను కూడా పెట్టుకుంటారు. వీరి కుటుంబశ్రమ రోజులు, ఈ కూలీ పనిరోజుల కన్న అత్యధికంగా ఉంటాయి. కుటుంబార్జితం కన్న పరార్జితం తమ మొత్తం ఆదాయంలో చాలా తక్కువగా ఉంటుంది. వీరికి వ్యవసాయం మీద వచ్చే నికరాదాయం వారి మామూలు కుటుంబ పోషణకు బొటాబొటిగా సరిపోతుంది. చాలామందికి లోటు కూడా వస్తుంది. పంటలు బాగా పండి అన్నీ సవ్యంగా కలిసివచ్చిన సంవత్సరం లోనే, పెట్టుబడిగా వినియోగించుకోగలిగిన మోతాదులో మిగలవచ్చు. ఇట్టి కుటుంబాలను మధ్య తరగతి కుటుంబాలుగా పరిగణిస్తాం.

**ధనిక రైతుకు, మధ్య తరగతి రైతుకు మధ్య గీటురాయి :** మధ్య తరగతి రైతు కుటుంబంలో శ్రమశక్తి రోజులు, కూలీ పాలేర్ల పని రోజులకన్న ఎప్పుడూ ఎక్కువగా ఉంటాయి. రెండవ గీటురాయి : ధనిక రైతు కుటుంబానికి సామాన్యంగా ఎటేటా పెట్టుబడిగా పెట్టుకోగలిగిన మేరకు ఆదాయం మిగులుతుంది. మధ్య తరగతి రైతుకు ఈ విధంగా సామాన్యంగా మిగలదు. చాలామందికి లోటు కూడా వస్తుంది. అపురూపంగా మాత్రమే మంచి సంవత్సరాలలోనే మిగులుతుంది.

**పేద రైతు :** పేద రైతు కుటుంబానికి, తమ వ్యవసాయం మీద వచ్చే నికరాదాయం, తమ నికృష్ట మామూలు కుటుంబ పోషణకు కూడా చాలదు. ఎప్పుడూ లోటుగానే ఉంటుంది. అందుచేత, ఇతరుల కింద కూలీ పనికిగాని, లేకతన ప్రధాన వ్యవసాయాదాయానికి సహాయంగా మరేదైనా తాత్కాలిక ఉపవృత్తులు చూసుకుంటూ జీవితం గడుపుతూ ఉంటాడి పేదరైతు. ఇతరులను కూలీకి పెట్టుకుని ఆ కూలీ శ్రమశక్తిని దోచుకోడు. ఎప్పుడయినా వ్యవసాయ పరిస్థితిని బట్టి కూలీలను పెట్టుకున్నా తాను కూడా బదులుగా గాని లేక ఇతరుల కింద కూలికి గాని పోతుంటాడు.

**వ్యవసాయ కార్మికులు :** వ్యవసాయ కార్మికులు తమ శ్రమశక్తిని అమ్ముకొని కూలి పనిమీద ప్రధానంగా జీవిస్తారు. వీరిలో కొంతమందికి

కొద్దిపాటి భూమి ఎకరం, అర ఎకరం ఉన్నా ప్రధాన కుటుంబ ఆదాయం భూమి మీదగాక, వ్యవసాయ కూలిపనుల నుండి గాని లేక తదితర వ్యవసాయ ఉపవృత్తులలో కూలి చేసుకోవడం వల్ల గాని వస్తుంది. ఇట్టి కుటుంబాలనన్నిటినీ మనం వ్యవసాయ కార్మికులుగా పరిగణిస్తాం.

## గ్రామంలో వర్గ విభజన

గ్రామసీమలలో ఈ వర్గ విభజన ఏ మేరకు అభివృద్ధి చెందినదీ పరిశీలించి మనం సరైన అవగాహన కలిగి ఉండాలి. అదే రీతిగా గ్రామాలలో దోపిడీ ఏ రీతిగా ఉన్నదీ, ఏ రూపాలలో ఉన్నదీ, ఈ దోపిడీ విధానాలు వ్యవసాయ కార్మికులను, పేద రైతులను, మధ్య తరగతి రైతులను, ధనిక రైతులను ఏ విధంగా బాధిస్తున్నదీ కూడ మనం తెలుసుకోవాలి. అప్పుడే మనం వారి వారి కోర్కెలేమిటో సరిగా అర్థం చేసుకొని వాటిని తగు రీతిగా రూపొందించగలం. వాటిని సాధించడం కోసం సరైన ఎత్తుగడలతో, భూస్వాములకు వ్యతిరేకంగా వివిధ రైతు వర్గాలను ఆయా సమస్యలను సందర్భాలలో కలుపుకొని పోరాడటం సాధ్యమవుతుంది.

మనం ఒక సమస్యను తీసుకొని సాధించుకోవడానికి పోరాడ బూనుకున్నప్పుడు మనం ఎదుర్కోవలసిన శక్తులు నూటికి పదికి మించకుండా ఉండేట్లు చూసుకోవాలి. మిగిలిన 90 మందిని కలుపుకు రావడానికి గట్టిగా ప్రయత్నించాలి. ఎందుకంటే, ఏ సమయంలోనైనా, ఏ సందర్భంలోనైనా మన ప్రత్యర్థి బలం, సంఖ్య ఎంత కొద్దిగా ఉంటే, మన బలం, మన మిత్రబృందాల బలం ఎంత ఎక్కువగా ఉంటే అంత తేలికగా మనం మన కోర్కెలను విజయవంతంగా సాధించుకోగలం. ఒక విజయం సాధించితే, దాని అనుభవంతో, ఫలితంతో మరింత విశ్వాసంతోను, చొరవతోను, మరింత అదనంగా కష్టజీవులు కదలి దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడడానికి ముందుకు వస్తారు. మరింత పెద్ద కోర్కెలను ఒకదాని తరువాత మరొకటి సాధించుకొంటూ ముందుకు పోగలుగుతారు.

మన గ్రామసీమలలో ప్రతి కుటుంబాన్ని పై కొలబద్దతో, పై అవగాహనతో పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ లోపల స్థూలంగా ప్రభుత్వం ప్రకటించిన జనాభా తదితర లెక్కలను ఆధారంగా, మన గ్రామాలలోని పరిస్థితి ఏ రీతిగా ఉందో తెలుసుకొని 'దున్నే వారికే భూమి' అనే నినాదాన్ని అమలు జరపడానికి మనం ఏ విధంగా కృషి చేయాలో చూద్దాం.

సెంటు గుంట కూడా భూమిలేని వ్యవసాయ కార్మిక కుటుంబాలు పూర్తిగా తమ శ్రమశక్తిని అమ్ముకొని రోజు కూలీలాగ, నెలసరి లేదా సాలుసరి జీతగాళ్లగానో జీవించేవారు. ఎకరం మాగాణి భూమి, రెండు మూడు ఎకరాలు మెట్టకు లోపు భూమి ఉండి కూడ ప్రధానంగా కూలీ చేసుకొని జీవించే కుటుంబాలు, గ్రామసీమలలో వ్యవసాయ ఉత్పత్తులలో కూలి మీద ప్రధానంగా జీవిస్తున్న కుటుంబాలు – వీరు మొత్తం ఆంధ్రప్రదేశ్ జనాభాలో నూటికి యాభై మందికి తగ్గకుండా ఉన్నారు. సుమారు యాభై లక్షల కుటుంబాలు, వ్యవసాయ కార్మిక కుటుంబాలుగా ఉంటున్నాయి. వీరి చేతిలో ఉన్న భూమి పది లక్షల ఎకరాలకు మించదు.

మరోవైపు పది ఎకరాలకు మించి మాగాణి భూమిగాని లేదా ఇరవై ఎకరాలకు మించిన మంచి మెట్ట భూమిగాని కలిగిన కుటుంబాలు, భూమిమీద కుటుంబాలలోని ఏ ఒక్కరూ ముఖ్యమైన వ్యవసాయ పనులలో సంవత్సరం పొడవూ కాయకష్టం చేయకుండా, అజమాయిషీ చేస్తూ పాలేర్లతో, రోజు కూలీలతో సాగు చేయించుకునే కుటుంబాలు లేదా తమ భూములను కౌలుకిచ్చి వచ్చిన పరార్జిత ఆదాయంతో జీవించే కుటుంబాలు – ఇలాంటి భూస్వామ్య కుటుంబాలు మొత్తం జనాభాలో నూటికి నాలుగు పాళ్లకు మించకుండా ఉన్నాయి. వీరి సంఖ్య సుమారు మూడు లక్షల మధ్య ఉంటుంది. అయితే మొత్తం సాగు అయ్యే భూమిలో నూటికి నలభై పాళ్లకు పైగా వీరి చేతిలో ఉంది. వీరి స్వాధీనంలో ఉన్న భూములు సుమారు కోటి ఎకరాలు.

ఒక ఎకరం నుండి రెండు ఎకరాల వరకు మాగాణి గాని లేదా రెండు ఎకరాలు మొదలు ఐదు ఎకరాల వరకు మెట్టభూమిగాని కలిగి సాగు చేసుకుంటున్న కుటుంబాలు – తమ కుటుంబమంతా కష్టపడి కాయకష్టం చేసినా వీరికి ఆ భూకమతాల నుండి వచ్చే నికరాదాయం తమ కుటుంబ పోషణకు చాలక నిరంతరం అప్పులపాలవుతూ ఇతరుల కింద కూలికి గాని లేదా ఇతర వృత్తులలో కొద్దిగా సంపాదించుకొంటూ ఏదో విధంగా తమ జీవితాన్ని నికృష్టంగా గడుపుకొనే పేదరైతు కుటుంబాలు నూటికి పదిహేను వరకు ఉన్నాయి, ఇలాంటి పేద రైతు కుటుంబాల సంఖ్య సుమారు పదిహేను లక్షలు ఉంటాయి. వీరి స్వాధీనంలో ఉన్న భూములు సుమారు నలభై లక్షల ఎకరాలు. మొత్తం వ్యవసాయ కార్మికుల పేదరైతుల చేతులలో ఉన్న భూములు ఇరవై శాతం కన్న మించవు.

రెండు ఎకరాల నుండి ఐదు ఎకరాల వరకు మాగాణి భూమి గాని, ఐదు ఎకరాల నుండి పది పంద్రెండు ఎకరాల వరకు మెట్ట భూమి కలిగి తమ కుటుంబమంతా దానిపై కాయకష్టం చేసుకుంటూ కుటుంబ పోషణకు సరిపడ ఫలసాయం పొందుతూ ఉండే కుటుంబాలు, చిన్న పశువుల కాపరులను, పని ఒత్తిడి రోజులలో రోజుకూలీలను పెట్టుకున్నా, తమ కుటుంబ శ్రమ మీదనే ప్రధానంగా ఆధారపడే కుటుంబాలు మధ్యతరగతి కుటుంబాలు నూటికి పది వరకు ఉన్నాయి. ఇలాంటి కుటుంబాల సంఖ్య సుమారు పది లక్షలు ఉన్నాయి. వీరి స్వాధీనంలో ఉన్న భూములు నలభై లక్షల ఎకరాలు అంటే, మొత్తం భూమిలో ఇరవై శాతం.

ఐదు, పది ఎకరాల మధ్య మాగాణి భూమిగాని లేదా పది, ఇరవై ఎకరాల మధ్య మెట్ట భూమిగాని కలిగి కుటుంబంలోనివారు ముఖ్య వ్యవసాయ పనులలో కాయకష్టం చేసుకుంటూనే పాలేర్లను, రోజు కూలీలను అదనంగా పెట్టుకుంటారు. వచ్చే ఆదాయం కుటుంబం పోషణకు పోను, ఏటేటా మిగులుతూ పెట్టుబడిగా వినియోగించుకోడానికి ఉపయోగపడేటంతగా లభ్యమవుతుంది. ఇలాంటి కుటుంబాలు ధనిక రైతు కుటుంబాలు. నూటికి ఐదు పాళ్లు ఉంటాయి. వీరి సంఖ్య ఐదు లక్షలు ఉంటుంది. వీరి చేతులలో ఉండే భూమి సుమారు యాభై లక్షల ఎకరాలు. భూస్వాములు, ధనిక రైతుల చేతులలో ఉన్న భూమి అరవై శాతం వరకు ఉంటుంది.

(ఇలా వివిధ రైతుల వర్గీకరణకు, పైన వివరించబడిన భూ పరిమితులు చాలా స్థూల పరిశీలనలతో చేయబడినాయి. ఈ పరిమితులు

ఆయా కౌలు కాలాలలోను, వివిధ గ్రామాలలో కూడా అచ్చట ఉన్న నీటి పారుదల వసతులు, భూసారం, పండించే పంటల క్రమం, వ్యవసాయ పద్ధతులు, భూ సంబంధాలు, అనేక విషయములను బట్టి వేరువేరుగా ఉండవచ్చు. మెట్ట మాగాణి భూములలో కూడా వివిధ రకాల భూసారములు, వివిధ రకాలైన పంటలు పండేవి ఉన్నాయి. అందుచే వర్గీకరణ చేయవల్సివచ్చినప్పుడు ప్రతి గ్రామంలో ప్రతి కుటుంబ విషయం ప్రత్యేకించి చేయవల్సి ఉంటుంది. వివిధ తరగతుల శాతం, వారికి ఉన్న భూమి శాతం కూడా పైన వివరించిన శాతంగాక ఎక్కువగానే ఆయా ప్రాంతాలలో ఉండవచ్చు.

కాని ఒకేరకమైన పంటలు పండే ప్రదేశంలో స్థూలంగా చూసినప్పుడు ఒక సింగిల్ కుటుంబం – భార్యాభర్త వారిమీద ఆధారపడి జీవిస్తూ ఉన్న చిన్న బిడ్డలు (మైనారిటీ తీరని బిడ్డలు) గల కుటుంబాన్ని పరిశీలిస్తే పై పరిమితులు ఒక విధంగా స్థూలంగా సరిపోవచ్చు. ఈ పరిమితులలో ఉన్న కుటుంబాలను ఒక గ్రామంలో గానీ, ఒక ప్రాంతంలో గానీ పరిశీలించేటప్పుడు ఆయా పరిమితులలోనున్న కుటుంబాలలో నూటికి 80–90 మంది పేద, మధ్యతరగతి, ధనిక రైతు, భూస్వామి కుటుంబ లక్షణాలు కలిగి ఉండి ఒక పదిశాతం దానికి భిన్నంగా ఉన్నా మనం స్థూలంగా అపరిమితులలోనున్న వారిని పై రీతిగా ఆయా తరగతులకు చెందిన వారీగా పరిగణించవచ్చు.)

మరో విషయం కూడ గుర్తుంచుకోవాలి. పది ఎకరాలలోపు మాగాణి భూమి ఉన్న చిన్న భూ కామందులు సొంతంగా కాయకష్టం చేయకుండా కౌలుకివ్వడం గాని, పాలేర్లు, రోజు కూలీలతో వ్యవసాయం చేయించుకోవడం మనం తరచుగా మన గ్రామాలలో చూస్తున్నాం. నేటి ఆర్థిక, సామాజిక పరిస్థితులలో విపరీతమైన హెచ్చు కౌలు రేట్లు ఇచ్చి అయినా వ్యవసాయ కార్మికులు పేదరైతులు కౌలుకు తీసుకుంటున్నారు. అదే రీతిగా, పనిలేక పస్తులుండే వ్యవసాయ కార్మికులు చాలా తక్కువ కూలీ రేట్లకు పనిచేయడానికి అత్యధిక సంఖ్యలో ముందుకు వస్తున్నారు. అందుచేత ఎక్కువ కౌలురేట్లకు భూమిని కౌలుకివ్వడం లేదా తక్కువ కూలీ రేట్లకు వచ్చే కూలీలతో వ్యవసాయం చేయించు కోవడం లాభసాటిగా ఉంది కాబట్టి కాయకష్టం చేసి సొంతంగా వ్యవసాయం చేయకుండా, ఈ పరార్జిత ఫలసాయం అనుభవించడం జరుగుతూ ఉంది. కాని వ్యవసాయ కార్మికుల, కౌలు రైతుల చైతన్యం, సంఘటన పెరిగి తమ న్యాయమైన హక్కుల కోసం చేసే పోరాటాలు పెరిగే కొద్దీ వీరిలో చాలామంది సొంతంగా కాయకష్టం చేసి సాగు చేసుకోవడానికి ముందుకు వస్తారు.

ఇలాంటి చిన్న భూ కాముందులు, మరొక తరహాకు చెందినవారు. వీరు అత్యధిక సంఖ్యాకులు. వీరు తమ భూములలో నుండి వచ్చే ఆదాయం చాలక, దానిని కౌలుకిచ్చి, తాము ఇతర వృత్తులలోకి, ఫ్యాక్టరీలలో పని చేయడానికి, ప్రభుత్వ ఉద్యోగాలలోకి, గుమాస్తాలుగా, ఉపాధ్యాయులుగా, లేక చిన్న పరిశ్రమలను, వ్యాపారాలను చేసుకుంటూ జీవించే వారున్నారు. వీరికి వ్యవసాయం మీద నుండి వచ్చే ఆదాయం పరార్జితమైనా తమ జీవితానికి సహాయంగా ఉంటూ ఉంది. ఇలాంటి వారు తమ ప్రధాన జీవన వృత్తులు వదులుకొని సొంతసాగు చేసుకోడానికి తిరిగి రావడం చాలా అరుదు. అందువల్ల ఇలాంటి చిన్న భూ కామందు లకు పూర్తి మార్కెట్ ధర ఇచ్చి ప్రభుత్వం ఆ భూములను వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు ఉచితంగా పంచి పెట్టవలసి ఉంటుంది.

ఈ వృత్తులలో భూస్వాములకు వచ్చే ఆదాయాలకన్న తగ్గకుండా ఎక్కువ ఆదాయాలు వస్తున్న వారిని భూస్వాములుగానే పరిగణించి వీరి భూమి విషయం చర్యలు తీసుకోవలసి ఉంటుంది.

### భూ పోరాటం

పైన వివరించిన విధంగా యాభై లక్షల మంది వ్యవసాయ కార్మిక కుటుంబాల చేతులలో పది లక్షల ఎకరాలకు మించిలేదు. కుటుంబానికి ఇరవై సెంట్ల కన్న భూమి లేదు. పదిహేను లక్షల పేద రైతుల చేతులలో నలభై లక్షల ఎకరాలు ఉంది. వీరికి ఒక్కొక్క కుటుంబానికి సగటున రెండు మూడు ఎకరాల లోపునే భూమి ఉంది. ఈ కొద్దిపాటి భూమి ఆ కుటుంబాలు పని చేసుకోడానికి ఏ మాత్రం చాలదు. సంవత్సరంలో రెండు వందల రోజుల వరకు పనిలేని స్థితిలోనే వ్యవసాయ కార్మికులు ఉంటున్నారు. వీరికి సంవత్సరంలో మూడు వందల రోజులకు పని కల్పించాలంటే అందుకు కావలసిన పరిశ్రమలు తదితర వృత్తులు కల్పించడానికి వేల కొలది కోట్ల రూపాయలను పెట్టుబడి పెట్టవలసి ఉంటుంది. ధనం మాత్రమే గాక అలాంటి పరిశ్రమలు నిర్మించడానికి దశాబ్దాలు పడతాయి. ఈ లోపల ఈ కోట్ల కొలది వ్యవసాయ కార్మికులు, పేద రైతులు నిరుద్యోగంతో, పస్తులతో జీవిస్తూ ఉండాలనడం సమంజసం కాదు. అలా అనడం సహించరాని విషయం.

అంతేకాకుండా ఈ లక్షల కొలది కుటుంబాలలోని వీరికి పని చూపించనంత కాలం వీరి శ్రమశక్తిని వినియోగించుకోలేనంతకాలం కొత్త పరిశ్రమలను పెట్టడానికి కావలసిన పెట్టుబడిని, యంత్రాలు, ముడిసరుకులను కూడా ఉత్పత్తి చేయడం సాధ్యం కాదు. కొద్దిగానో, గొప్పగానో నేడు తయారవుతున్న పరిశ్రమలలోని వస్తువులను కూడా కొనుగోలు చేయడానికి తగిన స్తోమతు లేకపోయినందువల్లనే (ఈ కోట్లాది మంది నిరుద్యోగులుగా ఉండడమే దీనికి కారణం) చేతివృత్తులు, యంత్ర పరిశ్రమలు సంక్షోభంలోపడి మూసి వేయబడుతున్నాయి. అందుచే ముందు సాధించవలసినపని, ఈ కోట్ల కొలది వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు మరింత అదనంగా పనికల్పించి వారి ఆదాయాన్ని వారి కనీస పోషణకు కావలసిన మోతాదులోనయినా పెంపొందించవలసి ఉంటుంది.

దీనికి వెనువెంటనే సాధ్యమయ్యేది, చేయ్యవలసిన పని, నేడు స్వయంగా కాయకష్టం చేయకుండా పరాన్న భుక్కులుగా జీవిస్తున్న భూస్వాముల వద్దనున్న అదనపు భూములన్నింటిని స్వాధీనం చేసుకొని వ్యవసాయ కార్మికులకు ఎక్కువ భాగం, పేద రైతులకు కొంతభాగం పంచి పెట్టడం ఒక్కటే మార్గం. ఈ భూస్వాములు తమ పాత సోమరి జీవితాన్ని వదిలి స్వయంగా కాయకష్టంతో భూములను సాగుచేసి జీవించడానికి ముందుకు వస్తే వారికి కూడా వారి కుటుంబం పనిచేసు కోగలిగిన మేరకు కావల్సిన భూమిని ధనిక రైతు కుటుంబ స్థాయి జీవితాన్ని అనుభవించడానికి కావలసిన భూమిని వదలి పెట్టవలసి ఉంటుంది. అలా స్వయంగా కాయకష్టం చేసి సాగుచేసుకోవడానికి తయారు కానివారికి, లేదా ఇతర వృత్తులు, ఉద్యోగాలు ఉండి నెలకు

ఐదు వందల రూపాయలకు మించి ఆదాయం వస్తూ కుటుంబ పోషణకు ఇబ్బంది లేని వారికి భూములు వదలవలసిన పనిలేదు.

పది ఎకరాల మాగాణి భూమి లేక ముప్పై ఎకరాల మెట్ట భూమికి మించిన కుటుంబాల వారందరూ స్వయంగా కాయకష్టం చేయని కుటుంబాలుగానున్నారు. కాబట్టి వారిని భూస్వాములుగా పరిగణించ వచ్చునని పైన చూశాం.

అందువల్ల వీరివద్దనున్న భూములన్నిటిని మనం స్వాధీనం చేసుకుంటే వ్యవసాయ కార్మికులకు, పేద రైతులకు పంచి పెట్టడానికి సుమారు ఎనభై లక్షల ఎకరాల సాగుభూమి లభ్యమవుతుంది. వ్యవసాయ కార్మిక కుటుంబాల చేతులలోను, పేదరైతు కుటుంబాల చేతులలోనున్న యాభై లక్షల ఎకరాల భూమిని కూడా కలుపుకొని పంచితే ప్రతి వ్యవసాయ కార్మిక, పేద రైతు కుటుంబానికి సుమారు రెండు ఎకరాల వంతున భూ కమతాలు ఏర్పడుతాయి. ఈ రెండు ఎకరాల భూమిమీద మెట్ట సాగు చేసి ఎక్కువ పంట పండించడానికి తగిన విత్తనాలు, ఎరువులు, ఇతర సౌకర్యాలు కలుగజేస్తే ఒక వెయ్యి కిలోగ్రాములు గట్టి గింజలు లేక దానికి సమానమైన ఇంకా ఎక్కువ విలువగలిగిన ఇతర పంటలు పండించడం సాధ్యమవుతుంది. పప్పు ధాన్యాలు, నూనె గింజలు, మిరప తదితర వ్యాపారపంటలను కూడా పండించవచ్చు. అంటే వీరందరికి వెనువెంటనే తలకొక అర్ధశేరు (అర కిలోగ్రాము) బియ్యంగాని, గట్టి గింజలు గాని పండించుకొని ఆకలి తీర్చుకోగలుగుతారు.

ఆంధ్రప్రదేశ్ భూస్వాముల వద్దనున్న ఈ అదనపు భూములే గాక, సాగుకు లాయకు అయిన బంజర్లు, పచ్చిక భూములు, అడవి పేరుతో నమోదు చేయబడి చెట్లులేని సాగుకు పనికివచ్చే అడవి బంజర్లు, పడావులు మరో రెండు కోట్ల ఎకరాలున్నవి. వీనిని కూడ కొన్ని సంవత్సరాలలో క్రమంగా సాగులోకి తెచ్చే కొద్దీ వ్యవసాయ కార్మిక, పేద రైతు కుటుంబాలకు సగటున ప్రతి కుటుంబానికి మరో రెండు మూడు ఎకరాల భూమిని అదనంగా పంచి పెట్టడం సాధ్యమవుతుంది.

వివిధ రకాలైన బంజరు భూములను (అడవి బంజర్లు, చెరువు లోతట్లు, ప్రాజెక్ట్ బంజర్లు, పచ్చిక బీళ్లు, లంక భూములు, గట్టు నంబర్లు, పోరంబోకులు) సాగులోకి తేవడానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది. వెనువెంటనే సాగుకు తేగలిగినది చాలా కొద్దిగానే ఉంటుంది. అదే కాకుండా, ఈ బంజర్లు భూమి కొద్ది ప్రాంతాలలోనే తగిన మోతాదులో ఉంది. అనేక ప్రాంతాలలో లేవు. ఉన్న ప్రాంతాలలో కూడా అక్కడ ఉన్న పేద కుటుంబాలకు ఒక్కో కుటుంబానికి రెండు లేక మూడు ఎకరాల చొప్పున కొద్ది భాగానికే సరిపోతాయి. అందుచేత వ్యవసాయ కార్మిక కుటుంబాలన్నింటిని కలిపి పోరాటంలోకి తీసుకురావాలన్నా, వారి సమస్యను ఒక మోతాదులోనైనా పరిష్కరించాలన్నా, ప్రతి గ్రామంలోను భూస్వాముల వద్దనున్న అదనపు భూములను (వారు సొంత కాయకష్టంతో సాగుచేసుకోని భూములనన్నిటినీ) స్వాధీనం చేసుకొని పంచుకొనే కార్యక్రమాన్ని ప్రచార ఆందోళనతో పోరాడి సాధించు కోవటమే ప్రధాన సమస్య అవుతుంది. బంజరు పోరాట సమస్య, కూలీ రేట్లు, అప్పులు తదితర సమస్యలన్నీ ఈ సమస్యకు అనుబంధించిన ఉపసమస్యలు మాత్రమే. సమగ్ర భూపోరాటానికి తోడ్పడే పాక్షిక సమస్యలు పాక్షిక పోరాటాలు మాత్రమే. అది వ్యవసాయ కార్మిక, పేద రైతు కుటుంబాలకు అనుకూలంగా, భూస్వాముల పెత్తనాన్ని, వారి గుత్తాధికారాన్ని బద్దలుకొట్టడానికి వారి వద్దనున్న అదనపు భూముల నన్నిటిని పంచుకునే ఉద్యమం జయప్రదం కానంతవరకు ఈ పాక్షిక విజయాలు సాధిస్తూ వచ్చినా వాటికీ తిరిగి తిరిగి ఈ భూస్వాములు తమ బలాన్ని పుంజుకొని దెబ్బకొట్టడానికి ప్రయత్నిస్తూనే ఉంటారు. అందుచేతనే భూస్వామ్య విధానాన్ని రద్దు చేయనంతకాలం 'దున్నేవారికే భూమి' అనే నినాదాన్ని అమలు జరపనంతకాలం ఈ సమస్యలు ఏవీ పరిష్కారం కావు.

## కౌలు దోపిడి

మన గ్రామసీమలలో నేడు కౌలు వ్యవసాయం ప్రధానంకాదు. భూకామందు తన కుటుంబ శ్రమతోగాని లేదా పాలేర్లను, రోజు కూలీలను పెట్టుకొని సాగుచేయడం ప్రధానంగా ఉంది. భూకామందులు ప్రభుత్వానికి భూమి శిస్తు నీటి తీరువా ఏటేటా కట్టుతున్నారు. మునుపటి లాగ సాగుచేసే రైతులు, ప్రభుత్వానికీ మధ్య ఉండిన జమీందారులు, ఇనాందారులు తదితర దళారీలకు కౌలుగాని, శిస్తుగాని ధాన్యరూపంలో గానీ రొక్కంగా గానీ కట్టవలసిన పనిలేదు. మునుపటిలాగ నిర్బంధంగా జమీందారీ, బడా భూస్వాముల భూమి మీద వెట్టిచాకిరి చేయవలసిన స్థితి నేడులేదు.

అయితే మన ఆంధ్రదేశంలో పూర్తిగా కౌలు భూమిమీద జీవించే సాగుదార్లు నూటికి ఐదారుగురు వంతున వివిధ తాలూకాలలోనూ ఉన్నారు. తన సొంత భూమితోబాటు కౌలుకు కూడా కొంత భూమిని తీసుకొని సాగుచేసుకునే రైతులు గణనీయమైన సంఖ్యలోనే ఉన్నారు. 1961 జనాభా లెక్కల ప్రకారం 5-15 ఎకరాల మధ్య సాగుచేసే వారిలో నూటికి నలుగురు లేదా ఐదుగురు పూర్తిగా కౌలు భూముల మీద, ఇరవై మంది వరకు కొంత సొంత భూమి, కొంత కౌలు భూమి సాగుచేసుకొనే వారుగా ఉన్నారు.

ముప్పై ఎకరాలకు మించి సాగుచేసేవారిలో నూటికి ఇరువురు మాత్రమే పూర్తిగా కౌలు భూమిని సాగుచేస్తున్నారు. నూటికి సుమారు ఇరవై మంది వరకు సొంత భూమితోపాటు కౌలు భూమిని కూడ తీసుకొని సాగు చేసేవారుగా ఉన్నారు. అంటే పెద్ద కమతాల వారు, చిన్న రైతుల నుండి వ్యాపార పంటలు లేదా ఎక్కువ లాభదాయకమైన విస్తృత వ్యవసాయం, పంటలు పండించడానికి కౌలుకు ఇతరుల నుండి తీసుకొని సాగు చేస్తున్నారనేది స్పష్టం. భూస్వాములు చిన్న రైతుల నుండి కౌలుకు తీసుకొని ఉన్నచోట్ల, వారు చిన్న రైతులకు మరింత అదనంగా కౌలు మొత్తాలు చెల్లించవలసి ఉంటుందని, ఆ భూములను ఎప్పుడు పడితే అప్పుడు చిన్నరైతులు తిరిగి స్వాధీనం చేసుకోడానికి హక్కు కలిగిఉండాలి.

కోస్తా, రాయలసీమ ప్రాంతాలలోని చిన్న చిన్న కౌలు రైతులకు, తాము కౌలుకు సాగుచేస్తున్న భూముల మీద ఎట్టి జిరాయితీ హక్కులేదు. ఎప్పుడు పడితే అప్పుడు భూస్వాములు కౌలు రైతులను తొలగించి ఆ భూమిని తిరిగి స్వాధీనం చేసుకొనే స్థితిలోనే ఉన్నారు. కొంతవరకు దేవాలయ భూముల మీద పండిన పంటలో సగం కట్టుకొంటూ అనుభవిస్తూ వచ్చిన కౌలుదార్లకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెచ్చిన కొత్త చట్టం ఈ హక్కును కూడా లేకుండా చేస్తూ ఉంది. కౌలు రేటు పండిన

పంటలో సగంకన్న ఎక్కువ ఉండకూడదని పాత చట్టంలో ఉండేది. కాని అది ఎక్కడా అమలులోలేదు. నేడు కొత్త చట్టంలో కౌలు రేటును మెట్ట భూములలో నాలుగవ వంతుకు, మాగాణి భూములలో ముప్పై శాతం అని నిర్ణయించినా అది ఆచరణలో నిరుపయోగమవుతుంది. కౌలుదార్లను, ఆ రీతిగా నమోదుచేసే ప్రభుత్వ రికార్డులు ఏమీలేవు. సొంత సాగుకోసమని ఎప్పుడు పడితే అప్పుడు తొలిగించే హక్కు ఈ కొత్త చట్టంవల్ల వస్తూ ఉంది.

1946-51 మధ్య జరిగిన తెలంగాణ పోరాటం ఫలితంగా ఆనాటి ప్రభుత్వం తెలంగాణలో కౌలుదార్లకు రక్షిత కౌలుదార్లని వారి స్వాధీనంలోనున్న భూములను తక్కువ ధరకు కొనుక్కోడానికి అవకాశమిస్తూ, తక్కువ కౌలు రేట్లు నిర్ణయించి జిరాయితు హక్కు కొంత వరకు ఇచ్చింది. కాని అది కూడ అమలులోకి వచ్చేటప్పటికి సగం మందికి పైగానే భూమినుండి తొలగించబడ్డారు.

నేడు ఆంధ్రప్రదేశ్‌లో కౌలురేటు పండిన పంటలో సగం నుండి మూడు పాళ్ల వరకు ఉంటోంది.

పది పన్నెండు ఎకరాల లోపు సొంతంగా కాయకష్టంచేసి సాగు చేసుకొంటున్న సాగుదార్ల నుండి కౌలు భూములను ఏ పరిస్థితిలోను స్వాధీనం చేసుకోరాదని మనం వెనువెంటనే ఉద్యమాన్ని ప్రారంభించాలి. బేదఖళ్లను వ్యతిరేకిస్తూ పోరాడాలి. కౌలురేటు నాలుగవ వంతుకు మించి ఉండరాదని, భూముల మీద సాగుదార్లకు జిరాయితి హక్కు ఇస్తూ చట్టం తేవాలని ఆందోళన జరపాలి. ఈ లోపల ఉన్న చట్టాన్ని బట్టి కౌలురేట్లను ఇచ్చినా, ఈ కౌలు భూముల మీద పూర్తి హక్కులిచ్చే వరకు మన ఉద్యమం సాగాలి. భూములకు నష్టపరిహారం ఇవ్వరాదని, ఒకవేళ నేటి ప్రభుత్వ చట్టాల ప్రకారం ఇవ్వవలసి వచ్చినా అది నామమాత్రంగానే ఉండాలని, అది వ్యవసాయ కార్మికుల, చిన్న రైతుల నుండి పేద మధ్య తరగతి రైతుల నుండి ఏ మాత్రం వసూలు చేయరాదనీ ప్రభుత్వమే చెల్లించాలని మనం ప్రచారం చేయాలి. పట్టుబట్టి పోరాడి సాధించాలి.

ఈ కౌలు భూములు చిన్న భూకామందులవి అయితే, పది ఎకరాలలోపు వారిది అయితే వారు తిరిగి కాయకష్టం చేసి సొంతసాగు చేసుకోడానికి తిరిగి వస్తే, నేడు కౌలుకు చేస్తున్న సాగుదారుకు, భూ కామందుకు ఇద్దరికి సరిసమానంగా సాగుభూమి ఉండేట్లుగా కౌలుభూమిని స్వాధీనం చేసుకోవచ్చు. ఇలాంటి సందర్భాలలో చిన్న భూకామందు భూమిని కౌలు రైతుకు వదిలి పెట్టిన మేరకు, పూర్తి నష్ట పరిహారాన్ని ప్రభుత్వం ఆ చిన్న భూకామందుకు చెల్లించాలి.

ఈ కౌలు రైతుల భూమిని కాపాడాలంటే, పైన వివరించిన విధంగా హక్కులు సాధించాలంటే, కౌలు రైతుల పోరాటాన్ని వ్యవసాయ కార్మికులు, ఇతర పేద, మధ్యతరగతి రైతులు బలపరిచేటట్లు మనం సమీకరించవలసి ఉంటుంది. కౌలు రైతుల పోరాటం, వ్యవసాయ కార్మికులు పేద రైతులు భూమికోసం భూస్వాములకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ఒక భాగం మాత్రమే. కౌలు రైతులకు భూమి హక్కులతోబాటు, మనం భూస్వాముల వద్దనున్న అదనపు భూము లన్నిటినీ వ్యవసాయ కార్మికులకు, పేద ప్రజలకు ఉచితంగా పంచి పెట్టాలనే ఉద్యమాన్ని కూడా జతచేర్చి ఆందోళన పోరాటానికి పూను కోవాలి. కౌలు రైతు హక్కును సాధించడం మన భూపోరాటంలో విజయానికి ఒక మెట్టుగా మనం వీరిలో చైతన్యం కలిగించాలి.

కౌలురేటు నాలుగవంతుకు తగ్గాలని మనం చేసే ఆందోళన ఆచరణలో అమలులోకి రావాలంటే కౌలు రైతును భూమినుండి తొలగించకుండా గ్యారంటీ ఉండాలనీ, దానికి, ఆ భూమి మీద కౌలు రైతుకు జిరాయితి హక్కు కలిగించాలనీ పోరాడాలి. ఆ తదుపరి పట్టా హక్కు వచ్చినప్పుడే పూర్తిగా భూస్వామ్య దోపిడీ అంతమవుతుందనీ, కౌలు రైతు నిశ్చితంగా కనీస జీవిత భృతిని సాధించుకొని జీవించడానికి సాధ్యమవుతుందనే చైతన్యం కూడ మనం కలిగించాలి. కౌలు రైతు పండించిన పంటలో భాగం భూ యజమాని అనే పేరుతో పరార్జితం అనుభవించడానికి ఎవ్వరికీ హక్కులేదు. 'దున్నేవారిదే భూమి' అనే సత్యాన్ని ప్రజలలో అవగాహనకు తేవాలి.

## వ్యవసాయ కార్మికులను దోచుకొనే పద్ధతులు

వ్యవసాయ కార్మికులకు భూమి ఏమీ లేకపోవడంవల్ల, భూ స్వాముల, ధనిక రైతుల వద్ద రోజు కూలికి గాని, పాలేర్లు (జీతగాండ్ర)గా గాని పనిచేస్తున్నారు. వారి రోజు శ్రమ ఫలితంగా వచ్చే వస్తూత్పత్తిలో చాల కొద్దిభాగం మాత్రం వారికిచ్చి చాల ఎక్కువ భాగాన్ని భూ యజమాని కాజేస్తున్నాడు.

కూలిరేట్లను నిర్ణయించడానికి సరైన పద్ధతి ఈవిధంగా వివరించ బడింది. ఆయా వ్యవసాయ పంటలు పండే ప్రాంతాలలో, ఒక సింగిల్ కుటుంబం (భార్య భర్త, చిన్న బిడ్డలు గల కుటుంబం) ఒక నాగలి, జత ఎడ్లతో ఎన్ని ఎకరాలు సంవత్సరం పొడవూ తమ సొంత కాయకష్టంతోను ఒత్తిడి పని తరుణాలలో రోజు కూలీలను పెట్టుకుని సాగుచేయగలదో, దానిని ఒక యూనిట్‌గా, ఆర్థికంగా గిట్టుబాటయ్యే ఒక వ్యవసాయ క్షేత్రంగా (భూకమతంగా) గమనంలోకి తీసుకోవాలి. ఈ వ్యవసాయ కమతంలో, ఎన్ని రకాల పంటలు సంవత్సరంలో పండించేది, ప్రతి ఒక్క పంటకు, భూమిని దున్ని పైరు వేయడానికి తయారు చేయడం లేదా నాటు వేయడం, కలుపు తీతలు, నీటి పారుదల, కోత, నూర్పిడికి మొత్తం ఎన్ని పని రోజులు పట్టేది లెక్క వేయాలి. (గేదెలు ఆవుల పాలమీద వచ్చే ఆదాయం, కూరగాయాలు, వ్యసాయానికి అనుబంధ వృత్తులలో వచ్చే తదితర ఆదాయాలు కూడా) లెక్కలోకి తీసుకోవాలి.

బండి, నాగలి, తదితర పనిముట్లు ఎద్దులు ఇవి ఎన్ని ఏండ్లు పని చేస్తాయో చూసి ఆ దామాషాను సంవత్సరానికి ఖర్చు (ఆరుగుదల ఖర్చుగా) తీసుకోవాలి. విత్తనాలు, ఎరువులు ఇతర ఖర్చులు మొత్తం ఎంత అయ్యేది లెక్క వేయాలి. కుటుంబం పని రోజులుగాని, పాలేర్లు, రోజు కూలీల పని రోజులుగాని, వారికిచ్చే జీతాలు ఇందులో కలపకూడదు. మొత్తం ఫలసాయం ఖరీదు నుండి ఈ స్థిరఖర్చులు పోను మిగిలన మొత్తం, పనిరోజుల ఫలితంగా తయారయిన నూతన విలువగా మనం పరిగణించాలి. ఒకపని రోజుకు ఎంత నూతనోత్పత్తి విలువను అది సృష్టిస్తుందో, దీనిని బట్టి మనం గుణించవచ్చు. న్యాయంగా భూమి మీద సాగుకు అందరికీ హక్కు ఉంటే ప్రతి ఒక్కరికి తన శ్రమ ఫలితం పూర్తిగా దక్కేది. ఆ రీతిగా వ్యవసాయ కార్మికునికి అతనికి న్యాయంగా రావల్సిన శ్రమ ఫలితాన్ని, కూలి రేటుగా ఇవ్వడంలేదు. అందులో కొద్దిభాగం మాత్రమే భూ యజమాని అతనికి ఇస్తున్నాడు.

మిగిలినది తాను మిగుల్చుకుంటున్నాడు. ఈ వ్యవసాయ కార్మికుని శ్రమ ఫలితం నుండే కూలి జీతం ఇవ్వగా మిగిలిన అదనపు విలువలోనుండే ప్రభుత్వానికి శిస్తు కట్టడం గాని, వ్యవసాయానికని తాను తెచ్చిన పెట్టుబడి అప్పులకు చెల్లించే వడ్డినిగాని కట్టుతున్నాడు. ప్రభుత్వానికి కట్టవలసిన శిస్తు, పెట్టుబడిగా తెచ్చిన మొత్తానికీ కట్టవలసిన వడ్డీని కూడ, మనం వ్యవసాయ ఖర్చుల కింద మినహాయించి రోజు శ్రమఫలితం చూసినా, నేడు ఇస్తున్న రోజుకూలి, పాలేర్ల జీతాలు చాలా తక్కువగా ఉన్నాయని, ఎక్కువభాగం భూయజమాని మిగిలిచ్చుకుంటున్నాడనేది స్పష్టమవుతుంది.

ఉదాహరణకు కృష్ణా జిల్లాలో ఎకరం వరి సాగుకు గట్లు వేయడానికి ఇరువురు, దుక్కికి ఇరువురు, ఎరువు తొలి చల్లడానికి ఇరువురు, నారు పెంచడానికి ముగ్గురు, పారపనికి నలుగురు, నారు పీకి నాటడానికి 12 మంది, కలుపుతీతకు పది మంది, పొలానికి నీరు పెట్టడానికి ఇద్దరు, కోత, కట్టుబడి, నూర్పుడి, గడ్డిమేట వేయడానికి 18 మంది, ఇతర పనులకు ఐదుగురు మొత్తం అరవై మందికి మించరు. ఇక్కడ పది ఎకరాలు ఒక నాగలి, కాడి ఎద్దులతో సాగుచేయడం సాధ్యమవుతుంది. పశువులు మేపడానికి ఒక చిన్న పాలేరును పెట్టుకుంటే మరో 180 పని రోజులు అదనంగా కలపవలసి ఉంటుంది. మొత్తం 780 పని రోజులు. రెండువందల మినుము, పెసరుకు మరో 120 రోజులు. పది ఎకరాలకు ఒక బస్తావడ్లు విత్తనాలు 49 రూపాయలు; ఎరువులు 750 రూపాయలు; బండి ఎద్దులు పనిముట్లు 150 రూపాయలు; మినుములు, పెసర విత్తనాలు 100 రూపాయలు; తెగుళ్ల మందులు 100 రూపాయలు; ప్రభుత్వ శిస్తులు 300 రూపాయలు; ఇతర చిల్లర ఖర్చులు 60 రూపాయలు; రెండు గేదెలు వాటి ఖరీదు, మేత ఖర్చు సంవత్సరంలో 480 రూపాయలు, మొత్తం స్థిరపెట్టుబడి ఖర్చులు 1900 రూపాయలు.

వచ్చే ఫలసాయం ఎకరానికి ఇరవై బస్తాల చొప్పున రెండు వందల బస్తాల వరిధాన్యం.

| | |
|---|---|
| బస్తా రు. 40ల వంతున | రు. 8000 |
| 10 బస్తాల మినుములు, పెసర | రు. 1000 |
| గేదెల పాలు 1000 లీటర్లు | రు. 1000 |
| మొత్తం ఫలసాయం | రు. 10,000 |
| స్థిర పెట్టుబడి ఖర్చులు పోను | రు. 1900 |
| 900 రోజుల పని ఫలితపు విలువ. | రు. 8010 |
| ఒక రోజు పని విలువ | రు. 9 |

పని ఒత్తిడి రోజులలో మూడు లేక నాలుగు రూపాయలిచ్చినా, ఇతర రోజులలో రెండు మానికలకన్నా హెచ్చు ఇవ్వడంలేదు. అందుచే వ్యవసాయ కార్మికుని రోజుకూలీ ఈ ప్రాంతంలో ఎప్పుడూ నాలుగు రూపాయలకు తగ్గకుండా పని ఒత్తిడి రోజులలో ఆరు రూపాయలు మొదలు తొమ్మిది రూపాయల వరకు కూడ మనం అడిగి సాధించు కోడానికి పోరాడడం న్యాయమే అవుతుంది.

కాని ఈ రోజు వ్యవసాయ కార్మికునికి భూమిలేదు, పని చేయడానికి మరో పని ఏమీ దొరకడంలేదు. కాబట్టి భూస్వాములు సాధ్యమైనంత తక్కువ ఇచ్చి పని చేయించుకోడానికి చూస్తున్నారు. వ్యవసాయ కార్మికులలో ఒక గ్రామంలో గాకుండా మొత్తం ఆ ప్రాంతమంతా చైతన్యంతో సంఘం ఏర్పర్చుకొని ఆందోళన పోరాటం సాగిస్తేగాని తమ కూలిరేట్లు పెంచుకొనినా, మా వద్ద పనిలేదని, చాల కొద్ది రోజులకు మాత్రమే పిలవడం జరుగుతుంది. అందుచే కూలీరేట్లు పెంచుకోవడంతోపాటు, సంవత్సరం పొడవూ మూడు వందల రోజులు పని చూపించాలని, పని చూపని రోజుకు గ్రామంలోని భూస్వాములు రోజుకు నిరుద్యోగభృతిగా శేరు బియ్యంగాని, శేరు గట్టి గింజలు గాని ప్రతి వయోజనునికి ఇవ్వాలని ఆందోళన చేయాలి, పోరాడాలి. భూస్వాముల నుండి, వారి దోపిడీ నిల్వల నుండి దీనికి సరిపోను ప్రభుత్వం ధాన్యాన్ని, గట్టిగింజలను ఎకరాల దామాషాన వసూలు చేసి పనిలేనివారికి పనిలేని రోజులలో ఉచితంగా ఇవ్వాలి.

అలా పని చూపించలేకపోతే పని చూపించని రోజులలో నిరుద్యోగ భృతిని ఇవ్వలేకపోతే పనిచేయని భూస్వాముల వద్ద భూములు ఉండ వలసిన అవసరం లేదని, ఆ భూములను భూమిలేని వ్యవసాయ కార్మికులకు, కుటుంబ పోషణకుడా చాలని భూమిగలిగిన పేద రైతులకు ఈ భూములను ఉచితంగా పంచి పెట్టడం ఒక్కటే పరిష్కార మార్గమని ఆందోళన చేయాలి. అందుకు పోరాడాలి.

కూలీ రేటును జీతాలను పెంచుకొనే పోరాటం భూ పంపక పోరాటానికి దారి తీసే ప్రాథమిక పోరాటం మాత్రమే. వ్యవసాయ కార్మికులు ఎప్పుడూ ఇతరుల కింద కూలీ బానిసలుగా ఆధారపడి బతికే స్థితినుండి బయటపడాలి. భూమిని దున్నుకొని ఫలితాన్ని అనుభవించే స్వతంత్ర జీవులుగా బతికే నూతన జనతా ప్రజాస్వామ్యాన్ని, ఆ పిదప సోషలిస్ట్ సమాజాన్ని నిర్మించుకోడానికి పూనుకోవాలి. భూమి కొద్దిమంది వ్యక్తుల చేతుల ప్రయివేట్ ఆస్తి గాకుండా. 'దున్నేకునే వారికే భూమి'గా ఆ సమాజంలో ఉంటుంది.

## నేటికీ సాగుతున్న జమీందారీ యుగం నాటి దోపిడీ

యూరపు ఖండంలో జమీందారీ యుగంలో (ఫ్యూడల్ సమాజ కాలంలో) రైతులకు జమీందారులు కొంత భూమిని వారి పోషణకు సాగు చేసుకోడానికి ఇచ్చేవారు. దానికి ప్రతిఫలంగా ఆ రైతులు జమీందారుల భూములనన్నిటిని ముందుగా సాగుచేసిపెట్టి ఆ తర్వాత తమ కిచ్చిన భూములను సాగుచేసుకోవాలి. ఆ భూములను వదలిపెట్టి పోకూడదు. అలా వదిలి పెట్టి పారిపోయిన వారిని ఎక్కడున్నా తిరిగి బలవంతంగా పట్టుకువచ్చి తమ భూముల మీద పని చేయించుకునే హక్కు సాంప్రదాయం ఆ జామీందారులకు ఉండేది. దేశ ప్రభుత్వ యంత్రాంగం దీనిని పూర్తిగా అమలు జరిపేది. ఆ జమీందారుని ఇంటిలో అనేక రకాల వెట్టిచాకిరి అనేక రకాల కట్నాలు, కానుకలు ఉచితంగా నిర్బంధంగా రైతులు చెల్లించుకోవలసి ఉంది.

ఆంధ్రదేశంలో కూడ అనేక జిల్లాలలో 20-30 ఏళ్ల క్రితం వరకు తెలంగాణలో 1945-51 సాయుధ పోరాటం సాగేవరకు, ఈ జమీందారీ దోపిడీ వెట్టిచాకిరి కొద్దిమంది పెద్ద భూస్వాములకు, దేశముఖులకు, వ్యవసాయ కార్మికులు, రైతులు చేస్తూనే వచ్చారు. వర్షాలు పడి భూమి దుక్కికి పదును కాగానే ఇంటింటికి ఒక నాగలి చొప్పున వెళ్లి భూస్వామి భూమిని ముందు దున్ని రావలిసి ఉండేది. నాటు వేతలలో కోతలలో

కూడ ఒకరోజు వెళ్లి వెట్టి చాకిరీ చేసి రావాల్సి ఉండేది. తెలంగాణలో నిన్న మొన్నటి దాక చాల చోట్ల నాటువేతకు కోతల సమయాలలో గ్రామంలో పేదలంతా వెళ్లి భూస్వాముల భూములలో పనిచేసి భూస్వామి పెట్టే దోసెడు 'భిక్షం' తో తిరిగి వచ్చేవారు.

నేటికీ గ్రామాలలో చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి, మాదిగ ఇలాంటి వృత్తులవారు గ్రామంలోని ప్రతి ఇంటా 'మేరలని' పరిమిత ధాన్యాన్ని, అన్నాన్ని (కబళాన్ని) తీసుకొని ఆ ఇండ్లలోని గుడ్డలన్నీ ఉతికి పెట్టడం, పిలిచినప్పుడు వెళ్లి క్షౌర కార్యక్రమములు సాగించడం, కావల్సిన కుండలు, చెప్పులు, బొక్కెనలు వగైరా సరఫరా చేయడం జరుగుతూ ఉంది. వడ్రంగి కమ్మరులు వ్యవసాయానికి కావల్సిన పనిముట్లు కొయ్యతో, ఇనుముతో చేసిపెట్టడం, నాగళ్ళు, బండ్లు, కర్రలు, కొడవళ్లు పని ముట్లులకు మరమ్మతులు చేసి పెట్టడం జరుగుతూ ఉంది. గ్రామ నౌకర్లు చాకిరి ఇనాములు తీసుకొని గ్రామ ఉద్యోగస్తులకు ప్రభుత్వ ఉద్యోగస్తులకు అనేకరకాలైన వెట్టి చేయవలసి ఉండేది.

ఈ ఫ్యూడల్ విధానమే కూలీరేట్లను నిర్ణయించడంలో కూడా మనకు కనపడుతూ ఉంది. తెలంగాణలో ఒక బస్తా విత్తనాలు చల్లే భూమిలో నాటువేతకు, కోతకు ఇన్ని బస్తాల ధాన్యమని నిర్ణయిస్తూ వచ్చారు. జొన్నకోతకు నాలుగు కట్టలు లేదా ఐదు కట్టలని, వరికోతలలో కోతకూలి తక్కువగా ఇచ్చి పనిచేసే పాలేర్లకు సంతృప్తిపరచడానికి పని అని, వరిమోపు అని అదే విధంగా కుప్పనూర్పిళ్లలో కళ్లాలలో గింజలు వదలడం, వేరుశనగ పీకుడు మిరపకాయ కోతకు ఇన్ని బుట్టల కాయలకు ఒక బుట్టెడు వేరుశనగ, మిరపకాయలని, ఈ రీతిగా అనేక పద్ధతులు చెలామణిలో ఉన్నాయి.

ఈ పద్ధతులన్నిటిలోను వ్యవసాయ కార్మికుడు, తన రోజు పనికి పని విలువను బట్టి, ప్రతిఫలం కచ్చితంగా అడిగే హక్కును వదిలివేసి భూస్వామి దయాదాక్షిణ్యానికో లేదా బాగా పంటలు పండినప్పుడు లేక బక్కగా పంటలు పండినప్పుడు కట్టల పేరుతో, బుట్టల పేరుతో యాదృచ్ఛికానికి వదిలివేయడమో జరుగుతూ ఉంది. ఫ్యూడల్ కాలంలో భూమిని భూస్వామిని అంటిపెట్టుకొని బతికే స్థితిలో వచ్చినవి ఈ ఏర్పాట్లు. అతడు స్వేచ్ఛగా ఎక్కువ జీతాలు వచ్చే పనికి అవసరమైన చోటుకు వెళ్లి పని చేసుకునే హక్కు లేకుండా పోయింది. ఆర్థిక విధానం, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయ్యేకొద్ది ఈ పద్ధతులు ఆర్థికాభివృద్ధికి, ఉత్పత్తికి కూడా ఆటంకాలుగా పరిణమిస్తూ ఉన్నాయి. భూస్వామి పెట్టుబడిదారీ వ్యవసాయాన్ని అవలంబిస్తూ, పనిజేసే వారికి ఫ్యూడల్ పద్ధతులతో తక్కువ జీతాలిచ్చి దోచుకోవడానికి పూనుకుంటున్నాడు.

అదే విధంగా పాలేర్లకు (జీతగాళ్లకు) ధాన్య రూపంలోను, నగదు రూపంలోను ఏర్పరచుకున్న నెలజీతాలతోపాటు, ఒక్కపూట లేదా రెండు పూటలు భోజనం పెట్టడం, గొంగళి, ధోవతులు, చెప్పుల జతలు, పొగాకు వగైరా ఇవ్వడం అనే సాంప్రదాయాన్ని కూడ కొనసాగిస్తున్నారు. దీనివలన పాలేరు తనకు రావల్సిన మొత్తం జీతాన్ని పూర్తిగా తీసుకొని తన భార్యా బిడ్డలతో పూర్తిగా అనుభవించడానికి సాధ్యపడటం లేదు. భార్యా బిడ్డలకు తాను తీసుకుపోగలిగిన జీతంతో పస్తులు చాలా ఉండవలసి వచ్చినా, అర్థాకలితో ఉండవలసి వచ్చినా, తనకు రెండు పూటలు తిండిపెట్టి ఎక్కువ పని చేయించుకోడానికి భూస్వామికి ఈ పద్ధతి ఉపయోగపడుతూ ఉంది. నాటు వేతలలో, కోతలలో ఒక పూట అన్నంపెట్టి ఎక్కువ గంటలు పని చేయించుకోవడం కూడా మనం చూస్తూనే ఉన్నాం.

ఇలాంటి పద్ధతుల వలన తమకు రావల్సిన న్యాయమైన కచ్చితమైన కూలీ జీతాలివ్వకుండా, తమ్ము మోసగించడానికి, తక్కువ ఇచ్చి ఎక్కువ పని చేయించుకునే పద్ధతులని వ్యవసాయ కార్మికులకు నచ్చచెప్పి వారి చైతన్యం పెరిగే కొద్దీ కచ్చితంగా హెచ్చుకూలీ రేట్లకోసం పోరాడేటట్లు మనం కృషి చేయవలసి ఉంటుంది. దీనికి ఒక పెద్ద ఆటంకం, పనిలేని రోజులు చాల అధికంగా ఉండటంతో పాత పద్ధతులలో, భూస్వాముల వద్ద పనిచేస్తే నికృష్ట జీవితానికయినా, అప్పుసప్పులతోనైనా బతకడానికి వీలుంటుందని ఈ పద్ధతులనే అంటిపెట్టుకోవడం జరుగుతూ ఉంది.

అందుచేత పండించే పంట ఫలితాన్ని బట్టి న్యాయమైన కూలీరేట్లు గాక ఫ్యూడల్ దోపిడీ ఒత్తిడి ఫలితంగా జీవితానికి కుటుంబ పోషణకు చాలని, పస్తులతో కృశించిపోయే వేతనాలివ్వడం జరుగుతూఉంది. ఫ్యూడల్ దోపిడీకి ఇదొక ప్రత్యక్ష నిదర్శనం. ఈ దోపిడీని కూడ భూపంపకం సాగించి 'దున్నేవారికే భూమి' హక్కును కల్పించినప్పుడు పూర్తిగా రద్దు చేయగలం. ◆

*ప్రభుత్వం చేయబోయే సంస్కరణలు వ్యవసాయ కార్మికులకీ, పేదరైతులకీ భూమిని పంచి, వ్యవసాయోత్పత్తిలో తగిన భాగం వారికి అందేటట్లు చేసి, వారి కొనుగోలు శక్తిని పెంచడానికి ఉద్దేశించినవి కావని అన్నారు* **కొండపల్లి సీతారామయ్య**

(కొండపల్లి సీతారామయ్య మెమోరియల్ కమిటీ ప్రచురణగా వెలువడిన 'వ్యవసాయ విప్లవం' కొండపల్లి సీతారామయ్య గారి ఏరిన రచనలు (రెండవ సంపుటి) నుంచి 'భూసంస్కరణల సమస్య' అనే భాగాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాం. -సం.)

# భూ సంస్కరణల సమస్య

ఈ భూసంస్కరణల కబుర్లు ఇందిరమ్మ ప్రభుత్వ హయాంలో వినీ వినీ విసుగెత్తింది. పి.వి. నరసింహారావును ముఖ్యమంత్రిని చేసింది కేవలం భూముల పంపకాన్ని త్వరితం చేయడానికేనని అప్పట్లో కాంగ్రెస్ నాయకులు ఊదరగొట్టారు. ఆ మంత్రివర్గానికి వెనకబడినవర్గాల ప్రభుత్వమని కూడ పేరు తగిలించారు. ఆ తర్వాత సంవత్సరాలకు సంవత్సరాలే గడిచాయి కాని వేసిన గొంగళి వేసిన చోటనే ఉంది.

ఆ తర్వాత వెంగళరావు ప్రభుత్వాన్ని కూడ అసలయిన వెనకబడ్డ వర్గాల ప్రభుత్వమన్నారు. రేపో మాపో భూములు పంచబోతున్నట్టే నటించారు. ఇప్పుడు చెన్నారెడ్డిగారి ప్రభుత్వం వచ్చింది. ఆయనే ఒక పెద్ద భూస్వామి. అయినా ఈ ప్రభుత్వానికి కూడా వెనకబడ్డ ప్రభుత్వ మనేదే పేరు. ఈ ప్రభుత్వం కూడ ఒకటి రెండు నెలలో భూములు పంచబోతున్నట్టే నోరు వూరిస్తోంది.

అయితే ఈ జాగు అంతా భూస్వాములు తమ భూముల్ని వారిపేరా వీరి పేరా బినామీ పట్టాలు సృష్టించుకోడానికి చక్కగా పనికి వచ్చింది. అదంతా భూస్వాములకూ ప్రభుత్వానికీ మధ్య ప్లాన్ ప్రకారం జరిగిన లాలూచీయే. ఆ లాలూచీ ప్రకారం కూడ భూముల పంపకం ఇప్పటికీ ఆచరణలోకి రాలేదు. ఒకవేళ వచ్చినా అదంతా హుళక్కిగా జరుగుతుం దంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. గాలికిపోయే పేలపిండి కృష్ణార్పణ మన్నట్టు ఎందుకూ పనికిరాని ఊసరక్షేత్రాలు కొందరికి పంచి ఆ భూస్వాములకు వాటి విలువకు ధనాన్ని నష్టపరిహారం పేరుతో ధారాదత్తం చేయనూవచ్చు. దొంగలు దొంగలు కలిసి ఊర్లు పంచుకున్నట్టు భూపంపకం, నష్టపరిహారాల పేరుతో ప్రజల సొమ్మును తలాకాస్త స్వాహా చేయనూవచ్చు. దేశంలో నానాటికీ తీవ్రమవుతున్న వ్యవసాయ సంక్షోభం బారి నుండి రైతాంగాన్ని కాపాడటానికి భూ సంస్కరణలు అవసరమనే వాతావరణం ఎలాగూ పెద్ద ఎత్తున మనదేశంలో వ్యాపించే ఉంది. కాబట్టి మొక్కుబడి చెల్లించినట్టుగా భూసంస్కరణల తతంగం జరిపినట్టూ ఉండాలి. భూస్వాములకు నష్టం జరగకుండా ఉండడమే గాక లాభం కూడా జరగాలి. ఎందుకూ పనికిరాకుండా ఊసరక్షేత్రాలుగా పడి ఉన్న పర్ర భూములకు నష్టపరిహారం పేరుతో మార్కెట్‌లో లేని ధరను భూస్వాములకు ఇప్పించడం కంటే ఇంకా ఏమి లాభం కావాలి? అలా చేయడం ద్వారా భూస్వాములకు లాభమూ కలుగుతుంది, మంత్రులూ, పెద్ద పెద్ద ఉద్యోగులూ అందులో కొంత ఎంగిలిపడటానికి అవకాశమూ ఉంటుంది. బడాబూర్జువా, భూస్వామ్య వర్గాలు అధికారంలో ఉన్నంత వరకు, ఆ ప్రభుత్వం కాంగ్రెస్ పేరుతో ఉండనీయండి, జనతాపార్టీ పేరుతో ఉండనీయండి, అంతకుమించి మరొక విధంగా అమలు జరగడం అసంభవం. భూసంస్కరణలు తప్పక జరుగుతాయని ఆశలు పెట్టుకున్న వారందరూ ఇప్పటికే హతాశులైనారు. ఇకముందు వారు మరింత నిస్పృహ చెందకతప్పదు.

సంక్షోభం తీవ్రతరమైనప్పుడూ, ప్రజలు తెగించి పోరాడే స్థితి ఏర్పడినప్పుడూ ఇలాంటి సంస్కరణ తతంగం బయలుదేరడం దోపిడీ వర్గాల ప్రభుత్వాల చరిత్రలో కొత్త విషయమేమీ కాదు. అయితే లెనిన్ మహనీయుడు చెప్పినట్టు ఈ సంస్కరణల తతంగమంతా పాలకవర్గాల బలహీనతను, విప్లవ పురోగమనానికి గల గ్యారంటీని తెలియపరుస్తుంది. లెనిన్ ఇలా అన్నారు – 'పరిస్థితులు విషమించినప్పుడు, ప్రజలు పోరాటానికి పెద్ద ఎత్తున పూనుకున్నప్పుడు, సంక్షోభం ఆనాటి కానాడు తీవ్రతరమవుతున్నప్పుడు, పోరాటంలో గాయాలు తిని వందల సంఖ్యలో ప్రజలు రంగం మీద కూలిపోతున్న ప్రతి పోరాటం నుండీ, మరింత క్రోధావేశంతోనూ, సాహసోపేతంగానూ, ఉన్నతమయిన శిక్షణతోనూ వేలాది విప్లవయోధులు ఉద్భవిస్తున్నప్పుడు, తప్పనిసరియై వచ్చే సంస్కరణలే ఇవి'... 'అలాంటి సంస్కరణలెప్పుడూ రానున్న మహోద్భృత విప్లవానికి సంకేతాలు గానూ, ముందు ద్యోతకమయ్యే సూచనలుగానూ ఉంటాయి'.

వాస్తవంగా అదే పరిస్థితి మనదేశంలో ఇప్పుడు కొనసాగుతోంది. ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యవాదం దెబ్బపై దెబ్బ తినిపోతున్న ఈనాడు వీరోచితమయిన నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవ పోరాటాల ప్రభావంతో తన పునాదే కదిలిపోతున్నట్టు గమనించిన ప్రభుత్వం విప్లవ శక్తులపై ద్విముఖ దాడికి తలపడింది. ఒకటి సంస్కరణల తతంగంతో ప్రజలను జోకొట్టి విప్లవ శక్తులనుండి వేరు చేయడం, రెండు తీవ్ర నిర్బంధం ద్వారా విప్లవ శక్తులను నిర్మూలించడం. చరిత్రలో అభివృద్ధి నిరోధకులందరి ప్రభుత్వాలూ విఫలమయినట్టే మనదేశంలోని బడా బూర్జువా భూస్వామ్య వర్గాల ప్రభుత్వాలు విఫలం చెందడమూ, సమాజం ప్రగతిపథంలో పురోగమించడమూ అనివార్యం. లెనిన్ అన్నట్లు రానున్న విప్లవోద్భృతికి ఇదంతా సంకేతం మాత్రమే.

ప్రజలను మోసగించే ప్రయత్నాలలో ప్రధాన భాగమయిన భూ సంస్కరణల నాటకం కేవలం బూటకపు తతంగంగా అంతం కాకతప్పదు. వ్యవసాయ విప్లవాన్ని విజయవంతం చేయడానికి ప్రజలు సన్నద్ధం కాక తప్పదు. భూసంస్కరణల గూర్చి మరింత లోతుకుపోయి పరిశీలించు కుందాం.

ఏ పనైనా, తలపెట్టే ముందు అసలు అది ఎందుకు అవసరమయింది? ఏమి చేస్తే ఆ అవసరం సంతృప్తికరంగా నెరవేరుతుంది? అనే విషయాలు ఆ పనిచేసే వారికి, దానివల్ల సహాయం పొందేవారికీ కూడా క్షుణ్ణంగా తెలియాలి. లేకుంటే ఏ పనైనా లక్ష్యశుద్ధి లేకుండాపోయి, కేవలం ఊసుపోక చేసే పనిగానో, లేక ఏదో ఒకటి చేస్తున్నట్లు మోసిగించే తతంగంగానో మారక తప్పదు.

కాబట్టి భూసంస్కరణలను గూర్చి ఆలోచించేముందు అసలు భూ సంస్కరణల అవసరం ఎందుకు వచ్చింది? ఎవరి నుండి భూమి తీసుకొని ఎవరికి పంచాలి? మొదలైన విషయాలపై స్పష్టమైన అవగాహన ఉండాలి.

మనదేశం బ్రిటిష్ వలసగా తయారైన తర్వాత ఫ్యూడల్ దోపిడీకి తోడు సామ్రాజ్యవాద దోపిడీ కూడా చేరి దారుణంగా తయారై వ్యవసాయ సంక్షోభం ఆరంభమైంది. అప్పటినుండి ఇప్పటి వరకు నానాటికి తీవ్రతరమవుతున్న వ్యవసాయ సంక్షోభం పర్యవసానంగా మనదేశంలో వ్యవసాయంపై ఆధారపడినవాళ్లలో నూటికి ఇరవై ఐదు నుండి యాభై వరకు (కొన్ని ప్రాంతాలలో యాభైకి మించికూడా) భూమిని కోల్పోయి కేవలం రెక్కలు తప్ప మరో ఆస్తిలేని వ్యవసాయ కూలీలుగా తయారైనారు. వీరినే మనం అర్థశ్రామికులని (సెమీ ప్రొలిటేరియట్) అంటాం. వీరి భూములన్నీ క్రమక్రమంగా గ్రామీణ జనాభాలో అయిదారు శాతానికి మించని భూస్వాములు దోచుకున్నారు. భూమిలేని వ్యవసాయ కూలీలకు తోడుగా బహుకొద్ది భూమి మాత్రమే కలిగి దానిపై వచ్చే ఆదాయం ఎటూచాలని పేదరైతు కుటుంబాలు నూటికి ఇరవై ఐదు నుండి నలభై ఐదు వరకు ఉన్నాయి. (కొన్ని ప్రాంతాలలో ఇరవై శాతం, మరి కొన్ని ప్రాంతాలలో నలభై ఐదు శాతం). మొత్తం మీద అసలే భూమిలేని, లేదా కాస్తోకూస్తో ఉన్నా అందులో వచ్చే ఆదాయం ఎటూచాలని కుటుంబాలు మొత్తం వ్యవసాయంపై ఆధారపడి ఉన్న కుటుంబాలలో నూటికి డెబ్బైకి పైగా ఉన్నాయి. వీరిలో సగానికి పైగా ఉన్న వ్యవసాయ కూలీలకు మాగాణి ప్రాంతాలలో సంవత్సరానికి ఆరు నెలలు పని ఉండదు. మెట్ట ప్రాంతాలలో అతివృష్టి, అనావృష్టి మూలంగా రెండు మూడు సంవత్సరాలు వరుసగా పనులు దొరకని సందర్భాలు లేకపోలేదు. ఉన్నప్పుడయినా వ్యవసాయం కేవలం వర్షాధారమై ఉన్నందువల్ల రైతుల ఆదాయమే తక్కువ కాగా అక్కడి వ్యవసాయ కూలీల స్థితి ఇక చెప్పాల్సిన పనేలేదు. వ్యవసాయ అవసరాలకు మించిన సంఖ్యలో ఉన్నందువల్ల వారికి లభించే కూలిరేటు చాల తక్కువ. ఈ ప్రాంతాల నుండి కూలి కోసం ప్రతి ఏడూ కొన్ని వందల మైళ్ల దూరం వలసపోయే కూలీలు వేల సంఖ్యలో ఉన్నారంటే ఆశ్చర్యం లేదు.

వ్యవసాయంలో రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాలు ఉపయోగించడం ద్వారా పంటలు ఎంతో కొంత పెరిగినా గ్రామీణ జనాభాలో నూటికి డెబ్బై మందిగా ఉన్న వ్యవసాయ కూలీల, పేద రైతుల స్థితి ఆనాటికానాటికి దుర్భరంగా తయారవడం, పేద రైతుల వద్ద మిగిలి ఉన్న కొద్దిపాటి భూమి నుండి యేటా కొంత భూస్వాములు పరం కావడం ఎడతెరిపిలేకుండా జరుగుతూనే ఉంది. నూటికి డెబ్బై మంది తిండికి చాలక కరువుపాలై బాధపడుతున్న ఏ సమాజమయినా అభివృద్ధి చెందటం అసంభవం.

అలా గ్రామీణ జనాభాలో నూటికి డెబ్బై మందిలో దినదినం పెరుగుతున్న దారిద్ర్యం మొత్తం సమాజాభివృద్ధికే ఈనాడు పెద్ద ప్రతిబంధకం. వారి ఆదాయాన్ని పెంచడం ఎలా అనేది ప్రధాన సమస్య. ఆ సమస్యను పరిష్కరించకుండా సమాజం సోషలిజం సంగతి అటుంచి ప్రజాస్వామ్యం వైపు కూడా ఒక అడుగు సైతం ముందుకు వేయలేదు. అందుకు భూ సంబంధాలలో మార్పు తీసుకొని రావడం తప్ప మరో మార్గం లేదు. అదే వ్యవసాయ విప్లవం లక్ష్యం. అందుకే ప్రజాస్వామిక విప్లవానికి వ్యవసాయ విప్లవం బండికి ఇరుసులాంటిది. వ్యవసాయ విప్లవంలో ఫ్యూడల్ భూస్వామ్యాన్నీ, ఫ్యూడల్ దోపిడీని సమూలంగా నిర్మూలించడం ప్రధాన కర్తవ్యం. ఫ్యూడల్ భూస్వామ్యాన్ని నిర్మూలించడానికి మరో పేరే 'దున్నేవారికే భూమి' నినాదం ఆధారంగా భూమిని తిరిగి పంచడం. వ్యవసాయం నుండి వచ్చే ఆదాయంతో ఇతరుల శ్రమశక్తిని నుండి కాజేసే అదనపు విలువ మొత్తం, తన కుటుంబ శ్రమతో పోల్చి చూస్తే హెచ్చుగా ఉన్నప్పటికీ తను, తన కుటుంబమూ కలిసి భూమిపై కష్టించి పనిచేసేవాడే మార్క్సిస్ట్ పరిభాషలో ధనికరైతు. కాబట్టి 'దున్నేవారికే భూమి' సూత్రప్రకారం అలా కష్టించి పనిచేసే ధనిక రైతులను మినహాయించి, అంతకు పైన ఉన్న ఫ్యూడల్ కాపిటలిస్ట్ భూస్వాముల భూమి స్వాధీనం చేసుకుని దాన్ని భూమిలేని కూలీలకు, దాన్ని బట్టి పేదరైతులకు పంచాలి. అప్పుడే నూటికి డెబ్బై మందిగా ఉన్న వ్యవసాయ కార్మికుల, పేదరైతుల కొనుగోలు శక్తి పెరుగుతుంది. అంటే వారి ఆదాయం పెరుగుతుంది. అప్పుడు వ్యవసాయంలో యంత్రాలు ప్రవేశపెట్టడం ద్వారా గానీ, శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయాన్ని పెంపొందింప జేయడం ద్వారాగాని, ఉత్పత్తిని పెంచగా అలా పెరిగిన ఉత్పత్తిలో తగు శాతం వ్యవసాయ కూలీలకు (వారికి కూడ భూమి లభిస్తుంది కనుక), పేద రైతులకీ లభించగలదు. ఆ విధంగా వ్యవసాయంలో విప్లవం జరగకుండా ఉత్పత్తి ఎంత పెరిగినా, ఆ ఫలితమంతా లేక అందులో ప్రధాన భాగమంతా భూస్వాముల పాలుకాగా దరిద్రులు దరిద్రులుగాను, ధనికులు మరింత మేటలు వేసిన ధనికులుగానూ మారక తప్పదు. ఇప్పుడు జరుగుతున్నదీ అదే.

అందువల్లనే ఆధునిక పద్ధతుల ద్వారా ఉత్పత్తిని పెంచడం, ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టడం, ఫ్యూడల్ దోపిడీ విధానాలను నిర్మూలించడం వగైరా విషయాలన్నీ వ్యవసాయ విప్లవంలో భాగాలే అయినా, 'దున్నేవారికే భూమి' సూత్రం ఆధారంగా భూస్వాముల నుండి స్వాధీనపర్చుకున్న భూమిని వ్యవసాయ కార్మికులకీ పేద రైతాంగానికీ పంచడం ఆ విప్లవం మొత్తంలో కీలకమయిన అంశం. ఈ అంశాన్ని కార్మికవర్గ నాయకత్వం కింద ఏర్పడే ప్రభుత్వమే సక్రమంగా పరిష్కరిస్తుంది. అలా పరిష్కరించబడినప్పుడే ఆ సమాజం సోషలిజం వైపు పరివర్తన చెందడానికి పరిస్థితులు పరిపక్వం అవుతాయి. బూర్జువా నాయకత్వం కింద అది జయప్రదంగా అమలు జరగదు. పారిస్ కమ్యూన్ అనుభవం చూసిన తర్వాత క్రమంగా అన్ని దేశాలలోనూ బూర్జువావర్గం కమ్యూనిజానికి వ్యతిరేకంగా భూస్వాములతో రాజీపడిపోవడం జరిగింది. అందువల్ల ప్రస్తుతం ఏ దేశంలోనూ బూర్జువా నాయకత్వం కింద జయప్రదంగా ఫ్యూడల్ భూస్వామ్య విధానం రద్దు చేయబడుతుందని ఆశించడం ఇసుక నుండి నూనె తీయవచ్చునని ఆశించడం లాంటిదే.

అయితే బడాబూర్జువా భూస్వామ్య వర్గాల ప్రభుత్వం ఇందుకు

సంబంధించి యేదో చేయబోతుందనే నమ్మకం కొంతమందికి లేక పోలేదు. ఒక్క ఇండియాలోనే కాదు, ప్రపంచంలో అనేక దేశాలలో ఇంతకు ముందు కుహనా వ్యవసాయ సంస్కరణలు జరిగాయి. అవన్నీ ఆయా సమయాల్లో రైతాంగంలో పెల్లుబికిన విప్లవ చైతన్యాన్నీ, చర్యల్ని భ్రమకల్పించి పక్కదారి పట్టించడానికే జరిగాయిగాని వ్యవసాయ కార్మికుల, పేదరైతుల ఆదాయాన్ని పెంచాలన్న లక్ష్యంతో కాదు. ఇప్పుడు మన ప్రభుత్వం ఆడే నాటకం కూడ అదే. వాస్తవానికి చాలా రాష్ట్రాలలో సీలింగ్ లెక్కలపని ఎప్పుడో పూర్తయింది. కాని పంపకానికి తేలిన మిగులు భూమి అతి స్వల్పం. మన రాష్ట్రంలో ప్రభుత్వ ప్రకటనలననుసరించి పదకొండు వేల ఎకరాల మాగాణి, రెండు లక్షల ఇరవై ఏడు వేల ఎకరాల మెట్ట మాత్రం మిగులుభూమి ఉన్నట్టు తేలింది. అంటే దాన్నే పంచుతారన్న మాట. పది లక్షల కుటుంబాలకు మించి ఉన్న వ్యవసాయ కూలీ, పేదరైతుల ఆర్థిక స్థితిని మెరుగుపరచడానికి ఇది స్వల్పంలో ఎంత స్వల్పమో చెప్పనవసరం లేదు. ఇందులో పనికి వచ్చేదెంతో చెప్పడం కూడ కష్టం. మరి అలాంటి పనికిరాని పత్రలకు నష్టపరిహారం పేరుతో ప్రజల ధనం ఎంత దుబారా చేయబడుతుందో, ఆ సందర్భంగా ఎందరు మంత్రులు, పెద్ద పెద్ద ఆఫీసర్లు మేటలువేసి పోతారో వేచి చూడాలి. అయితే ఒకటి మాత్రం చెప్పవచ్చు. ప్రభుత్వం చేసే సంస్కరణల మూలంగా మహా జరిగితే కొద్దిమంది భూస్వాములకు నష్టపరిహారం పేరుతో గరిష్ట ధర లభించి వారు పెట్టుబడిదారులుగానో బ్యాంకర్లుగానో మారి నూతన తరహా దోపిడీకి ఉపక్రమిస్తారు. కాని వ్యవసాయ కూలీలకు, రైతులకు జరిగేది హుళ్లక్కి మాత్రమేనని కచ్చితంగా చెప్పవచ్చు.

'దున్నేవారికే భూమి' సూత్రం ఆధారంగా వ్యవసాయ విప్లవం జరిగితే భూస్వాముల నుండి స్వాధీనపర్చుకున్న భూమికి నష్టపరిహారం ఇచ్చే ప్రశ్నే లేదు. ఆ భూమిపై గుత్తాధిపత్యం వహించి సంవత్సరాల తరబడి రైతాంగాన్ని దోచుకున్నది చాలక, ఇప్పుడు నష్టపరిహారం కూడా పొందదమంటే అంతకంటే దారుణం మరొకటి లేదు. అలా చెల్లించడ మంటే భూస్వాముల దగ్గర్నుండి కొనుక్కున్నట్టే కదా? దానికి విప్లవమనో, సంస్కరణలనో పేరెందుకు? అదటుంచి, అలా రొక్కం చెల్లించి భూమి తీసుకున్న రైతు తిరిగి అప్పులపాలై సతమతం కావాలసిందే కదా. అది ప్రభుత్వమే చెల్లించినా, పరోక్షంగా రకరకాల పన్నుల రూపంలో ఆ బరువు తిరిగి ప్రజల నెత్తిన పడేదే. హైదరాబాద్‌లో ఉచితంగా ఇళ్లస్థలాలు ఇచ్చామని చెప్పే ఏ పేటకు వెళ్లి అక్కడ గుడిసెల వారినడిగినా 'ఉచితంగా ఇచ్చారని పేరేగాని, ఇచ్చుకున్న లంచాలన్నీ కలుపుకుంటే కొనుక్కున్న దాని కంటే మించిపోయిందని' వాపోతారు. ఉచితంగా ఇవ్వబడ్డ సందర్భంలోనే ఈ ప్రభుత్వ హయాంలో పరిస్థితి అలా ఉంటే నష్టపరిహాం చెల్లించి తీసుకున్న భూమి పేద రైతుకో, వ్యవసాయ కూలీకో చేరేసరికి పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించడం కష్టం కాదు. వాస్తవానికి ప్రభుత్వం చేయబోయే సంస్కరణలు, ఆచరణలో పనికిరాని భూములకు నష్టపరిహారం పేరుతో ప్రజాధనం చెల్లించి భూస్వాముల్ని పెట్టుబడిదారు లుగా మార్చడానికి జరిగేవే తప్ప, వ్యవసాయ కార్మికులకి, పేద రైతులకి భూమిని పంచి వ్యవసాయోత్పత్తిలో తగిన భాగం వారికి లభింపజేయడం ద్వారా వారి కొనుగోలు శక్తిని పెంచడానికి ఉద్దేశించిన సంస్కరణలు కావు. అటు రష్యా సామ్రాజ్యవాదులతోనూ, దేశంలోని బడా భూస్వాముల తోనూ పొత్తు కలిసిన బడా బూర్జువా భూస్వామ్యవర్గాల ప్రభుత్వం నుండి అంతకుమించి ఆశించడం అత్యాశే.

అశేష రైతాంగాన్ని ఆవహించిన దరిద్రానికి కారణం కొద్దిమంది భూస్వాముల చేతుల్లో అత్యధిక భాగం భూమి కేంద్రీకరించబడి ఉండటమే నని, ఆ కేంద్రీకరణను రద్దు చేయడమే భూ సంస్కరణల లక్ష్యమనీ ఒకవైపు దొంగ కబుర్లు చెబుతూనే మరోవైపు పరిశ్రమల కింద, పెద్ద పెద్ద పండ్ల తోటల కింద, కాఫీ, టీ, రబ్బరు ప్లాంటేషన్స్ పేరు కింద గల భూములకూ, దేవాలయాల కిందగల వేలాది ఎకరాలకూ మినహాయింపులు ప్రకటించడం అందరికీ తెలిసిన సత్యమే. ఆ విధంగా 'సంస్కరణల' కిందికి రాని అంశాలెన్నో ఉన్నాయి.

పెద్ద పెద్ద భూస్వాములంతా తిమ్మిని బొమ్మి చేసి పై మినహా యింపుల ఆసరాతోనే తమ స్వాధీనంలో ఉన్న భూములను పోకుండా కాపాడుకోగలుగుతున్నారు. సాగి సూర్యనారాయణరాజు సోదరులు (ఒకరు ఇందిరమ్మ హయాంలో ఆంధ్ర ప్రభుత్వంలో మంత్రి, మరొకరు అప్పట్లో విశాఖ జిల్లా పరిషత్తు ఛైర్మెన్) కేవలం 110 ఎకరాలు మాత్రమే లెక్క తేల్చి, 1800 ఎకరాల భూమిని చట్టరీత్యానే దక్కించుకోగలిగారని బ్లిట్జ్ పత్రిక రాసింది. అలాంటి ఉదాహరణలెన్నో పత్రికలలో వచ్చాయి. అదంతా ప్రభుత్వానికీ, భూస్వాములకూ మధ్య లాలూచీ ప్రకారమే జరుగుతున్న తతంగమేనని అందరికీ తెలుసు.

అందువల్లనే ప్రభుత్వ లెక్కల ప్రకారం దేశంలో సాగుకు తయారైన భూమి నలభై కోట్ల ఎకరాలుండగా, పంపకానికి తేలిన మిగులు భూమి కేవలం నలభై లక్షల ఎకరాలు మాత్రమే. అంటే సాగుకు తయారైన భూమిలో దేశం మొత్తం మీద నూటికి ఒక్క ఎకరం మాత్రమే పంపకానికి మిగులుతుందని కాంగ్రెస్ ప్రభుత్వం తేల్చివేసింది. జనతా ప్రభుత్వం వారు భూస్వాముల అప్పీళ్లను మన్నించి, తీరా పంపకం సమస్య ఆచరణ లోకి వచ్చేసరికి ఆ ఒక్క ఎకరం అర ఎకరమవుతుందో, పావు ఎకరమవు తుందో వేచిచూడాలి.

ఇదీ భూ సంస్కరణల పేరుతో జరుగుతున్న తతంగం. ఇది కేవలం బూటకమన్న సంగతి ఇప్పటికే ఎంతోమందికి అర్థమయింది. మిగిలినవారికి కూడా అర్థం కావడానికి ఎంతో కాలం పట్టదు. త్వరలోనే సంస్కరణల బండారం బయటపడక తప్పదు. 'దున్నేవారికే భూమి' అనే నినాదం కేవలం ఆదర్శ నినాదం మాత్రమే గాక ఆచరణ యోగ్యమయిన పీడిత ప్రజల తక్షణ నినాదంగా తయారుకావడం అనివార్యం. అప్పుడే పీడిత ప్రజల విప్లవ శక్తి అప్రతిహతంగా పురోగమిస్తుంది.

ఇంతవరకు కాంగ్రెస్ ప్రభుత్వపు భూసంస్కరణల తతంగమే బయటికి వచ్చింది. జనతా ప్రభుత్వం ధోరణి ఇంకా స్పష్టంగా బయట పడలేదు. దాని ధోరణి చూస్తుంటే ఇందిరాగాంధీ సంస్కరణలకే కోతపెట్టే వరస కనిపిస్తోంది.

భూ సంస్కరణలు అమలు జరిపే మొనగత్తెగా ఫోజులు కొడుతున్న ఇందిరమ్మ తలపెట్టిన భూసంస్కరణల బూటకాన్ని తేటతెల్లం చేయడానికి, వ్యవసాయ విప్లవ కార్యక్రమానికీ ఆ సంస్కరణలకూ మధ్యగల తేడాను స్పష్టం చేయడానికి ఈ కింది గ్రామాల వివరాలను పరిశీలించుదాం.

ఇది నల్గొండ జిల్లాలో ఒక గ్రామం. ఈ గ్రామంలోని భూములు ఏడెనిమిది సంవత్సరాలుగా నాగార్జున సాగర్ కింద సాగు అవుతున్నాయి.

అంతకు పూర్వం కేవలం వర్షం పైననే ఆధారపడి ఉండేది. విద్యార్థులు రైతులతో మమేకం కావాలనే ఉద్యమంలో భాగంగా సేకరించిన రైతాంగ విశ్లేషణ వివరాలననుసరించి ఆ గ్రామ రైతాంగం స్థితి ఇలా ఉంది.

పట్టిక 1

| | కుటుంబాల సంఖ్య | మొత్తం కుటుంబాల్లో వారి శాతం | వారి కింద ఉన్న భూమి | మొత్తం భూమిలో శాతం | సగటు కుటుంబాని కున్న భూమి | వారికింద ఉన్న అప్పుల మొత్తం | సగటున కుటుంబాని కున్న అప్పు |
|---|---|---|---|---|---|---|---|
| భూమిలేనివారు | 94 | 23 | – | – | – | 49,000 | 522 |
| 3 ఎకరాల వరకు | 186 | 45 | 324 | 15 | 1–80 | 2,48,000 | 1,335 |
| 3 – 8 ఎకరాల వరకు | 68 | 16.5 | 373 | 17.5 | 5.50 | 1,16,700 | 1,716 |
| 8 – 12 ఎకరాల వరకు | 20 | 5 | 215 | 10 | 10.75 | 39,000 | 1,950 |
| 12 – 25 ఎకరాల వరకు | 24 | 6 | 421 | 20 | 17.50 | – | – |
| 25 – 100 ఎకరాల వరకు | 18 | 4.5 | 796 | 37.5 | 44.00 | – | – |
| **మొత్తం** | **410** | **100** | **2129** | **100** | **5.00** | **–** | **–** |

గ్రామంలోని మొత్తం 410 కుటుంబాల్లో అసలు భూమే లేనివి, 3 ఎకరాలలోపు కలవి కలిసి 280 వరకు ఉన్నాయి. అంటే ఇంచుమించు నూటికి డెబ్బై కుటుంబాలు. ఆ మూడు ఎకరాల లోపువారిలో కూడ, ఎకరం లోపువారు 72 మంది. ఎకరం నుండి రెండు ఎకరాల వరకు ఉన్నవారు 84. రెండు మూడు ఎకరాల మధ్య గలవారు 30 మంది. పై పెచ్చు ఈ కుటుంబాలకు మొత్తంగా రెండు లక్షల తొంభై ఏడు వేల రూపాయల అప్పు ఉంది. అంటే వారా అప్పు తీర్చగలిగేదీ లేదు, అదుండగా వ్యవసాయం కోసం వారికి మళ్లీ అప్పు పుట్టేదీలేదు. కాబట్టి గ్రామం మొత్తంలో పెట్టుబడిలేని కారణంగా వీరి భూములే చాలా తక్కువ పంటనిస్తాయి. అది ఆ కుటుంబాల పోషణకే చాలదు. ఒక పూట తిని, మరొకపూట తినకా వారు జీవితాన్ని గడపాలి. ఇక వారికి గల వైద్య సదుపాయం ఎలా ఉంటుందో ఊహించడం కష్టం కాదు. వైద్య సలహా ఒకవేళ లభించినా ఈనాటి ధరలలో మందులు కొనగల సత్తా వారిలో ఏ ఒక్క కుటుంబానికీ లేదనే విషయం లోకవిదితమే. గ్రామం మొత్తంమీద సగటున కుటుంబానికి ఐదుఎకరాల చొప్పున ప్రకృతి దత్తమయిన భూమి సాగు లాయకైనది ఉండగా పై కుటుంబాల వారి కింద సగటున కుటుంబానికి కేవలం ఎకరం పావు మాత్రమే ఉండి సగటున కుటుంబానికి 1070 రూపాయల అప్పు కూడా ఉంది. ఈ స్థితిని మార్చకుండా వ్యవసాయోత్పత్తి ఎంత పెరిగినా, మొత్తం సమాజం ముందుకు పోతుందనడం కంటె పచ్చి అబద్ధం మరొకటి ఉండబోదు. గ్రామీణ జనాభాలో నూటికి డెబ్బై మందిగా ఉన్న వీరి పరిస్థితి బాగు చేయకుండా, వీరు సంతృప్తికరంగా బతికే పరిస్థితి సృష్టించకుండా సోషలిజం సంగతి అలా ఉంచి దేశం ప్రజాస్వామికం వైపుకూడా ఒక్క అడుగయినా ముందుకుపోవడం అసంభవం.

అయితే విశేషమేమంటే కాంగ్రెస్ ప్రభుత్వం వారి భూసంస్కరణలలో పైన పేర్కొన్న గ్రామంలో ఒక్క సెంటు భూమి కూడా తాకబడలేదు. ఇక ఆ సంస్కరణల బూటకం అర్థం చేసుకోడానికి వేరే ఉదాహరణ అనవసరం.

ఇంకొక పక్క అదే గ్రామంలో కేవలం 42 కుటుంబాల వారికి 1217 ఎకరాల భూమి ఉంది. కుటుంబానికి సగటున ముప్పై ఎకరాలు ఉంది. అంతేగాక ఈ కుటుంబాలన్నిటి వద్ద కలిసి పదమూడు లక్షల యాభై వేలవరకు నగదు ఉంది. అంటే సగటున కుటుంబానికి 32 వేలకి పైబడి నగదు ఉంది. ఈనాడో రేపో మూడు ఎకరాలలోపుగా ఉన్న కుటుంబాలకు చెందిన ముప్పై నాలుగు ఎకరాలనుండి సగానికి పైగా భూమిని అప్పుల కింద వారు కాజేయడం ఖాయం. తద్వారా ఆ కుటుంబాల బాధ మరింత ఘోరంగా తయారుకాక తప్పదు. వ్యవసాయ విప్లవాన్ని గూర్చి ఏ మాత్రం శ్రద్ధతో ఆలోచించే వారయినా, దేశంలో ప్రజాస్వామిక వ్యవస్థను నెలకొల్పడం పై ఏమాత్రం చిత్తశుద్ధి ఉన్నా ఈ నలభై రెండు కుటుంబాల కిందనున్న భూమిని స్వాధీనం చేసుకుని పై 280 కుటుంబాల వారికి పంచడం ద్వారా వారి ఆదాయాన్ని పెంచాలి.

ఆ గ్రామంలో వ్యవసాయ కూలీలు, పేద రైతులకు చెందిన 280 కుటుంబాల స్థితిని మెరుగు పర్చడానికి మరో మార్గం లేదు. ఆ భూమి అంతా ఆ కుటుంబాల కష్టార్జితం దోచుకోగా ఆ నలభై రెండు కుటుంబాల కింద సమకూరిందే కనుక, అలా తిరిగి దాన్ని పంచుకోవడం వీరి జన్మ హక్కు కూడా. వ్యవసాయ విప్లవం అంటే ఇదే, ఇంతకు మించి దానికి మరో అర్థం లేదు.

ఆ గ్రామంలో 12 నుండి 100 ఎకరాల వరకూ భూమి కలిగిన 42 కుటుంబాల వద్ద 1,217 ఎకరాల భూమి ఉందని చూశాం. అందువల్ల వ్యవసాయంలో ఏటేటా రైతాంగం సృష్టించే సంపద మొత్తంలో నూటికి పది వంతులు ఈ 42 కుటుంబాలకే చెందుతుంది. అందుకే మిగిలిన కుటుంబాలన్నీ అప్పులతో సతమతమౌతూ ఉంటే కేవలం 42 కుటుంబాల వారి వద్ద 13 లక్షల 40 వేలకి పైబడి నగదు ఉంది. అదంతా సంవత్సరాల తరబడి నూటికి డెబ్బై మందిగా ఉన్న వ్యవసాయ కూలీలను, పేద రైతాంగాన్నీ తక్కువ కూలీ, పిచ్చి కుంచాల కొలతలు, నాగులు వగైరా ఫ్యూడల్ పద్ధతులలో దోచుకోవడం ద్వారానూ, మొత్తం భూమిలో సగానికి పైగా ఆకట్టుకోవడం ద్వారానూ మాత్రమే సమకూడింది. ఇక ఆ దోపిడీని అరికట్టాలి. పగలంతా కష్టపడి, పస్తులతో బతికే జనం ఇక ఆ దోపిడీని సహించరు. అందువల్ల నూటికి డెబ్బై మందిగా ఉన్న వ్యవసాయం కార్మికులకి తమ కష్టార్జితం మొత్తం తమకే దక్కాలనేమాట అటుంచి, కనీసం తాము పిల్లాజెల్లాతో సంతృప్తిగా రెండుపూటలా తిండి తినేందుకవకాశం కలగాలన్నా ఇంతకాలం వారి కష్టార్జితం దోచుకొన్న ఈ 42 కుటుంబాల కింద పోగుబడిన భూమిని వారికి పంచడం మినహా మరో మార్గం లేదు. అదే వ్యవసాయ విప్లవంలో ప్రథమ సోపానం.

అలా పంచితే ఈ 42 కుటుంబాల వద్దనున్న 1,217 ఎకరాలూ, మూడు ఎకరాలలోపు వారి వద్దనున్న 324 ఎకరాలూ కలిసి మొత్తం

1,541 ఎకరాల భూమిని అసలే భూమిలేని 94 కుటుంబాలు, మూడు ఎకరాలలోపున్న 186 కుటుంబాలు కలిసి మొత్తం 280 కుటుంబాలకీ పంచాలి. భూమితోపాటు పశువులను, వ్యవసాయ పరికరాలను గూడా పంచాలి. అప్పుడు వారిలో ఒక్కొక్కరికి దాదాపు ఐదున్నర ఎకరాల భూమి లభిస్తుంది. ఈ భూమిని ఎలా పంచుకోవాలో వారే తేల్చుకోగలరు.

మరి ఇప్పటిదాకా ఆ గ్రామంలో సగానికిపైగా భూమిని అనుభవిస్తున్న 42 మంది సంగతి ఏమిటి? వారిలో కొందరికి వేలకొలది రూపాయల పెట్టుబడితో నడిపే కిరాణా దుకాణాలు ఉన్నాయి. మరికొందరికి రైస్‌మిల్లులలో వాటాలున్నాయి. అలాంటివారికి ఆ వ్యాపారాలే చాలు. వారికి భూమి ఇవ్వనవసరం లేదు. మిగిలినవారిలో వ్యవసాయ విప్లవం ఎడల వారవలంబించే వైఖరినసుసరించి, వారు బతకడానికవసరమైన భూమి ఇవ్వవచ్చు. అంటే వారు విప్లవాన్ని ప్రతిఘటించి నిలబడకుండా ఉంటే పై 280 కుటుంబాలూ భూమిని పంచుకునేటప్పుడు వారికి కూడా వాటా ఇవ్వవచ్చు. మొండిగా వ్యవసాయ విప్లవాన్ని వ్యతిరేకించే వారికి ఇవ్వవలసిన పనిలేదు. అలా వారికి వాటా ఇచ్చిన అందరితోపాటు వారికి ఐదు ఎకరాలు వస్తుంది. కష్టపడి పని చేసుకుంటే బతకడానికి అదిచాలు.

ఇక వ్యవసాయ విప్లవంలో రెండో కర్తవ్యం పై 280 కుటుంబాల కింద ఉన్న 2 లక్షల 97 వేల రూపాయల అప్పుతోబాటు, 3 నుండి 12 ఎకరాల లోపున గల 88 కుటుంబాల వారికి గల 1 లక్ష 55 వేల 7 వందల రూపాయల అప్పును గూడా రద్దు చేయడం. అలా దేశానికి వెన్నెముకగా ఉన్న రైతుకు విముక్తి కలిగించాలి.

మూడో కర్తవ్యం, వ్యవసాయాన్ని శాస్త్రీయంగా కొనసాగించడానికి అవసరమైన ఎరువులు, విత్తనాలు, యంత్రాలు, పెట్టుబడి ప్రభుత్వం పంటలు వచ్చిన తర్వాత తీసుకునే షరతులపై, సకాలానికి అందించాలి.

కొన్ని గ్రామాలలో అందరికీ భూమిపంచడం సాధ్యంకాదు. పాత మాగాణీ ఉన్న కృష్ణ, గుంటూరు జిల్లా గ్రామాలలో భూమిలేని కూలీల సంఖ్య చాల హెచ్చు. కొన్ని చోట్ల యాభై శాతానికి మించి కూడ ఉన్నారు. అలాంటి చోట్ల భూస్వాముల నుండి స్వాధీనం చేసుకునే భూమి అన్ని కుటుంబాలకూ పంచితే ఏటూ చాలకపోవచ్చు. కొన్ని కుటుంబాలు అప్పటికీ భూమిలేని కుటుంబాలుగానే మిగలవచ్చు. ఒకవేళ తలకాస్తా భూమి పంచుకున్నా అది చాలక కూలికిపోవడం తప్పకపోవచ్చు. అయితే చాలామందికి ఎంతో కొంత భూమి లభ్యమౌతుంది గనుక మిగిలిన కూలీలకు పని దొరకదనే బాధ తగ్గుతుంది. అలాంటి వారికి పేద రైతాంగానికి వచ్చే ఆదాయానికి సరిపడ లభించేటట్టుగా కనీస కూలిని ప్రభుత్వం నిర్ణయించి అమలు జరపాలి.

పై విధంగా వ్యవసాయ విప్లవం అమలు జరిగితే ఈనాడు వ్యవసాయంలో ఉన్న సంక్షోభం అంతరిస్తుంది. వ్యవసాయం ద్వారా సృష్టించబడే సంపద ఒక క్రమంలో అందరికీ లభించడంతో అట్టడుగు నున్నవారి దరిద్రం కూడా అంతరిస్తుంది. ఆ పునాదిపై క్రమంగా మనిషిని మరో మనిషి దోచుకోవడానికి వీలులేని సోషలిస్టు సమాజం వైపు సమాజం పురోగమించడానికి భౌతిక స్థితి ఏర్పడుతుంది.

అయితే కాంగ్రెస్ ప్రభుత్వం గాని, జనతా ప్రభుత్వం గాని పై పద్ధతిని ఆమోదించి అమలు పరుస్తుందా? ఆమోదించినట్టయితే పై గ్రామంలో సీలింగ్ లెక్కలు పూర్తయినా పంపకానికి ఒక ఎకరం కూడా ప్రభుత్వం ఎందుకు స్వాధీన పర్చుకోలేదు? కనీసం అలా స్వాధీనపర్చుకునే గ్రామాల జాబితాలో ఆ గ్రామం ఊసుకూడ ఎందుకు లేదు? పై ప్రశ్నలకు ప్రభుత్వం వద్ద జవాబులు లేవు. ఏవో కుంటిసాకులూ చెప్పినా అవన్నీ ప్రభుత్వ భూసంస్కరణలు కేవలం బూటకమేననే విషయాన్ని మరుగుపరచలేవు.

సోషలిజం పేరుతోనే బడా బూర్జువా భూస్వామ్యవర్గాల ప్రభుత్వం సోషలిజానికి ఎలా ద్రోహం చేస్తుందో, అలానే భూసంస్కరణల పేరుతోనే వ్యవసాయ విప్లవానికి కూడా తీరని ద్రోహం చేస్తోంది. గ్రామీణ పేద ప్రజల్ని మోసగించి, విప్లవం గురించి ఆలోచించకుండా చేయాలనే తాపత్రయంతోనే ప్రభుత్వం ఈ సంస్కరణల తతంగమంతా జరుపుతోంది.

నిజానికి విప్లవకర మార్పుల సంగతి అలా ఉంచి ఏదో విధంగా నూటికి 70 మందిగా ఉన్న భూమిలేని, పేద రైతాంగపు ఆర్థిక స్థితి ఎంతో కొంత బాగు చేయాలనే చిత్తశుద్ధి ప్రభుత్వానికుంటే పైన పేర్కొన్న 42 కుటుంబాల వారికీ ఆ గ్రామంలోని ధనిక రైతులకున్నట్టుగానే తలా 12 ఎకరాలు ఉంచి తతిమ్మా భూమినయినా స్వాధీనం చేసుకొని దరిద్రాన్ననుభవిస్తున్న 280 కుటుంబాలకూ పంచవచ్చు. అలా పంచినా పై 42 కుటుంబాల వారికీ తలా 12 ఎకరాల చొప్పున ఇచ్చే 504 ఎకరాలు పోను వారివద్ద ప్రస్తుతం ఉన్న భూమి నుండి 713 ఎకరాలు పంచవచ్చు. అలా వారి నుండి స్వాధీనపర్చుకున్న 713 ఎకరాలు, పేద రైతాంగం వద్దనున్న 324 ఎకారలు కలిపి మొత్తం 1037 ఎకరాలు ఆ 280 కుటుంబాలకు పంచితే ఒక్కో కుటుంబానికి 3.70 ఎకరాలు వస్తుంది. కనీసం అందుకు పూనుకున్నా దాన్ని వ్యవసాయ విప్లవం అనకపోయినా, బూర్జువా సంస్కరణ అని అయినా తృప్తిపడవచ్చు. భూస్వాములతో

పట్టిక 2

| | కుటుం బాలు | భూమిఎకరాలలో తరి | భూమిఎకరాలలో కుష్కీ | నౌకర్లు | దుక్కి పశువులు | పాడి పశువులు | అప్పులు | ఇతర ఆస్తి |
|---|---|---|---|---|---|---|---|---|
| భూమిలేని వ్యవసాయ కూలీలు | 76 | - | - | - | 26 | 26 | 8000 | - |
| గొర్రెల పెంపకదార్లు | 15 | 3.00 | 5 | - | - | - | 2160 | 2460 గొర్రెలు |
| ఉద్యోగస్తులు | 4 | 7.00 | 140 | 3 | 14 | 11 | - | - |
| వ్యాపారస్తులు | 4 | 5.70 | 16 | 9 | 11 | 6 | - | - |
| పేద రైతులు | 58 | 4.08 | 365 | 1 | 72 | 34 | 14,200 | - |
| మధ్యతరగతి రైతులు | 19 | 14.10 | 224 | 7 | 33 | 39 | 3,500 | - |
| ధనిక రైతులు | 6 | 10.20 | 130 | 3 | 6 | 4 | - | - |
| భూస్వాములు | 13 | 219.20 | 919 | 25 | 56 | 46 | - | - |
| **మొత్తం** | **195** | **263.28** | **1,799** | **48** | **220** | **156** | **27,860** | **2,460** గొర్రెలు |

కలిసిన పొత్తు మూలంగా, కాంగ్రెస్, జనతాపార్టీల నాయకత్వం కింద అధికారం చెలాయిస్తున్న భారత పెట్టుబడిదారీ వర్గానికి అలాంటి బూర్జువా సంస్కరణ అమలు జరిపే సత్తా కూడా లేదు.

అలాగే ఆదిలాబాద్ జిల్లాకు చెందిన మరో రెండు గ్రామాల వివరాలు చూద్దాం. ఈ రెండు గ్రామాలూ ఆదిలాబాద్ జిల్లాలో బెల్లంపల్లి బొగ్గుగనుల ప్రాంతానికి చెందినవి. ఇక్కడ భూములు ఏమంత సారవంతమైనవి కావు. ఒక్కొక్క గ్రామాన్నీ పరిశీలిద్దాం.

| పట్టిక 3 | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | నేటి స్థితి | | | | | | వ్యవసాయ విప్లవం తర్వాత స్థితి | | | |
| | కుటుంబాలు | వారికిందనున్న భూమి | | అప్పు | వ్యవసాయంపై వచ్చే మొత్తం ఫలసాయం | కుటుంబం సగటు ఆదాయం | వారికింద ఉన్న భూమి | | వ్యవసాయంపై వచ్చే మొత్తం ఫలసాయం | కుటుంబం సగటు ఆదాయం |
| | | తరి | కుష్కీ | | | | తరి | కుష్కీ | | |
| గొర్రెల పెంచేవారు | 15 | 3.00 | 5 | 2,160 | – | – | 3.00 | 5 | – | – |
| వీరి ఇతర ఆస్తి – 2,460 గొర్రెలు | | | | | | | వీరి ఇతర ఆస్తి – 2,460 గొర్రెలు | | | |
| ఉద్యోగస్తులు | 4 | 7.00 | 140 | – | 17,500 | 4,375 | 7.00 | 140 | 17,500 | 4,375 |
| వ్యాపారస్తులు | 4 | 5.20 | 16 | – | 4,350 | 1,800 | 5.20 | 16 | 4,350 | 1,088 |
| వ్యవసాయ కూలీలు | 76 | – | – | 8,000 | – | – | 127.00 | 728 | 1,36,000 | 1,790 |
| పేద రైతులు | 58 | 4.08 | 365 | 14,200 | 38,600 | 666 | 97.00 | 556 | 1,04,100 | 1,790 |
| మధ్యతరగతి రైతులు | 19 | 14.10 | 224 | 3,500 | 29,525 | 1,554 | 14.10 | 224 | 29,525 | 1,554 |
| ధనిక రైతులు | 6 | 10.20 | 130 | – | 18,250 | 3,041 | 10.20 | 130 | 18,250 | 3,041 |
| భూస్వాములు | 13 | 219.20 | 919 | – | 2,01,650 | 16,512 | – | – | – | – |
| **మొత్తం** | **195** | **263.38** | **1,799** | **27,860** | **3,11,875** | | **263.38** | **1,799** | **3,11,875** | |
| వ్యవసాయ విప్లవం తర్వాత రైతాంగం అప్పులు పూర్తిగా రద్దు చేయబడతాయి. | | | | | | | | | | |

'ఏ' అనేది చిన్న గ్రామం. జనాభా – 1,100. పంచాయితీ బోర్డు ఉంది. దాని సంవత్సరాదాయం రు. 1,610. కో–ఆపరేటివ్ పరపతి సంఘం ఉంది. పాలేర్లకు (జీతాగాళ్లకు) నెలకు నాలుగు కుంచాలు (సుమారు 35 కిలోల ధాన్యం) జీతం. సాలు ఆఖరున ఇచ్చే మామూళ్లతో కలుపుకుని పాలేరు జీతం ఎట్టి పరిస్థితుల్లోనూ సంవత్సరానికి 9 బస్తాలకు మించదు. నాగుపద్ధతి యధేచ్ఛగా కొనసాగుతూనే ఉంది. పేదవాళ్లు తెచ్చుకునే అప్పులకు వడ్డీరేటు నూటికి 15 నుండి 50 రూపాయలు. ఊళ్లో సహకార పరపతి సంఘం ఉండగా కూడా ఇంత దరుణమైన వడ్డీరేట్లు అమలు జరుగుతున్నాయంటే ఆ సోసైటీ ఎవరి చేతుల్లో దోపిడీ సాధనంగా వినియోగపడుతోందో ఊహించడం కష్టం కాదు. అది కేవలం భూస్వాముల చేతుల్లోనూ పెద్ద వ్యాపారస్తుల చేతుల్లోనూ ఆయుధంగా మాత్రమే ఉంది.

చాకలి, మంగలి, మాదిగ, వడ్రంగి వగైరా చేతివృత్తుల వారికి ఇంత పనికి ఇంత కూలి అనే పద్ధతిలో కాకుండా ఇక్ష్వాకుల కాలం నుండీ ఆనవాయితీగా వస్తున్న మేర (మామూలు) రూపంలోనే ప్రతిఫలం ముడుతోంది. అది కేవలం ఫ్యూడల్ దోపిడీ నగ్నరూపం మాత్రమే. ఇక ఆ గ్రామంలో భూమి సంబంధాలు ఎలా ఉన్నాయో పట్టిక తెలియ పరుస్తుంది.

పై గ్రామంలో మొత్తం 195 కుటుంబాలు నివసిస్తున్నాయి. అందులో కేవలం గొర్రెలే ఆస్తిగా జీవించే కుటుంబాలు 15. అది అడవి సమీప గ్రామం కనుక గొర్రెల పెంపకానికి అనువైన గ్రామం కూడా. ఆ 15 కుటుంబాలకూ కలిసి 2,500 అంటే కుటుంబానికి సగటున 164 గొర్రెలు ఉన్నాయి. ఫారెస్ట్ ఆఫీసర్లు పెట్టే బాధలు, అనేక సాకులతో వారు గుంజే లంచాలు, జరిమానాలు, గ్రామ భూస్వాములు రకరకాల మామూళ్ల పేరుతో జబర్దస్తీగా సాగించే దోపిడీ వగైరాలు బందు చేయగలిగితే వారు పేద రైతుల స్థాయికి తగ్గకుండానే జీవించవచ్చు.

వారుగాక ఉపాధ్యాయులు వగైరా నలుగురు ఉద్యోగులు, మరో నలుగురు వ్యాపారస్తులు ఉన్నారు. ప్రత్యేక జీవనోపాధి ఉంది కనుక ఈ కుటుంబాలకు భూమితో నిమిత్తం ఉండాల్సిన పనిలేదు. గొర్రెల పెంపకందార్లు, ఉద్యోగస్తులు, వ్యాపారస్తులు కలిసి మొత్తం 23 కుటుంబాలు. వారుపోను ఆ గ్రామంలో వ్యవసాయంతో సంబంధం ఉన్న కుటుంబాలు 172.

ఆ గ్రామంలో వైశ్య కుటుంబాలు మరో 16 ఉన్నాయి. వారంతా చిన్నదో పెద్దదో వ్యాపారం చేసేవారే. గ్రామంలో పండే సరుకును బయటకమ్మడం. గ్రామస్తులకు కావలసిన సరుకును బయటనుండి తెప్పించి అమ్మడం, నాగులివ్వడం దగ్గర నుండి నగదుగా అప్పులిచ్చే వడ్డీ వ్యాపారం వరకు వీరే చేస్తారు. వీరివద్ద తీసుకున్న అప్పులు తీర్చలేని కారణంగా పేద రైతుల భూములు చాలాభాగం క్రమంగా వీరి పరమైనాయి. అలా, ప్రత్యేకించి తెలంగాణలోని చాలా గ్రామాలలో, వడ్డీ వ్యాపారస్తులుగా భాగస్వాములుగా పాలకవర్గాలకు నమ్మినబంట్లుగా వీరిపాత్ర ప్రముఖంగానే ఉంది.

ఈ గ్రామంలో ఉన్న మొత్తం తరిభూమిలో నూటికి 42 ఎకరాలు, కుష్కీ (మెట్ట)లో నూటికి 25 ఎకరాలు ఆ 16 కుటుంబాల కిందే ఉంది. సగటున ఈ ఒక్కొక్క కుటుంబం కింద, పట్టికలోని ధనిక రైతు స్థాయికి మించిన భూమి లేని మాట నిజమే గాని వారికి వ్యవసాయమంటే రైతుల్ని విపరీతంగా దోచుకునే రకరకాల వ్యాపారం కొనసాగించడంలోనే ఆసక్తి హెచ్చు. ఆ విధంగానే వారి ఆస్తులన్నీ సంపాదించారు. మొదట్లో వీరంతా కట్టుబట్టలతో ఆ ఊరు వచ్చిన వారే.

పై 16 కుటుంబాలనూ కూడా మినహాయిస్తే గ్రామంలో నిజంగా వ్యవసాయంపై ఆధారపడి జీవించే కుటుంబాలు 156 మాత్రమే. వాస్తవానికి భూమి సమస్య అంటే, ఆ గ్రామానికి సంబంధించి, ఈ 156 కుటుంబాలకు చెందినదే.

గ్రామంలో మొత్తం తరి (మాగాణి) 264 ఎకరాలూ, కుష్కీ (మెట్ట) 1,800 ఎకరాలూ ఉంది. కుష్కీ చాలా నిస్సారమైనది, అందులో హెచ్చు భాగం చెలక భూమే. అయినా అనాదిగా ఊళ్లో జనం అంతా ఆ

పట్టిక 4

| | కుటుంబాల సంఖ్య | భూమి తరి | ఎకరాల లో కుష్కీ | దుక్కి పశువులు | పాడి పశువులు | నౌకర్లు | అప్పులు |
|---|---|---|---|---|---|---|---|
| వ్యవసాయ కూలీలు | 103 | – | – | 53 | 44 | 3 | 9,300 |
| పేదరైతులు | 72 | 30–10 | 292–20 | 87 | 79 | 1 | 8,700 |
| మధ్యతరగతి రైతులు | 25 | 20–38 | 320–00 | 62 | 40 | 7 | 4,000 |
| ధనికరైతులు | 22 | 59–00 | 391–00 | 23 | 42 | 10 | 2,000 |
| భూస్వాములు | 13 | 80–00 | 658–00 | 60 | 138 | 32 | 2,000 |
| వ్యాపారులు | 6 | 11–00 | 57–00 | 22 | 37 | 10 | – |
| ఉద్యోగస్తులు | 11 | 18–32 | 147–00 | 2 | 3 | – | 950 |
| గొర్రెలు పెంచేవారు | 8 | – | – | – | – | – | – |
| మొత్తం | 280 | 220–00 | 1867–20 | 309 | 683 | 83 | 26,980 |

భూమిపైనే కష్టం చేసి ఆ ఆదాయంతోనే బతుకుతున్నారు. వ్యవసాయంపై నిజంగా ఆధారపడే 156 కుటుంబాలకి ఆ భూమి పంచితే సగటున కుటుంబానికి 1 ఎకరం 28 గుంటలు తరి, 11 ఎకరాల 1 గుంట (గుంట అంటే రెండున్నర సెంట్లు) కుష్కీ లభిస్తుంది. అలాగాక, గొర్రెల పెంపకందార్లక్కూడా భూమి ఇవ్వదలిస్తే మొత్తం 171 కుటుంబాలకు సగటున 1 ఎకరం 21 గుంటల తరి, పదిన్నర ఎకరాల కుష్కీ లభిస్తుంది.

పెద్ద వ్యాపారస్తుల్ని మినహాయించి మిగిలిన వైశ్యులక్కూడా భూమి ఇవ్వదలిస్తే మొత్తం 187 కుటుంబాలకు సగటున 1 ఎకరం 16 గుంటల తరి, పదెకరాల కుష్కీ లభిస్తుంది.

వాస్తవంగా భూమి పంపకానికి వచ్చినప్పుడు ఏ కుటుంబాలకు భూమి ఇవ్వాలి, ఏ కుటంబాలకు భూమి ఇవ్వనవసరం లేదనే విషయం ఆ గ్రామం లోని పీడిత ప్రజలే తేల్చుకుంటారు. ఎలా పంపకం జరిగినా ఆ ఊరి ప్రజలందరినీ పోషించగల భూ వసతి ఆ గ్రామానికుందనే విషయం పై లెక్కలు తెలియజేస్తాయి.

ప్రస్తుతం ఆ గ్రామంలో భూమి ఎలా విభజింపబడి ఉందో పట్టికలో చూశాం. దానిని బట్టి ఆ గ్రామంలో 76 కుటుంబాలకు అసలు భూమి లేదు. వీరు కేవలం రెక్కలమ్ముకొని బతకాల్సిందే. మరో 58 కుటుంబాలకు మొత్తంగా 4 ఎకరాల 8 గుంటల తరి, 665 ఎకరాలు కుష్కీ ఉంది. అంటే సగటున కుటుంబానికి 3 గుంటల తరి, 6 ఎకరాల కుష్కీ మాత్రమే ఉంది. ఆ గ్రామంలోని కుష్కీలో అత్యధిక భాగం నిస్సారమైనదేనని చూశాం. అందులో ఎంతో కొంత మంచి భూమి ఉన్నా అది భూస్వాముల స్వాధీనంలోనే ఉంటుంది. కాని పేదరైతుల స్వాధీనంలో ఉండడం అసంభవం. అందువల్ల, ఆ గ్రామంలో కేవలం 6 ఎకరాల చెలకభూమిపై కుటుంబం గడవడం అసంభవం.

అదే స్థితిలో, కేవలం 13 కుటుంబాల కింద 219 ఎకరాల 20 గుంటల తరి 919 ఎకరాల కుష్కీ ఉంది. అంటే మొత్తం తరిలో 83 శాతం మొత్తం కుష్కీలో సగానికి పైగానూ సుమారు 7 శాతంగా ఉన్న కుటుంబాల చేతిలో ఉంది. మరో మాటల్లో చెప్పాలంటే ఆ గ్రామంలోనే కేవలం వ్యవసాయంపైనే ఆధారపడ్డ 156 కుటుంబాలలో 143 కుటుంబాలకు సగటున కుటుంబానికి 1 గుంట తరి (కేవలం రెండున్నర సెంట్లు). రెండున్నర ఎకరాల కుష్కీ మాత్రమే ఉండగా, కేవలం పదముగ్గురికి సగటున ఒక్కొక్కరికి 17 ఎకరాల తరి, 70 ఎకరాల కుష్కీ ఉన్నాయి. భూమి కేంద్రీకరణంటే ఇదే.

ఆ గ్రామ భూముల్లో ఖర్చులు పోను నికరాదాయం సంవత్సరానికి కుష్కీలో వంద రూపాయలు, తరిలో ఎకరానికి 500 ఉందనుకుంటే, అక్కడ నూటికి 70 మంది ఉన్న 143 కుటుంబాలకి సగటున ఒక్కొక్కరికి సాలుసరి ఆదాయం రు. 262 కాగా, 7 శాతంగా ఉన్న 13 కుటుంబాలకు సాలుసరి సగటు ఆదాయం 15,500 రూపాయలు అవుతుంది. ఎక్కడ 262 రూపాయలు - ఎక్కడా 15,500 రూపాయలు? ఆదాయంలో ఇంత వ్యత్యాసం ఉండగా, ఆ గ్రామ భూముల్లో పంట ఎంత హెచ్చుగా పండించినా నూటికి 70గా ఉన్న 143 కుటుంబాల దరిద్రం అంతరించడం సాధ్యం కాని పని. ఆ 143 కుటుంబాల దరిద్రం సమూలంగా అంతరించాలంటే పై కుటుంబాల కింద ఉన్న భూమిని స్వాధీనం చేసుకుని 143 కుటుంబాలకు పంచడం తప్ప మరో మార్గం లేదు. భూస్వామ్య విధానాన్ని నిర్మూలించడం అంటే ఇదే. కమ్యూనిస్టు పార్టీ (ఎం.ఎల్.) కొనసాగిస్తున్న వ్యవసాయ విప్లవం అంటే కూడా ఇదే. అలా జరిగినప్పుడే ఆదాయంలో ఈనాడు విపరీతంగా ఉన్న వ్యత్యాసం నశిస్తుంది. గ్రామీణ పీడిత ప్రజల కొనుగోలు శక్తి పెరుగుతుంది.

ప్రభుత్వ భూసంస్కరణలు పై కర్తవ్యం నిర్వహించడానికి సిద్ధంగా ఉన్నాయా? లేదనే విషయం ఇంగిత జ్ఞానమున్న ప్రతివారికీ తెలుసు. ఆ గ్రామంలో ఒక్క సెంటు భూమినయినా ప్రభుత్వపు సంస్కరణలు తాకలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఈ గ్రామంలో పంచవలసిన మిగులు భూమి ఒక్క సెంటయినా లేదు. ప్రభుత్వ సంస్కరణలు కేవలం బూటకమనీ, పీడిత ప్రజల జీవితంతో ఆడుతున్న చెలగాటమనీ చెప్పడానికి ఇంతకన్నా రుజువు ఏం కావాలి.

ప్రభుత్వం తలపెట్టిన కుహనా సంస్కరణలకు ప్రత్యామ్నాయంగా కార్మిక వర్గ నాయకత్వం కింద మన దేశంలో వ్యవసాయ విప్లవం విజయవంతమైన తర్వాత ఆ గ్రామంలో భూ సంబంధాలు ఎలా ఉంటాయో చూద్దాం.

భూస్వాములకు చెందిన 13 కుటుంబాల కింద ఉన్న 219 ఎకరాల తరినీ, 919 ఎకరాల కుష్కీని మొట్టమొదట రైతాంగం స్వాధీనం చేసుకుంటుంది. ఆ భూమికి తోడు చాలీచాలని భూమితో సతమతమౌతున్న 58 కుటుంబాల కింద ఉన్న 4 ఎకరాల 28 గుంటల తరినీ, 1,284 ఎకరాల కుష్కీనీ వ్యవసాయ కూలీలు, పేద రైతులుగా ఉన్న మొత్తం 143 కుటుంబాలకూ పంచడం జరుగుతుంది. అలా పంచితే సగటున కుటుంబానికి 1 ఎకరం 27 గుంటల తరి, తొమ్మిదిన్నర ఎకరాల కుష్కీ లభిస్తుంది. అప్పుడా కుటుంబాల ఆదాయమూ పెరుగుతుంది. అందుకనుగుణంగా వారి కొనుగోలు శక్తి కూడా పెరిగి దేశ పారిశ్రామికాభివృద్ధికి దోహదం అవుతుంది.

అయితే అలా భూములు కోల్పోయిన 13 భూస్వామి కుటుంబాల

గతి ఏమికావాలి? వారికి అంతభూమి ఎలాచేకూరిందనే సమస్య ముందు తేలితే, వారు ఇకముందు ఎలా బతకాలనే ప్రశ్న కూడా అందుకను గుణంగానే తేల్తుంది. తరతరాలుగా పేదరైతుల కష్టార్జితాన్ని దోచుకోవడం ద్వారానే, వారి భూములను కాజేయడం ద్వారానే అంత ఎక్కువ మొత్తం భూమిని వారు కూడబెట్టగలిగారు. ఈ యథార్థాన్ని కాంగ్రెస్, జనతా ప్రభుత్వాలు అంగీకరిస్తాయా లేదా ముందుతేలాలి. 'సోషలిస్ట్ ముసుగు' తగిలించుకున్న ప్రభుత్వాలు ఈ విషయం అంగీకరించనైనా అంగీకరించాలి లేదా సోషలిజానికి పంగనామాలు పెట్టి ఏ పూర్వజన్మ సుకృతం వల్లనో వారికాభూమి లభించిందని బుకాయించాలి. వారు ఎలా బుకాయించినా ఆ ఊళ్లో పేద ప్రజలకు యథార్థమేదో తెలుసు. అందువల్ల ఆ 13 కుటుంబాలనూ వారు క్షమించరు. తరతరాలుగా తమను దోచుకుంటున్న ఆ 13 కుటుంబాల పై వారు కసిదీర్చుకోదలిస్తే ఈ భూ ప్రపంచంలో ఎవరూ వారిని అడ్డుకోలేరు, ఆపలేరు. అది వారి హక్కు. ఆ 13 కుటుంబాలలో ఏ కొంతమంది అయినా ఆ పేద ప్రజల దయాదాక్షిణ్యాలకు పాత్రులయితే వారే ఆ కుటుంబాలకు కొంతభూమి ఇచ్చి బతుకుతెరువు కల్పించగలరు. మిగిలినవారు, తరతరాలుగా ఈనాడు ఆ గ్రామంలోని 70 వ్యవసాయ కూలీ కుటుంబాలు ఎలా రెక్కలమ్ముకుని బతుకుతున్నాయో అలానే బతకవచ్చు.

అందువల్ల గతంలో ఎలా ఉన్నా ఇప్పటి నుండయినా ఆ ఊళ్లో ఆ 13 కుటుంబాలవారూ పేద ప్రజల ఎడల, వ్యవసాయ విప్లవం ఎడల ఎలాంటి వైఖరి తీసుకుంటారో దాన్ననుసరించి భూ పంపకం సమయంలో వారి ఎడల ఆ గ్రామంలోని పీడిత ప్రజలు తీసుకునే వైఖరి ఆధారపడి ఉంటుంది. ఇప్పటినుండీ వారు ఆ గ్రామంలోని పీడిత ప్రజలకు తలలో నాలుకగా మెలుగుతూ దోపిడీకి తిలోదకాలిచ్చి బతకదలిస్తే, భూమి పంపకం సమయంలో వారికి కూడా తమతోపాటు వాటా ఇచ్చినా సగటున కుటుంబానికి 1 ఎకరం 10 గుంటల తరి, 7 ఎకరాల 30 గుంటల కుష్కీ లభిస్తుంది. ఆ లెక్కను చూసుకున్నా ఈనాడు 262 రూపాయలుగా ఉన్న పేద రైతు కుటుంబం సాలుసరి ఆదాయం రు. 1,500కు పెరుగుతుంది. అంటే 6 రెట్లు పెరుగుతుంది.

ఇక అప్పుల సంగతి. ఆ గ్రామంలో 76 వ్యవసాయకూలీ కుటుంబాలకు సగటున ఒక్కొక్కరికీ రు. 100కు పైగానూ, 58 పేద రైతు కుటుంబాలకు సగటున ఒక్కొక్కరికీ రు. 200లు, 19 మధ్యతరగతి రైతు కుటుంబాలకు సగటున ఒక్కొక్కరికీ రు. 200 అప్పులున్నాయి. వివరాలు సేకరించేటప్పుడు రైతులు తమ అప్పులను పూర్తిగా చెప్పరు. అందువల్ల నిజానికి అప్పులు ఇంతకన్నా చాలా ఎక్కువగానే ఉండి ఉంటాయి. ఆ అప్పుల్ని వారు తీర్చగలిగిన స్థితిలేదు. అందువల్ల వ్యవసాయ విప్లవం వాటిని నిర్ద్వంద్వంగా రద్దు చేస్తుంది.

బడా బూర్జువా భూస్వామ్యవర్గాల ప్రభుత్వపు హుళక్కి సంస్కరణలు ఆ గ్రామంలోని పీడిత రైతాంగ పరిస్థితిని కించిత్తుకూడా మెరుగుపరచక పోగా ఫ్యూడల్ దోపిడీ యథాప్రకారం కొనసాగి ఆ 13 కుటుంబాలూ అనతికాలంలోనే మరింత మేటవేసి పీడిత ప్రజల వద్ద మిగిలి ఉన్న భూమిని కూడా కాజేసి మరింతి కుబేరులై తీరుతారు. అలానే పేద రేతులు మరింత నిరుపేదలై ఇప్పటికే రెక్కలు తప్ప మరో ఆధారం లేకుండా ఉన్న 76 కుటుంబాలకు తోడు కాస్తోకూస్తో భూ వసతి కలిగి ఉన్న 69 కుటుంబాలు కూడా తమ భూములు కోల్పోగా ఆ గ్రామంలో వ్యవసాయ కూలీ కుటుంబాల సంఖ్య 143కు పెరుగుతుంది. అందుకు మారుగా పైన వివరించినట్టు వ్యవసాయ విప్లవం జయప్రదంగా పరిపూర్తి చేయబడితే, అంటే కనీసం ఉద్యోగస్తులు, వ్యాపారస్తులు, ధనిక రైతుల చేతుల్లో నేడు ఉన్న భూమిని అలాగే అట్టేపెట్టి కేవలం 13 భూస్వామి కుటుంబాల వద్దనున్న భూమిని మాత్రమే తీసుకుని తిరిగి పంచినా 70 శాతంగా ఉన్న 143 కుటుంబాల స్థితీ, ఆ గ్రామంలో నేడు మధ్యతరగతి రైతులుగా ఉన్న 19 కుటుంబాల స్థాయికి పెరుగుతుంది. ఆరు ధనిక రైతు కుటుంబాల స్థితి అంతకంటె కొంచెం మెరుగ్గా ఉంటుంది. అప్పులు, లంచాలు, మామూళ్లు మొదలయిన దోపిడంతా రద్దుకావడం వల్ల గొర్రెల పెంపకందార్ల 15 కుటుంబాలకు కూడా అదనంగా భూమి లభించకపోయి నప్పటికీ, ఆర్థికస్థితి తప్పనిసరిగా మెరుగుపడుతుంది. కేవలం 13 భూస్వాముల కుటుంబాలు మాత్రమే దోపిడి ఫలితాన్ని కోల్పోతాయి. గ్రామానికి దోపిడీ పీడ విరగడవుతుంది. రైతాంగం దరిద్రాన్ని రద్దు చేయడం అంటే ఇదే. అంతేగానీ దోపిడీని చెక్కుచెదరకుండా కాపాడుతూ 'దరిద్రాన్ని పారదోల్తా' మంటూ ఎంత గొంతు చించుకొన్నా మంత్రాలకు చింతకాయలు రాలవు. కాంగ్రెస్ ప్రభుత్వపు సంస్కరణలు సంపూర్ణంగా అమలు జరిగినా ఆ గ్రామంలో భూ సంబంధాలలో కించిత్తయినా మార్పురాదు. మహా అయితే అక్కడ అప్పులకు మారిటోరియం లభిస్తుంది. అంటే అప్పులను రద్దు చేయకుండా చెల్లింపు కేవలం కొంతకాలం వాయిదా వేసి వడ్డీలు పెంచడం మాత్రమే జరుగుతుంది.

ఇక నిజమైన వ్యవసాయ విప్లవం ఫలితాలకూ నేటి స్థితికీ మధ్య ఉండే తేడాను పట్టికలోని లెక్కల్లో మరింత స్పష్టంగా కళ్లకి కట్టినట్టు చూడవచ్చు.

అదే జిల్లాలో మరో గ్రామం తీసుకుందాం. 'బి' అనే ఈ గ్రామం కూడా బెల్లంపల్లి బొగ్గు గనుల పరిసర ప్రాంతంలోనిదే. ఇక్కడ భూములు కూడా ఏమంత శ్రేష్ఠమైనవి కావు. ఇక్కడా పంచాయితీ బోర్డు ఉంది. దాని ఆదాయం సంవత్సరానికి ఐదు వేలు. 196 మంది సభ్యులతో కో-ఆపరేటివ్ పరపతి సంఘం ఉంది. అది అప్పులిచ్చే మొత్తం రు. 40 వేలు. పాలేరు జీతం నెలకు 6 కుంచాలు, అంటే 57 కిలోలు మాత్రమే. సాలు ఆఖరున ఇచ్చే ఇవ్వకాలు వగైరాలన్నీ కలిసి నెలకొక బస్తా గిట్టవచ్చు.

నాగు పద్ధతి పెద్ద ఎత్తునే కొనసాగుతూంది. చాకలి, మంగలి, వడ్రంగి వగైరాలకు పనిని బట్టి కూలిగాక, ఫ్యూడల్ పద్ధతిలోనే మేర రూపంలో మామూళ్లు ఇవ్వబడుతున్నాయి.

గ్రామంలో మొత్తం 260 కుటుంబాలున్నాయి. జనాభా 1,500 చిల్లర. మొత్తం భూమి – తరి 220 ఎకరాలు, కుష్కీ 1,886 ఎకరాలు ఉంది. మొత్తం 260 కుటుంబాలలో 115 కుటుంబాలకు భూమి ఏమీలేదు. ఇందులో 8 కుటుంబాలు గొర్రెల పెంపకం దార్లు. ఇద్దరు వ్యాపారస్తులు, ఇద్దరు ఉద్యోగస్తులు. వ్యవసాయంతో ప్రత్యక్ష సంబంధం లేని ఈ 12 కుటుంబాలతో పాటు, కేవలం వ్యవసాయం మీదనే ఆధారపడి బతికే 103 వ్యవసాయ కూలీ కుటుంబాలకు కూడా సెంటు భూమయినా లేదు. వ్యాపారస్తుల కుటుంబాలు నాలుగింటికి, ఉద్యోగస్తులు కుటుంబాలు తొమ్మిదింటికి మొత్తం 13 కుటుంబాలకు 29 ఎకరాల 3 గుంటల తరి, 206 ఎకరాల కుష్కీ భూమి ఉంది.

***భూసంస్కరణలు వ్యవసాయరంగ అభివృద్ధికే కాకుండా సాంఘిక న్యాయానికి, గ్రామీణ ప్రాంతాలలో కుల వ్యవస్థ ప్రాధాన్యతను తగ్గించడానికి, రాజకీయ అధికారంలో మార్పులు తేవడానికి దోహద పడతాయంటున్నారు* డా. సి. శ్రీనివాసులు**

(తెలుగు ఎకాడమీ ప్రచురణగా వచ్చిన డా. సి. శ్రీనివాసులు గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలు' నుంచి ఉపసంహారంగా వచ్చిన భాగాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాం -సం.)

# భూసంస్కరణలు - తీరుతెన్నులు

అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థిక, సామాజిక రాజకీయ అంశాలలో 'భూమి'కి అత్యంత ప్రాధాన్యత ఉంది. భారతదేశంలోని సాంఘిక నిర్మాణంలో భూమి ఉన్న వారికి ప్రాధాన్యత ఉండటం, 19వ శతాబ్ది నుండి వివిధ ప్రాంతాలలో జరిగిన రైతాంగ పోరాటాలు, ఉద్యమాలు, కాంగ్రెస్ రాజకీయాలలో దీనికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. హరిత విప్లవం ఫలితంగా వ్యవసాయోత్పత్తి గణనీయంగా పెరిగినప్పటికీ భూమి ప్రాధాన్యత తగ్గలేదు. దేశ ఆర్థికాభివృద్ధిలో వ్యవసాయరంగాన్ని అత్యంత ప్రాముఖ్యం గల రంగంగా ఇప్పటికీ గుర్తించడం జరుగుతున్నది. దక్షిణ ఆసియా దేశాలలోని దీర్ఘకాలిక ఆర్థికాభివృద్ధి విజయం లేదా ఓటమి వ్యవసాయ రంగంపై ఆధారపడి ఉంటుందని చెప్పడం అతిశయోక్తికాదు. భూసంస్కరణలు వ్యవసాయాభి వృద్ధికి ముఖ్యమైన అంశంగా పరిగణిస్తున్నారు. సాంఘిక, ఆర్థిక మార్పులకు గ్రామీణాభివృద్ధికి భూసంస్కరణలు 'ఇంజన్' లాంటిదనే అభిప్రాయం ఉంది.

భూసంస్కరణలు వ్యవసాయరంగ అభివృద్ధికే కాకుండా సాంఘిక న్యాయం చేకూర్చడానికీ, సాంఘిక వ్యవస్థ నిర్మాణంలో మార్పులు తేవడానికీ, గ్రామీణ ప్రాంతాలలో కుల వ్యవస్థ ప్రాధాన్యతను తగ్గించడానికీ గ్రామీణ అశాంతిని తగ్గించడానికీ, రాజకీయ అధికారంలో మార్పులు తేవడానికీ సహాయ పడతాయి. అందువల్లనే అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ముఖ్యంగా భారతదేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ అంశాలలో ప్రధానపాత్ర వహిస్తున్నాయి. భూసంస్కరణల ద్వారా వచ్చే భూమి మానవ సంబంధాలలో వచ్చే మార్పులు రాజకీయ అధికారంలోనూ, సాంఘిక వ్యవస్థలోనూ మార్పులు తీసుక వస్తున్నాయని గమనించడం జరిగింది. ఈ కారణంగానే మార్పులను ఆర్థికపరమైన విశ్లేషణకే కాక, రాజకీయ, సామాజిక విశ్లేషణ కోసం ఉపయోగించడం జరుగుతోంది. ఆర్థిక శాస్త్రవేత్తలు, రాజకీయ శాస్త్రవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు భూసంస్కరణలను అంతర్గత సంధాన విశ్లేషణగా భావిస్తారు.

---

నిజానికి ఈ కుటుంబాలకు భూమి ఉండవలసిన పని లేదు. పై భూమితో సహా ఈ గ్రామంలో మొత్తం భూమి ఎలా విభజించబడి ఉందో ఈ పట్టిక 4 తెలియపరుస్తుంది.

ఈ గ్రామంలోని మొత్తం 260 కుటుంబాలలో 25 కుటుంబాలు వ్యవసాయంపైన ఆధారపడినవి కావు. 232 కుటుంబాలు మాత్రమే కేవలం వ్యవసాయంపై ఆధారపడి ఉన్నాయి. అందులో 75 శాతంగా ఉన్న 175 కుటుంబాలకు సగటున కుటుంబానికి కేవలం 7 గుంటల (17 సెంట్లు) తరి, 1 ఎకరా 27 గుంటల (1 ఎకరం, 67 సెం.) కుష్కీ మాత్రమే ఉండగా, కేవలం ఐదు శాతంగా ఉన్న 33 కుటుంబాల వారికి సగటున కుటుంబానికి 6 ఎకరాల తరి, 50 ఎకరాలకు పైగా కుష్కీ భూమి ఉంది. ఈ 13 కుటుంబాల కింద ఆ భూమిని అలానే ఉంచి ఆ గ్రామంలోని 175 కుటుంబాల ఆర్థిక పరిస్థితి మెరుగుపర్చడం తలకిందులుగా తపస్సు చేసినా ఇందిరమ్మకు సాధ్యం కాదు. అందువల్ల తరతరాలుగా పై 175 కుటుంబాల పొట్టగొట్టి ఆ 13 కుటుంబాలు స్వాహా చేసుకున్న భూమిని, తిరిగి, నిత్య దరిద్రానికి అలవాలంగా తయారైన ఆ 175 కుటుంబాలకు పంచడం ఒక్కటే వారి ఆర్థిక స్థితిని మెరుగుపర్చడానికి గల ఏకైక మార్గం. కమ్యూనిస్టు పార్టీ (ఎం.ఎల్.) చెప్పే వ్యవసాయ విప్లవం అదే.

అలా చేస్తే ఆ 175 కుటుంబాలకూ సగటున కుటుంబానికి ముప్పాతిక ఎకరం తరి. 7 ఎకరాల కుష్కీ లభిస్తుంది. అప్పుడు వారి ఆదాయం ఇంచు మించు ఆ గ్రామంలోని మధ్యతరగతి రైతుల స్థాయికి చేరుతుంది. ఆ 175 కుటుంబాలకూ కలిసి ఇప్పుడు 70 జతల ఎద్లు ఉన్నాయి. అది అడవి సమీపగ్రామం కావడం వల్ల కొన్ని కుటుంబాలు కేవలం కిరాయిబళ్లు తోలుకొని బతుకు గడుపుతున్నాయని సులువుగానే ఊహించవచ్చు. పైన వివరించిన ప్రకారం భూమి పంపకం జరిగితే, వ్యవసాయం నుండి వచ్చే ఆదాయం మూలంగాగాని కిరాయిమూలంగా లభించే ఆదాయం వల్ల గాని వారి కొనుగోలు శక్తి తగినంతగా పెరిగి, దేశ పారిశ్రామికాభివృద్ధికి అది ఎంతగానో తోడ్పడుతుంది.

అయితే, భూసంస్కరణల గూర్చి గంపంత నోరు చేసుకొని అరిచే ప్రభుత్వానికి ఆ ఊళ్లో పంచడానికి ఒక్క సెంటైనా మిగులు భూమి దొరకలేదు. అంటే ఆ గ్రామంలో కేవలం వ్యవసాయంపైనే ఆధారపడి ఉన్న రైతు కుటుంబాలలో 75 శాతంగా ఉండి పొట్ట గడవక అలమటించే ఆ 175 కుటుంబాల సొద ఇందిరమ్మ సంస్కరణలకు ఏమీ పట్టదు. ఆ సంస్కరణలన్నీ కేవలం ప్రజల కళ్లుగప్పి మోసగించడానికీ, విప్లవాన్ని పక్కదారి పట్టించడానికి ఉద్దేశింపబడ్డ కపటనాటకాలు మాత్రమేననడానికి ఇంకా ఏమి తార్కాణం కావాలి? ◆

## ఇతర దేశాల అనుభవాలు

దేశ ఆర్థిక వృద్ధికి భూసంస్కరణలు ఆర్థికపరమైన వాతావరణాన్ని కలిగిస్తాయి. హరిత విప్లవానికి సంబంధించిన 'విత్తనాల మార్పు'కు కొన్ని దేశాలలో ఆర్థికపరమైన (భూసంస్కరణలు) వాతావరణాన్ని కల్పించకపోవడం వల్లనే వ్యవసాయరంగంలో గణనీయమైన అభివృద్ధి సాధించడం లేదని బ్రెన్ అభిప్రాయం. లాటిన్ అమెరికా దేశాలలో వ్యవస్థాపూర్వకమైన కౌలు ఒప్పందాలే వ్యవసాయాభివృద్ధికి ముఖ్యమైన నిరోధకాలని, వాస్తవంగా వ్యవసాయం చేసేవారికి యాజమాన్యపు హక్కులు కల్పిస్తే 'ఇసుకను కూడా బంగారం'గా మార్చగలరనే అభిప్రాయం. యూరోపియన్ దేశాల అనుభవాల ద్వారా గమనించవచ్చని డోరియన్ వారియర్ వాదన. జపాన్, తైవాన్ దేశాలలో వ్యవసాయ ఉత్పత్తి ఉత్పాదకతలో అత్యధిక అభివృద్ధిని సాధించడంలో భూసంస్కరణల పాత్ర గణనీయమైనదిగా గుర్తించడం జరిగింది. అంతేకాక భూసంస్కరణల వల్ల కమతపు పరిమాణం తగ్గుతుందని, దానివల్ల ఉత్పాదకత తగ్గుతుందనే విమర్శకు చిన్నకమతాల ద్వారా, అధిక ఉత్పాదకతను, ఉద్యోగితను, జీవన ప్రమాణాన్ని పొందవచ్చని జపాన్ అనుభవం ద్వారా స్పష్టమవుతోంది. స్వీడన్, సోవియట్ యూనియన్‌లలో భూసంస్కరణలు ఉద్యోగిత మీద వ్యతిరేక ప్రభావాన్ని చూపినప్పటికీ, ఈజిప్ట్, వెనిజులా, ఇరాన్‌లలో ఉద్యోగ అవకాశాలు పెరిగినట్లు గమనించవచ్చు.

చైనాలో, సోవియట్ రష్యాలో, భూమి పునః పంపిణీ వల్ల ఫ్యూడల్ భారాన్ని రద్దుపర్చడంవల్ల రైతాంగ డిమాండ్‌లను పరిష్కరించడమే కాక, విప్లవానికి నిరోధకంగా ఉన్న గ్రామీణ వ్యతిరేకతను నిర్మూలించడం జరిగింది. జపాన్‌లో కౌలుదార్లను యజమానులుగా మార్చడం వల్ల గ్రామీణ అశాంతిని (కౌలుదారుల సమ్మెలు) నిర్మూలించడం జరిగింది.

వివిధ దేశాల అనుభవాలు ఒకే రీతిలో లేవని పై విశ్లేషణ ద్వారా తెలుసుకోవచ్చు. అదే విధంగా భారతదేశంలో వివిధ దేశాలలో లాగా విజయవంతం కాలేదు. పూర్తిగా ఓటమిని పొందలేదు. భారతదేశంలోని భూసంస్కరణలు చైనాలో లాగా బ్రహ్మాండమైన విప్లవం పైకి వచ్చినవి కావు. జపాన్‌లో లాగా పై వర్గం నుంచి వచ్చిన నాటకీయ మార్పులు కాకపోవడమే దీనికి ముఖ్యకారణం. జపాన్, తైవాన్ దేశాల అనుభవాలను భారతదేశ అనుభవాలతో పోల్చి చూడరాదు. జపాన్, తైవాన్‌లలో 'దున్నే వారికే భూమి'ని ఇవ్వాలని భూసంస్కరణల ఉద్దేశం. కాని భారతదేశంలో, 'భూమిలేని వారికి భూమి' ఇవ్వాలనేది ముఖ్య లక్ష్యంగా ఉంది. అంతేకాక జపాన్‌లో సగటు కుటుంబానికి రెండు ఎకరాల కమతం నుంచి అధిక జీవన ప్రమాణానికి అవసరమయ్యే ఉత్పత్తిని సాధించగలుగుతున్నారు. ఈ దేశంలో సేద్యపు భూమిలో అరవై శాతం దాకా నీటి పారుదల సౌకర్యాలుండటం, వరి ధాన్యపు ధరను అధిక స్థాయిలో ఉంచడమే దానికి కారణం. కాని భారతదేశంలో సగటు కుటుంబానికి కనిష్ఠంగా సరిపోయే ఆదాయాన్ని, ఉద్యోగితను ఐదు ఎకరాల మెట్ట భూమి సమకూర్చగలుగుతుందని అనేక పరిశోధనల ద్వారా తెలిసింది. అంటే గరిష్ఠ జీవన ప్రమాణం పొందాలంటే హెచ్చు భూమి కావలసి ఉంటుంది. కాని దేశంలో నీటిపారుదల సౌకర్యాలున్న భూమి చాలా తక్కువ ఉండటమే కాక ప్రభుత్వం పంపిణీ చేసిన మిగులు భూములలో వ్యవసాయానికి పనికిరాని నాసిరకం భూములు అధికంగా ఉన్నాయి. అంతేకాకుండా ఈ భూములను సాగులోకి తేవడానికి కావలసిన పెట్టుబడి లబ్ధిదారుల (పేదవారు కావడంవల్ల) దగ్గర లేకపోవడం, వ్యవస్థాపూర్వకమైన విత్తసంస్థలు సహాయపడక పోవడంవల్ల వ్యవసాయోత్పత్తి అనుకున్న రీతిలో, అనుకున్నంత వేగంగా పెరగడం లేదు. వ్యవసాయం ద్వారా వచ్చిన ఆదాయంతో లబ్ధిదారులు కనీస జీవన ప్రమాణం కూడ పొందలేక పోతున్నారనడం అతిశయోక్తి కాదు, వాస్తవం.

## ఇతర రాష్ట్రాల అనుభవాలు

భారతదేశంలోని భూసంస్కరణ చట్టాలు ఆయా రాష్ట్రాలకు సంబంధించినవి. అంతేకాకుండా భూమి, యాజమాన్యం, రాజకీయ, సామాజిక విధానాలు, వ్యవసాయ సంబంధాలు వేరువేరుగా ఉన్నాయి. కాబట్టి ఈ సంస్కరణలు అమలు జరిగిన తీరు కూడా వేరువేరుగా ఉంది. కాని భూసంస్కరణల లక్ష్యాలు మాత్రం ఏకరీతిగా ఉన్నాయని చెప్పడంలో సందేహం లేదు. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మధ్యవర్తుల తొలగింపు చట్టాలను కౌలు సంస్కరణల చట్టాలను, గరిష్ఠ పరిమితి చట్టాలను ప్రకటించడం జరిగింది. రాష్ట్రాలలో ప్రభుత్వాలు (కాంగ్రెస్, వామపక్ష, ప్రాంతీయ పార్టీ ప్రభుత్వాలు) వేరుగా ఉన్నప్పటికీ చట్టాలు మాత్రం ఒకటిగానే ఉన్నాయి. అమలు పరిచే యంత్రాంగం (ట్రిబ్యునల్స్, అప్పిలేట్ ట్రిబ్యునల్స్, న్యాయస్థానాలు, రెవెన్యూ శాఖ) ఒకే రీతిగా ఉంది. అన్ని రాష్ట్రాలలోనూ లొసుగులు, మినహాయింపులు, కుటుంబం, సొంత వ్యవసాయ నిర్వచనంలో లోపాలున్నాయి. నష్టపరిహారం ప్రకటించడంలో అమితమైన ఔదార్యాన్ని ప్రకటించాయి. చట్టాల అమలులో అన్ని రాష్ట్రాలు కాలహరణకు, అధిక ఖర్చుకు, అధిక శ్రమకు గురయ్యాయి.

ఈ వ్యత్యాసాలు ఉన్నప్పటికీ, భూసంస్కరణల వల్ల కలిగిన ఫలితాలు మాత్రం వేరుగా ఉన్నాయి. దీనికి అనేక కారణాలున్నాయి. 1) భూస్వాముల ఆర్థిక, సాంఘిక బలంలో భేదాలు; 2) రాజకీయ సంకల్పంలో భేదాలు; 3) గ్రామీణ పేదల సంఘటిత శక్తిలో భేదాలు లేదా లబ్ధిదారుల చైతన్య తీవ్రతలో ఉండే భేదాలు.

ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ ప్రాంతంలో కౌలుదారీ చట్టాలు రావడానికి, వాటిని సక్రమంగా అమలు పర్చడానికి కౌలుదారుల చైతన్యమే కారణమని ఇంతకు ముందు తెలుసుకున్నాం. కొంకణిలో హెచ్చు మంది భూస్వాములు అనుపస్థిత భూస్వాములే కాకుండ, పట్టణాలలో నివసించడం వల్ల కౌలుదారులు తమ హక్కులను పరిరక్షించుకోవడం సులువయ్యింది. 'దేశ్'లో భూస్వాములు రైతులకంటే అధిక పలుకుబడి (రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా) గల వారైనందువల్ల చాలా సులువుగా కౌలుదారులపై ఒత్తిడి తెచ్చి తమంతకు తామే స్వచ్ఛందంగా భూములను వదులుకొనేటట్లు చేయగలిగారు. అంతేగాక బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో భూస్వాములకు అత్యధికమైన రాజకీయ పలుకుబడి ఉండటం వల్ల, చైతన్యరహితులైన రైతాంగం ఉండటం వల్ల భూస్వాములకు అనుగుణంగా చట్టాలు రూపొందించారు. ఈ కారణంగా ఈ రాష్ట్రాలలోని భూస్వాములు వ్యవసాయిక సంబంధాలలో, కులవ్యవస్థలో అత్యున్నత స్థాయిలో ఉండటం వల్ల కౌలుదారులను దోపిడీ చేయగలుగుతున్నారని. గరిష్ఠ పరిమితి కంటే హెచ్చు భూములను కలిగి ఉన్నారని, ప్రభుత్వ భూములను సులువుగా ఆక్రమించి లాభాలు పొందుతున్నారని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

కేరళ, పశ్చిమ బెంగాల్‌లలో ఒకవైపు వామపక్ష ప్రభుత్వాలు, వారి ఉద్యమాలు, మరొకవైపు చైతన్యవంతులైన రైతాంగం, సంఘటితమైన రైతు, కూలీ సంఘాలుండటం వల్ల తక్కువ లొసుగులతో చట్టాల నిర్మాణం సమర్థవంతమైన అమలు జరిగింది.

థియోడర్ బెర్జిమాన్ నాలుగు రాష్ట్రాల (కేరళ, పశ్చిమ బెంగాల్, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్) తులనాత్మకమైన పరిశీలనలో, భూసంస్కరణల అమలు తీవ్రతలోనూ, సమర్థతలోనూ భారతదేశంలో కేరళ రాష్ట్రం అగ్రగామిగా ఉందనీ, పశ్చిమ బెంగాల్ రెండో స్థానంలోనూ, కర్ణాటక మూడో స్థానంలోనూ, ఆంధ్రప్రదేశ్ చివరి స్థానంలో ఉందని తెలిపారు.

కేరళలో అక్షరాస్యత అధికంగా ఉండటం, చాలాకాలం నుంచి నిర్మాణాత్మకమైన రైతు కూలీ సంఘాలుండటం, ఈ సంఘాలను ఉభయ కమ్యూనిస్టు పార్టీలు బలపర్చడమే కాక, మార్గదర్శకులుగా ఉండటం, రాష్ట్ర ప్రభుత్వంలో వామపక్ష పార్టీలు భాగస్వాములు కావడం వల్లనే భూసంస్కరణల అమలు సక్రమంగా జరిగిందని చెప్పవచ్చు. అంతేకాక విధానసభ, ప్రభుత్వం, రైతు సంఘాల మధ్య పరస్పర సంబంధాలు ఉండటం, అనధికార సభ్యులను (లబ్ధిదారులను) భూసంస్కరణలను అమలు చేసే యంత్రాంగంలో / సంస్థలలో ప్రవేశపెట్టడం వల్ల నిర్ణయాలు చేసే ప్రక్రియలోనూ, వేగంలోనూ, సక్రమంగా అమలు పర్చడంలోనూ వీరి ప్రభావం హెచ్చుగా ఉండటం వల్ల భూసంస్కరణలు విజయవంత మయ్యాయి. దీనితో పాటు అమలుపర్చే యంత్రాంగాన్ని ప్రత్యేకంగా ఏర్పాటుచేయడం జరిగింది. ఆరువేల మంది సిబ్బందిని, 252 ట్రిబ్యునల్స్‌ను 57 తాలుకా భూమి బోర్డులను, నాలుగు అప్పిలేట్ యంత్రాంగాల్ని ఏర్పాటు చేయడం జరిగింది. దీనితో పాటు లబ్ధిదారులను ముఖ్యంగా పేదవారికి ఉపయోగపడే విధంగా విత్త మార్కెట్‌ను, ముఖ్యంగా సహకార పరపతి సంఘాలను అభివృద్ధి చేయడం జరిగింది.

పశ్చిమ బెంగాల్‌లో రాజకీయ అభీష్టం ఉన్న వామపక్షాలు దీర్ఘకాలంగా ప్రభుత్వంలో ఉండటం, గ్రామీణ ప్రాంతాలలోని పంచాయితీలు, కిసాన్ సభలు, భూసంస్కరణ చట్టాలను, సవరణలను తీసుకొనిరావడంలోనూ, అమలుపర్చడంలోనూ ఒత్తిడి తీసుకుని రావడం జరిగింది. అమలుపర్చే యంత్రాంగపు అధికారులలో భూమి పట్ల, భూస్వాముల పట్ల శ్రద్ధ లేకపోవడం వల్ల కౌలు సంస్కరణలను, గరిష్ఠ పరిమితి చట్టాన్ని మిగులు భూమి, ప్రభుత్వ భూమి పంపకాన్ని వేగంగా, సమర్థవంతంగా అమలు పర్చడం జరిగింది. ముఖ్యంగా కౌలు సంస్కరణల విషయంలో విప్లవాత్మకమైన ధోరణులను అనుసరించడం జరిగింది. కౌలుదారునికి ఉత్పత్తిలో 75 శాతం (ఖర్చులు భరిస్తే) భాగంగానూ వారసత్వపు హక్కు కల్పించడం, స్వచ్ఛందంగా భూములను వదలుకొన్న కేసులను పునఃపరిశీలన చేయడంతోపాటు కౌలుదారులను భూమి రికార్డులలో వేగంగా నమోదు చేసి (ఆపరేషన్ బార్‌గా) చట్టబద్ధమైన రక్షణ కల్పించడం జరిగింది. ఆపరేషన్ బార్‌గా పథకంలో 1978 ఆగస్ట్ వరకు (సుమారు పదకొండు నెలల కాలంలో) 7.33 లక్షల కౌలుదార్లను నమోదు చేయడం జరిగింది. ఈ పథకం ద్వారా నమోదు చేసిన కౌలుదార్లకు సబ్సిడీ మీద అప్పులివ్వడం, పరికరాలను, ఇతర సౌకర్యాలని అందించడం ద్వారా కౌలుదారుల ఆర్థిక పరిస్థితులలో మార్పులు తేవడం జరిగింది.

## ఆంధ్రప్రదేశ్ అనుభవాలు

ఈ రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధికి నిరోధకులుగా ఉన్న వ్యవసాయిక సంబంధాలలో మార్పులు తీసుకురావడానికి రెండు దశలుగా భూసంస్కరణల చట్టాలను ప్రవేశపెట్టడం జరిగింది.

మొదటి దశలో (1948 నుంచి 1970 వరకు) భూసంస్కరణల వల్ల జమీందారులు, జాగీర్దారులు, అనుపస్థిత భూస్వాములు తొలగిపోయారు. రైతులకు యాజమాన్యపు హక్కులు లభించాయి కాని ఈ అనుపస్థిత భూస్వాములు సొంత వ్యవసాయం అనే పేరుతో వేలాది ఎకరాల భూమిని ఆక్రమించి రైతాంగాన్ని వ్యవసాయ కూలీలుగా మార్చడం జరిగింది. అంటే ఈ చట్టం వల్ల అనుపస్థిత భూస్వాముల స్థానంలో రైతు యాజమాన్యపు పద్ధతి అమలులోకి వచ్చింది. కౌలుదారుల హక్కులను పరిరక్షించడానికి కౌలు సంస్కరణలను, భూకేంద్రీకరణను తగ్గించడానికి భూకమతాలపై గరిష్ఠ పరిమితిని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ చట్టాలనుంచి భూస్వాములు తమను తాము సంరక్షించుకోవడానికి భూమి యాజమాన్యంలో పెద్ద ఎత్తున అక్రమమైన మార్పులు చేశారు. కౌలుదార్లను వెళ్లగొట్టి సొంత వ్యవసాయం చేయడం జరిగింది. దీనివల్ల కౌలువిధానం తగ్గిపోయింది. ప్రభుత్వం గరిష్ఠ పరిమితిని చాలా ఉదారంగా గరిష్ఠ స్థాయిలో నిర్ణయించడం వల్ల వేలాది ఎకరాల సారవంతమైన భూములను వివిధ మార్గాల ద్వారా చాలా సులువుగా తమ స్వాధీనంలో ఉంచుకోవడం జరిగింది. గ్రామీణ అశాంతిని ఈ సంస్కరణల ద్వారా తగ్గించాలనే లక్ష్యంతోపాటు భూదాన ఉద్యమం ద్వారా భూయాజమాన్యంలో స్వచ్ఛందంగా మార్పులు తేవడానికి ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది.

తెలంగాణ రైతాంగ పోరాటాల, జమీందారి వ్యతిరేక పోరాటాల ఒత్తిడి వల్లనూ, కమ్యూనిస్టుల ప్రభావాన్ని తగ్గించాలనే ఉద్దేశంతోనూ భూసంస్కరణలు ఆ చట్టాలను వేగంగా తేవడానికి, అమలుపర్చడానికి ప్రయత్నాలు జరిగాయి. దీనివల్ల కొంతమంది రైతులు లాభం పొందినప్పటికి కౌలుదారులు రక్షిత కౌలుదారులుగా యాజమాన్యపు హక్కులు పొందినప్పటికీ, అక్రమమైన నోటిమాట ద్వారా కౌలుకు ఇచ్చే విధానం పెరిగింది.

మొదటి దశలో వచ్చిన చట్టాల వల్ల ఆశించిన ఫలితాలు రాకపోవడం వల్ల 1969 నుంచి రైతాంగ పోరాటాల ఉద్రిక్తత, రాజకీయ సంక్షోభం, హరిత విప్లవం వల్ల విస్తృతమైన ఆదాయ అసమానతలు, గ్రామీణ అశాంతి మొదలైన కారణాల వల్ల గరిష్ఠ పరిమితిని తగ్గించడానికి కౌలు సంస్కరణలలో సవరణలను భూమి రికార్డులను తయారు చేయడానికి రెండో దశలో చట్టాలను రూపొందించడం జరిగింది.

## చట్టాల అమలు

ఆంధ్రప్రదేశ్‌లో మొదటి దఫా భూసంస్కరణలు, రైతాంగ ఉద్యమాలు, చైతన్యవంతులైన రైతాంగం అధికంగా ఉన్న ప్రాంతాలలో సక్రమంగాను, వేగంగాను అమలు జరిగాయి. హైదరాబాద్ రాష్ట్రంలోని కర్ణాటక, మరాఠా ప్రాంతాల కన్నా సాయుధ పోరాట తీవ్రత హెచ్చుగా ఉన్న తెలంగాణ ప్రాంతంలో చట్టాల వల్ల హెచ్చు ప్రయోజనం లభించింది. చట్టాల నిర్మాణంలోనూ అమలులోనూ తెలంగాణ, ఆంధ్ర

ప్రాంతాలకు చాలా వ్యత్యాసముంది. తెలంగాణ ప్రాంతంలోని చట్టాలలో లొసుగులు తక్కువగా ఉండటం చట్టాలకు విపరీతైన ప్రచారం (పబ్లిసిటీ) ఇవ్వడం, సంఘటిత ఉద్యమాల వల్ల రైతులలో చైతన్యం, మానసిక స్థైర్యం పెరగడం వల్ల, కోర్టులు, అధికారులు కౌలుదారుల పట్ల దయాగుణం చూడపం వల్ల, కమ్యూనిస్టుల ప్రభావాన్ని తగ్గించడానికి అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీకి రాజకీయ అభీష్టం ఉండటం వల్ల ఈ చట్టాలను సక్రమంగానూ, వేగంగానూ అమలు పర్చడానికి కారణమయ్యాయి.

ఆంధ్ర ప్రాంతంలోని రైతాంగం చైతన్యవంతులైనప్పటికి, రాజకీయాధికారం ఉన్న లేదా గ్రామీణ ఓటు బ్యాంకులకు ప్రతినిధులుగా భూస్వాములుండటం వల్ల, కోర్టులు భూస్వాములకు అనుకూలంగా తీర్పులివ్వడం, పరిపాలనా యంత్రాంగం భూస్వాములకు అనుకూలంగా ఉండటం, ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ తమ ప్రభావాన్ని కోల్పోవడం వల్ల అధికార కాంగ్రెస్‌కు రాజకీయ అభీష్టం తగ్గిపోవడం మొదలైన కారణాలవల్ల ఈ ప్రాంతంలో మొదటి దఫా భూసంస్కరణల వల్ల ప్రయోజనం తక్కువగా ఉంది.

రెండో దశలో భూసంస్కరణలు (1970 తరువాత) కాంగ్రెస్ పార్టీ రాజకీయ అభీష్టంతో ప్రారంభించినప్పటికి, రాజకీయ చదరంగంలో భూస్వాముల ప్రాతినిధ్యం ఏమాత్రం తగ్గలేదు. అందువల్లనే వారికి కొన్ని మినహాయింపులు అధిక మొత్తంలో నష్టపరిహారం, అనేక లొసుగులు చట్టాలలో చోటు చేసుకున్నాయి. చట్టానికి అనుగుణంగా మార్పులు చేసుకోవడానికి కావలసినంత సమయం ఇవ్వడం జరిగింది. దీనికి తోడు పరిపాలన యంత్రాంగపు కొరత భూస్వాములకు అదనపు అనుకూలతను ఏర్పరిచింది.

రెండో దశలో వచ్చిన చట్టాలు, వాటి అమలులో చాలా వ్యత్యాసముంది. చట్టాలలో ఉండే లొసుగులు, చట్టాల అమలులో ఆలస్యం, రాబోయే చట్టాల వల్ల జరగబోయే నష్టాన్ని ఊహించి అక్రమమైన మార్పులు చేయడం, న్యాయస్థానాల జోక్యం అధికంగా ఉండటం, ప్రభుత్వ యంత్రాంగపు నిర్లక్ష్య ధోరణి, రాజకీయ అభీష్టపు కొరత మొదలైనవన్ని భూసంస్కరణల అమలులో తీవ్రమైన నిరోధకాలుగా మారాయి. ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణలకు విపరీతమైన ప్రచారం జరిగినప్పటికి పెద్దగా ఏమి సాధించలేదని థియోడర్ బెర్గ్‌మాన్ అభిప్రాయం. భూస్వాములు సంఘటితంగా ఉండటమే కాక, 1948 నుంచి ఏకైక అధికార పార్టీ అయిన కాంగ్రెస్‌లో వీరికి బలమైన పలుకుబడి, ప్రభావం ఉన్నాయని, రైతు సంఘాలు, వామపక్ష పార్టీలు చాలా బలహీనంగా ఉండటం వల్ల భూస్వాములపై పరిపాలనా వ్యవస్థపై ఒత్తిడి తేలేకపోయాయని వీరి అభిప్రాయం.

## భూకమతాల పరిమాణాలలో వచ్చిన మార్పులు

1970-71లో పది హెక్టార్ల కంటె హెచ్చు పరిమాణమున్న కమతాలు 2.33 లక్షల (4.3 శాతం) నుంచి 1980-81లో 1.55 లక్షలకు (2.1 శాతం), 1986-87లో 1.46 లక్షలకు (1.8 శాతం) తగ్గాయి. వీరి ఆధ్వర్యంలో ఉండే భూమి 1970-71లో 41.74 లక్షల హెక్టార్లు (30.7 శాతం) నుంచి 1980-81లో 27.95 లక్షల హెక్టార్లకు (19.5 శాతం)1986-87లో 23.94 లక్షల హెక్టార్లకు (16.9 శాతం) తగ్గింది. అదే విధంగా నాలుగు హెక్టార్ల కంటే హెచ్చు పరిమాణం గల కమతాల శాతం 1970-71 నుంచి 1986-87 వరకు 17.0 శాతం నుంచి 9.8 శాతానికి తగ్గిపోయింది. వీరి ఆధ్వర్యంలో ఉండే భూమి కూడా ఇదే సంవత్సరాల మధ్య 61.5 శాతం నుంచి 44.2 శాతానికి తగ్గింది.

దీనికనుగుణంగా ఉపాంత కమతాల, చిన్న కమతాల సంఖ్య, వీటి భూవైశాల్యం పెరిగాయి. 1970-71, 1986-87 మధ్యకాలంలో ఉపాంత కమతాలు 19.68 లక్షలు (79 శాతం), చిన్న కమతాలు 6.49 లక్షలు (61 శాతం), ఉపమధ్య కమతాలు 3.12 లక్షలు (33 శాతం) పెరిగాయి. కాని మధ్యతరగతి కమతాలు 5 శాతం, పెద్ద కమతాలు 37 శాతం తగ్గాయి.

భూమి వైశాల్యంలో ఉపాంత కమతాలలో 89 శాతం, చిన్న కమతాలలో 60 శాతం, ఉప మధ్య కమతాలలో 30 శాతం పెరుగుదల కనిపించింది. కాని మధ్య కమతాలలో 8 శాతం, పెద్ద కమతాలలో 43 శాతం తగ్గుదల ఉన్నట్లు గమనించవచ్చు.

పై గణాంక వివరాలను బట్టి చిన్న కమతాల సంఖ్య పెరిగి, పెద్ద కమతాల సంఖ్య తగ్గాయని తెలపవచ్చు. అయితే భూ సంస్కరణల వల్ల ఈ మార్పులు సంభవించాయని కచ్చితంగా చెప్పలేం. 1970-80ల మధ్య కాలంలో చిన్న కమతాలు, ఉపాంత కమతాల సంఖ్య 10 లక్షలు పెరిగాయి కాని గరిష్ట పరిమితి ద్వారా 4.37 లక్షల భూమిలేని పేదలకు 5.11 లక్షల ఎకరాల భూమి పంపిణీ చేయడం జరిగింది. మొత్తం భూమిలో 3.4 శాతం మాత్రమే భూసంస్కరణల ద్వారా పునఃపంపకం జరిగింది. ఈ విశ్లేషణ ప్రకారం భూమి కమతాలలో భూసంస్కరణల ఫలితంగా పెద్దగా మార్పులు రాలేదని చెప్పవచ్చు. ఈ రెండు దశాబ్దాల కాలంలో జనాభా పెరగడం వల్ల వారసత్వపు చట్టాల వల్ల కమతాల విభజన, విఘటన జరిగి చిన్న కమతాల సంఖ్య పెరిగింది. పూర్వం అనుపస్థిత భూస్వాములు, పెద్ద రైతులు భూములను కొనుగోలు చేసేవారు కాని గరిష్ఠ పరిమితి చట్టం ఏర్పరిచిన భయం వల్ల కొనుగోళ్లు ఆపేశారని హరిత విప్లవ ఫలితంగా లాభాలు అధికమైన మార్కెట్ ప్రోత్సాహాల ప్రక్రియ పెరిగి భూయాజమాన్యంలో మార్పులు వచ్చాయని తెలపవచ్చు. అందువల్లనే చిన్న కమతాల సంఖ్య పెరిగింది.

## భూమి యాజమాన్యంలో మార్పులు

భూసంస్కరణల వల్ల జమీందారులు, జాగీర్దారులు, అనుపస్థిత భూస్వాముల స్థాయి నుంచి రైతు యాజమాన్యంలోకి మారారని చెప్పవచ్చు. అంటే ఆస్తి సంబంధాలలో, ఆదాయ స్థాయిలలో మౌలికమైన మార్పులు ఏమీరాలేదు. భూసంస్కరణల వల్ల, హరిత విప్లవం వల్ల భూమి యాజమాన్యం గ్రామాలలో నివసించని వారి చేతుల్లో నుంచి, అనుపస్థిత భూస్వాముల నుంచి, రైతు యజమాన్యంలోకి, గ్రామాలలో నివసించే వారి చేతుల్లోకి మారిపోయింది.

## కౌలు విధానాలలో మార్పులు

మొదటి దశ కౌలుదారీ సంస్కరణ వల్ల కౌలుదారుల స్థితిగతులలో రక్షిత కౌలుదార్లకు కొంత లాభం జరిగింది. కాని ఆ తరువాత ఈ చట్టాల భయం వల్ల నోటిమాట ఒప్పందాలు, దాచి ఉంచిన కౌలు

ఒప్పందాలు, రికార్డు చేయని కౌలు ఒప్పందాలు అధికం అయ్యాయని చెప్పవచ్చు. ఈరకమైన కౌలు ఒప్పందాలలో పంటలో భాగం, స్థిరమైన పంట, స్థిరమైన నగదు రూపంలో అత్యధికమైన కౌలు చెల్లించడం జరుగు తున్నదని చెప్పవచ్చు. కౌలుదారీ సంబంధాలను రికార్డు చేసే విధానం అమలులో లేనందువల్ల చట్టపరమైన రక్షణ పొందలేక పోతున్నారు.

కౌలు సంస్కరణల వల్ల వచ్చిన మార్పులకంటే హరిత విప్లవం ద్వారా కౌలు విధానాలలో వచ్చిన మార్పులను గమనించవచ్చు. హరిత విప్లవానికి పూర్వం పెద్ద కమతపుదార్లు, గ్రామంలో నివసించని వారు చిన్న కమతపుదార్లకు, భూమి లేని పేదలకు కౌలుకు ఇచ్చే విధానం ఉండేది. కాని హరిత విప్లవపు ప్రభావం వల్ల వ్యవసాయం లాభసాటిగా మారడం వల్ల పెద్ద కమతపుదార్లు కౌలుదార్లను వెళ్లగొట్టడం జరిగింది. దీనివల్ల కౌలుదార్ల సంఖ్య తగ్గింది. అంతేకాకుండా వ్యవసాయ కార్యకలాపాల్లో యాంత్రీకరణ పెరగడం వల్ల ఖర్చు అధికమైనందు వలన చిన్న కమతపుదార్లు వ్యవసాయాన్ని లాభసాటిగా నిర్వహించలేకపోవడం (తగినంత పెట్టుబడి వీరి దగ్గర లేకపోవడం) వల్ల చిన్న, ఉపాంత కమతపుదార్లు తమ కమతాలను పెద్ద కమతపుదార్లకు కౌలుకు ఇవ్వడం జరుగుతున్నది.

### భూసంస్కరణల ఫలితాలు

ఆంధ్రప్రదేశ్‌లోని భూసంస్కరణల నిర్మాణంలోనూ అమలులోనూ అనేక లొసుగులు ఉన్నప్పటికీ ఈ సంస్కరణల వల్ల కొంత ప్రయాజనం చేకూరిందని చెప్పవచ్చు. కౌలు సంస్కరణల వల్ల 1979 వరకు 46,000 కౌలుదార్లు, 2.82 లక్షల ఎకరాల భూమికి యాజమాన్యపు హక్కులు పొందారు. గరిష్ఠ పరిమితి చట్టం వల్ల 1992 వరకు 4.37 లక్షల భూమిలేని పేదలు 5.11 లక్షల ఎకరాలకు యజమానులయ్యారు. ప్రభుత్వం భూముల పంపకం వల్ల 19.13 లక్షల మంది 36.33 లక్షల ఎకరాలు పొందారు.

### ముగింపు

కౌలు సంస్కరణల అమలుకు అనేక అనువైన పరిస్థితులు కల్పించవలసి ఉంటుంది. శాసనాలు సులభంగా అవగాహనకు, ఆచరణకు అనుకూలంగా ఉండాలి. కౌలుదారుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ బలహీనతల కారణంగా ఏర్పడే సమస్యలను ఎదుర్కోడానికి తగిన పరిపాలనా యంత్రాంగం కౌలుదారులకు అందుబాటులో ఉండాలి. వివిధ రకాలకు చెందిన కౌలు విధానాల పట్టాలను తయారు చేయడమే కాక, రెవెన్యూ రికార్డులలో నమోదు చేయించాలి. కౌలుదారులలో శాసనాల పరిజ్ఞానాన్ని, మానసిక ధైర్యాన్ని పెంపొందించాలి.

భూకమతాలపై గరిష్ఠ పరిమితి చట్టాన్ని సక్రమంగా అమలు పర్చడానికి చట్టపరమైన చర్యలు తీసుకోవాలి. మిగులు భూముల వివరాలను దాచి ఉంచడం, 'బినామి' మార్పులను చేయడం, అక్రమ మార్గాన్ని అనుసరించడం చేసే వారిని కఠినంగా శిక్షించాలి. మిగులు భూములు పొందిన లబ్ధిదారులు తిరిగి అమ్ముకోవడాన్ని, తాకట్టు పెట్టడాన్ని పూర్తిగా నిషేధించాలి. వ్యవసాయం చేసుకోవడానికి వీరికి కావలసిన విత్త సహాయాన్ని వ్యవస్థాపూర్వకమైన విత్త సంస్థల ద్వారా పొందేటట్లు చూడాలి. మిగులు భూముల పంపకం మాత్రమే భూసంస్కరణల లక్ష్యం కారాదు. ఆ మిగులు భూముల నుంచి అత్యధిక ఉత్పాదకత సాధించడానికి కావలసిన సహాయక చర్యలు చేపట్టాలి. అంతేకాక హరితవిప్లవంవల్ల ఎకరా ఉత్పాదకత వ్యవసాయక ఆదాయాలు పెరిగాయి. దీనికనుగుణంగా గరిష్ఠ పరిమితిని తగ్గించడానికి కూడ ప్రభుత్వం పునరాలోచన చేయాలి.

వ్యవసాయానికి యోగ్యమయ్యే ప్రభుత్వ భూముల పంపకంలో ఏర్పడిన అవరోధాలను, సమస్యలను పరిష్కరించి వాటి ద్వారా అత్యధిక ఉత్పత్తిని సాధించే ప్రయత్నాలు చేయాలి.

భూసంస్కరణల ప్రయోజనాలను లబ్ధిదారులకు అవగాహన అయ్యే విధంగా విద్యా విస్తరణ, రాజకీయ చైతన్యం పెంపొందించాలి. దీనితోపాటు, ప్రభుత్వేతర సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, రైతు సంఘాలు వ్యవసాయ కూలీల సంఘాలు, భూ సంస్కరణల అమలులో ప్రధాన పాత్ర వహించేటట్లు చూడాలి. ఈ సంస్థలకు భూ సంస్కరణలను అమలు పర్చే యంత్రాంగంలో అంటే గ్రామ, మండల్, జిల్లా కమిటీలలో, సముచితమైన స్థానమిచ్చి, వారి ప్రయోజనాలను వారే కాపాడుకొనే స్థితిలోకి తీసుకువెళ్లాలి. గ్రామీణ పేదలు సంఘటితమైన చైతన్యవంతులై వారి హక్కులను కాపాడుకొనేటప్పుడు భూస్వాముల నుంచి సహజంగా వ్యతిరేకత వస్తుంది. అది గ్రామీణ అశాంతికి కారణమవుతుంది. అటువంటి సమయాల్లో ప్రభుత్వయంత్రాంగం, పోలీసుయంత్రాంగం, గ్రామీణ పేదల సంఘటిత ఉద్యమాలను అణచివేయడానికి ప్రయత్నించకుండ కొంత ఔదార్యం చూపాలి. వాస్తవికమైన చట్టమైన అంశాలకు ప్రాముఖ్యం ఇచ్చి వారి హక్కులను కాపాడాలి.

భూసంస్కరణల అమలులో రాజకీయ అభీష్టం, అన్ని వర్గాల ప్రజల సహకారం కూడా చాలా అవసరం. అన్ని స్థాయిలలోనూ అందరూ సహకారం అందించినప్పుడే ఈ సంస్కరణలు సత్ఫలితాలను ఇస్తాయి.

గ్రమీణ పేదల ఆర్థిక జీవనంలో పెరుగుదలను వ్యవసాయాభివృద్ధిని సాధించడానికి భూసంస్కరణలు ప్రధానపాత్ర వహించాలనే సత్ సంకల్పం ఉన్నప్పటికీ గత యాభై సంవత్సరాలలో ఈ రెండు సమస్యలను సమూలంగా పరిష్కరించలేకపోయాం. విప్లవాత్మకమైన భూమి పునః పంపిణీ ద్వారా వ్యవసాయరంగ నిరోధకాలను తొలగించడం సాధ్యం కాకపోవచ్చనే వాదనలో అతిశయోక్తి లేదు. అదనంగా పెరుగుతున్న గ్రామీణ జనాభా దృష్ట్యా, గ్రామీణ పేదల భూమి ఆకలి విపరీతంగా పెరుగుతోంది. భూమిపై భారం పెరుగుతోంది. ఈ భారాన్ని తగ్గించడానికి భూసంస్కరణలతో పాటు ఇతర అంశాలను కూడ పరిశీలించాలి.

భారత ప్రభుత్వం గత 30-40 సంవత్సరాల నుంచి అనేక గ్రామీణాభివృద్ధి పథకాలను రూపొందించడం జరిగింది. అయితే ఇవి స్వల్పకాలానికి సంబంధించిన పథకాలు. స్వల్పకాలంలో ఉద్యోగ అవకాశాలు, ఆదాయాల సృష్టి జరుగుతున్నవి. కాని ఈ పెరుగుదల దీర్ఘకాలం కొనసాగడం లేదు. అందువల్ల గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర రంగాలు అభివృద్ధి చెందాలి. వ్యవసాయేతర రంగాలలో ఉద్యోగ అవకాశాలను కల్పించి వారి ఆర్థిక, సాంఘిక జీవనంలో మార్పులు తీసుకురావాలి. భారతదేశ వ్యవసాయరంగ సమస్యల పరిష్కారానికి గ్రామీణ, పట్టణ పారిశ్రామికీకరణ ప్రధానమైన నివారణోపాయమని గుర్తించి దీనికోసం దీర్ఘకాలిక ప్రణాళికను రూపొందించుకోవలసిన అవసరాన్ని మన తక్షణ కర్తవ్యంగా గుర్తించాలి. ◆

*గ్రామాలలో భూమి ఎవరి చేతుల్లో ఉందో వారిదే గ్రామంలో పెత్తనమని, అందుకనే వారు, వారిని బలపరిచే ప్రభుత్వాలు భూసంస్కరణలను వ్యతిరేకిస్తున్నారని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# వ్యవస్థ మార్పుతో ముడిపడిన భూసంస్కరణలు

ఛాందసవాదుల చెరనుంచి తెలుగు భాషకు విముక్తి కలిగించి ప్రజల భాషకు పట్టం కట్టిన గిడుగు రామమూర్తి చేసిన కృషి ఓ సంస్కరణ. విధవా వివాహాలకు శ్రీకారం చుట్టిన కందుకూరి వీరేశలింగం పంతులు చేసిన కృషి ఓ సంస్కరణ. బాల్య వివాహాలకు తెరదించటం ఓ సంస్కరణ. అలాగే వందల వేల ఎకరాల భూమికి యజమానులైన జమీందార్ల, జాగీర్దార్ల, ఫ్యూడల్ వ్యవస్థ నుంచి భూమికి విముక్తి కలిగించడమే భూసంస్కరణలు. ఈ వ్యవస్థ ఎంత దారుణమైనదంటే పూర్వపు మద్రాసు రాష్ట్రంలోని రైతువారీ ప్రాంతంలో యాభై ఎకరాలకు మించి ఉన్న భూస్వాముల సంఖ్య 14 వేల మంది ఉండగా వారి యాజమాన్యంలో 19 లక్షల ఎకరాలున్నాయని, నెల్లూరు జిల్లాలో యాభై శాతం భూమి, తూర్పు గోదావరి జిల్లా మొత్తం భూమిలో డెబ్బై శాతం జమీందార్ల కబ్జాలో ఉండేదని అప్పటి ప్రభుత్వ లెక్కలు చెబుతున్నాయి. పూర్వపు నైజాం రాష్ట్రంలో 14 వేల భూస్వాముల చేతుల్లో 19 లక్షల ఎకరాలున్నాయి. ఖమ్మం జిల్లాలో ఒక భూస్వామికి ఒక లక్ష ఎకరాలున్నట్లుగా తెలుస్తోందని హెచ్.డి. మాలవ్యా, పి. సుందరయ్య రచించిన పుస్తకాలు తెలియజేస్తున్నాయి. ప్రణాళికా సంఘం మాజీ అధ్యక్షులు ప్రొఫెసర్ డి.ఆర్. గాడ్గిల్ కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో ఇంత భూమి ఉండటం సమర్థనీయం కాదని అన్నారు. కాగా ప్రస్తుత సామాజిక రాజకీయ వాతావరణంలో భూమిని సమానంగా పంచి పెట్టడం ఎంతైనా సహేతుకం, సమర్థనీయం.

ఏం ఉంటేనేం? ఆ జమీందారు, జాగీర్దారు సంపాదించుకొన్నది అనుభవిస్తున్నాడు అని ఎవరికైనా అనిపించవచ్చు. మిలియన్లు, బిలియన్ల డాలర్ల ఆస్తులున్న వారు ఇవాళ లేరా? వారి ఆస్తులను పంచి పెట్టమంటున్నామా? భూములు మాత్రం ఎందుకు జమీందార్లు, దేశముఖ్‌ల నుంచి తీసుకొని పంచిపెట్టాలి? నేటి యువతరానికి అలా ప్రశ్నించటం సహజమే కావచ్చు. ఈ ప్రశ్నకు క్లుప్తంగా జవాబు చెప్పాలంటే 1) సాంఘికంగా జరుగుతూ వచ్చిన అణచివేతను, అన్యాయాన్ని అరికట్టి ఆదాయంలో అసమానతలను తొలగించవచ్చు; 2) వ్యవసాయ రంగంలో స్వయం ఉపాధి కల్పించవచ్చు; 3) వ్యవసాయ ఉత్పత్తిని ఇతోధికంగా పెంచవచ్చు. ఆ రోజుల్లో వందల వేల ఎకరాలు కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో ఉండడంతో వారికి వారి భూమి ఎక్కడ ఏ జిల్లాలో ఎంత ఉందో తెలియనే తెలియదు. అందువల్ల వందల ఎకరాల భూములు పడావుగా పడి ఉండేవి. భూమి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం కావడంతో గ్రామాల్లో వారే పెత్తనం సాగించేవారు. సాంఘిక జీవనాన్ని శాసిస్తూ, రైతాంగాన్ని దోపిడీకి గురిచేస్తూ వచ్చారు. రెండో పక్క భూమిలేక వేలమందికి ఉపాధి లంభించేది కాదు. 'నీబాంచ'నంటూ జాగీర్దార్లు, దేశముఖ్‌లు చేయి విదిల్చిందే మహాభాగ్యంగా బతుకు వెళ్లదీసేవారు. భూస్వాములకు వేల ఎకరాల భూములుండవచ్చు గాని అంత భూమిని సాగు చేయడానికి కావాల్సిన పెట్టుబడి, మంది మార్బలం ఉండేది కాదు. కాగా భూమి ఉంది. బంగారం పండించవచ్చు. కాని పండించలేకపోవటంతో తిండి గింజల ఉత్పత్తి చేయగలిగినంత చేయలేక పోవటం, ఫలితంగా కరువు కాటకాలు, ఆకలి చావులు సంభవించేవి. బ్రిటిష్, నైజాం పాలనల్లో కరువు కాటకాలు తరచుగా వస్తుండేవి.

గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయాధారిత ప్రజల దీనగాథలు అప్పటి నాయకత్వం గ్రహించక ముందే రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. బ్రిటిష్ ప్రభుత్వం వాటిని క్రూరంగా అణచివేయటం జరిగింది. వారికి విముక్తి కలిగించాలి. ఎలా? స్వాతంత్ర పోరాటం అంటే విదేశీ పాలన నుంచి విముక్తి పొందటమే కాదని, భూస్వాముల దోపిడీ నుంచి ప్రజలను, ముఖ్యంగా రైతాంగాన్ని విముక్తి చేయటమేనని స్వాతంత్రోద్యమనేత గాంధీ అన్నారు. 1917-18లోనే గాంధీ చంపారన్ (బీహార్) రైతు విముక్తి పోరాటం ప్రారంభించారు. స్వాతంత్ర పోరాటంలో భాగంగా రైతాంగ పోరాటాలు జరిగాయి. నెహ్రూ కూడా 1928లోనే ఉత్తరప్రదేశ్ రాజకీయ సభల్లో మాట్లాడుతూ 'భూస్వామ్య విధానం కాంగ్రెస్ పోరాట కార్యక్రమంగా ఉండాల'న్నారు.

1931 కరాచీ కాంగ్రెస్ సభలో జమీందారీ వ్యవస్థను రద్దు చేయాలని తీర్మానించి 1936 సభలో వ్యవసాయ కార్యక్రమాన్ని రూపొందించటం జరిగింది. 1936 ఎన్నికల ప్రణాళికలో మధ్యవర్తులను తొలగిస్తామనే అంశాన్ని చేర్చారు గాని వారికి నష్టపరిహారం ఇస్తామనటం అప్పట్లో అది మధ్యవర్తులకు లొంగుబాటుగా భావించబడింది. జస్టిస్ పార్టీని ఓడించి గెలిచి అధికారంలోకి వచ్చి వివిధ రాష్ట్రాల్లో వివిధ రకాలైన భూసంస్కరణల చట్టాలు తీసుకొచ్చాయి. టంగుటూరి ప్రకాశం ఆధ్వర్యాన జమీందారీ విధానంలోని రైతాంగం పరిస్థితులను పరిష్కరించడానికి ఒక కమిటీని నియమిస్తే రైతులకు అనుకూలంగా కొన్ని సూచనలు చేసింది. కాని, జమీందారీ విధానం రద్దు చేయాలనే సూచన మాత్రం చెయ్యలేదు. అయితే రైతుల అప్పులు, బకాయిలు తగ్గించడానికి అగ్రికల్చరల్ రిలీఫ్ చట్టాన్ని ప్రవేశపెట్టారు. 1946లో జరిగిన ఎన్నికల అనంతరం కాంగ్రెస్ మళ్లీ అధికారంలోకి వచ్చినపుడు మాత్రం 1947లో జమీందారీ రద్దు బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టారు.

గోడ మీద రాతను గమనించిన కొంతమంది జమీందారులు కాంగ్రెస్‌లో చేరారు కూడా.

శాసనసభల్లో చట్టరీత్యా కాంగ్రెస్ ప్రభుత్వాలు తీసుకొంటూ వచ్చిన కొన్ని చర్యలు అనేక రైతాంగ పోరాటాల ఫలితమేనని చెప్పాలి. ఒక పక్క సభలు, సమావేశాలు ఊరేగింపులు, తీర్మానాలు, శ్రీకాకుళం నుంచి మద్రాస్ వరకూ కాలి నడకన జరిగిన రైతు యాత్రలు జరగగా, రెండో పక్క రైతుల మీద పన్నులకు వ్యతిరేకంగా జమీందారీ విధానానికి వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరిగాయి. చల్లపల్లి జమీందారుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు చారిత్రాత్మక పోరాటాన్ని జరిపారు. ఈ పోరాటాల ప్రభావం ప్రభుత్వం మీద పడి ఏదో రకమైన భూసంస్కరణలను తీసుకొనిరాక తప్పలేదు.

**తెలంగాణలో**

నైజాం పరిపాలనలో జాగీర్లు, సంస్థానాలు, ఈనాందార్లు, సర్ఫేఖాస్, దీవానాలు ఉండేవి. వీటి అధిపతులంతా నైజాంకు సలాం చేసినందుకు, తదితర సేవలు చేసినందుకు నజరానాగా ఇచ్చిన భూమి తప్ప వారేమీ కాయకష్టం చేసి సంపాదించుకొన్నవి కాదు. వీటన్నిటి నుంచి నైజాంకు నిధులందేవి. ఇలా సంపాదించుకొన్న అధికారాన్ని దుర్వినియోగం చేసి ఆస్తులు పోగేసుకొన్నారు. నైజాం జారీ చేసిన ఫర్మానాలో 82 రకాలైన అక్రమ నిర్బంధ వసూళ్లుండేవని తెలిసింది. ఫ్యూడల్ దోపిడీ నిరాటంకంగా సాగింది. పైన వివరించిన భూస్వామ్య విధానాలు వ్యవసాయాభివృద్ధికి నిరోధకంగా మారాయి. నేరుగా నైజాం, పరోక్షంగా భూస్వాముల దోపిడీని ప్రజలు కమ్యూనిస్టుల నాయకత్వాన ఎదిరించారు. నాలుగు వేలమంది నేలకొరిగారు. అయితేనేమి పది లక్షల ఎకరాలు ప్రజల స్వాధీనమైనాయి. అయితే కేంద్ర ప్రభుత్వ సైన్యాలు ప్రవేశించిన తర్వాత ప్రజలు సాధించుకొన్న అధికారం కోల్పోవటం జరిగింది. గ్రామాలు వదిలిపారిపోయిన భూస్వాములు మళ్లా గ్రామాల్లో ప్రవేశించారు. వారికి యూనియన్ ప్రభుత్వం రక్షణ కల్పించింది. వారంతా కాంగ్రెస్‌లో చేరారు. కొద్దిమంది చేతుల్లో భూకేంద్రీకరణ ఇటు తెలంగాణలో, అటు ఆంధ్రలో మళ్లీ కొనసాగింది.

కొద్దిమంది చేతుల్లో భూమికేంద్రీకరణ ఉత్పత్తి పెరగడానికి అవరోధం అని, సామాజిక న్యాయం చేకూరదని నిరంతర ఆందోళన, పోరాటాల ఫలితంగా 1973లో భూసంస్కరణల చట్టం ప్రభుత్వం తీసుకొనివచ్చింది. కాని అది లోటుపాట్లతో నిండిన చట్టం కావడంతో, రైతాంగానికి ఆ చట్టం ఎటువంటి వెసులుబాటు కలిగించలేదు. ఈ చట్టం తీసుకొనిరాకముందు, తర్వాత కూడా భూస్వాములు తమ పేర ఉన్న భూములను భార్యా, పిల్లలు, తమకు అణిగిమణిగి ఉండే నౌకర్ల పేర బదలాయించి ఆచరణలో తమ భూమినంతటినీ తమ హక్కుభుక్తంలో ఉంచుకొన్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలో కొన్ని చోట్ల భార్యకు విడాకులిచ్చినట్లు కాగితాలు సృష్టించి ఆమె పేర సీలింగ్‌కు పైగా ఉన్న భూములను రాసి ఇచ్చారు. అయినా, ఆ చట్టం ప్రకారం భూస్వాముల వద్ద 16.63 లక్షల ఎకరాల మిగులు భూమి ఉన్నట్లు తేలింది. దీనిలో ప్రభుత్వం 8.47 లక్షల ఎకరాలు స్వాధీనం చేసుకొని 5.11 లక్షల లబ్ధిదారులకు 5.71 లక్షల ఎకరాలు పంచిపెట్టినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఇలా మిగులు భూమిగా ప్రకటించిన దానిలో సేద్యానికి పనికిరాని భూమిగా ఉన్న వాటిని భూస్వాములు చేర్చారు. కొన్ని భూములకయితే లబ్దిదారులకు ఇచ్చినట్లు పట్టాలిచ్చారు. కాని, భూమి మాత్రం భూస్వాముల అధీనంలో ఉంది. మరికొన్ని సందర్భాల్లో పేదలు అనేక సంవత్సరాలుగా సాగు చేసుకొంటున్న భూమికే పట్టాలిచ్చి పంచిపెట్టినట్లు లెక్కల్లో చూపించారు. మరికొన్ని చోట్ల పట్టాలిచ్చినా, భూమి యాజమాన్యం మార్పును రెవెన్యూ రికార్డులలో ఆమేరకు మార్చలేదు. అప్పట్లో పని చేస్తున్న గ్రామ మునసబు, కరణాలు (పటేల్ పట్వారీలు) లంచాలకు ఆశపడి భూస్వాముల ఇష్టాఇష్టాలకు అనుగుణంగా రికార్డులను తారుమారు చేయటం, తప్పుడు మార్పులు, చేర్పులు చేయటం జరిగింది. (అందుకనే ఈ వ్యవస్థను ఎన్.టి. రామారావు రద్దు చేశారు గాని ప్రత్యామ్నాయ ఏర్పాటు చేయలేదు.) ఒక వేళ వాస్తవంగా పంచినా, పంచిన భూములను పంట భూములుగా మార్చటానికి కావల్సిన నిధులు లబ్ధిదారుల వద్ద లేకపోవటంతో, వాటిని తిరిగి భూస్వాములకో, ధనిక రైతులకో అమ్మేసిన ఉదాహరణలు లేకపోలేదు. మిగులు భూమిని పంచడంతోపాటు, ప్రభుత్వ భూమని కూడా ప్రభుత్వం చెప్పింది. అయితే ఆ ప్రభుత్వ భూమి ఎంత ఉంది, ఎంత పంచారు అనే విషయంలో ప్రభుత్వం ఒకోసారి ఒకో గణాంకం ప్రకటిస్తూ వచ్చింది. ఎంత భూమిని ప్రభుత్వం పంపకం చేయాలని లక్ష్యం పెట్టుకుందో మంత్రులు చెప్పలేకపోయారు. ఈ గందరగోళాన్ని నివారించడానికి, భూమి సమగ్రంగా అధ్యయనం చేయడానికి ఒక ఉన్నత స్థాయి కమిటీ ఏర్పాటు చేస్తామని ప్రస్తుత రెవెన్యూ మంత్రి ప్రకటించారు. సమస్యల పరిష్కారాన్ని దాటవేయడానికే కమిటీల నియామకం జరుగుతుందని అనుభవం చెబుతూంది. భూసమస్య గురించి నక్సలైట్ నాయకులతో చర్చించిన సందర్భంలో పంచి పెట్టడానికి 33 వేల ఎకరాలే ఉందన్నారు. మరోసారి రెవెన్యూ మంత్రి ప్రజా నాయకులతో సమావేశం జరిపి చర్చించినప్పుడు నిరుపేదలకు పంచగల భూమి నాలుగు లక్షల ఎకరాలు ఉండవచ్చునని అన్నారు. కాని రెవెన్యూ రికార్డుల ప్రకారం ప్రభుత్వ భూమి 14,185 ఎకరాలు, సీలింగ్ భూమి 2,135 ఎకరాలు, భూదాన భూములు 8,875 ఎకరాలు, ఈనాం భూములు, 73,941 ఎకరాలు ఉన్నాయని వివరించారు. ఇవన్ని కలిపినా లక్ష ఎకరాలు దాటదు. ఇలా చెప్పిన ప్రభుత్వమే ఇప్పటి వరకూ నాలుగున్నర లక్షల ఎకరాలు ముఖ్యమంత్రి ద్వారా పంపకం ఎలా జరిగిందని రైతు నాయకులు ప్రశ్నిస్తున్నారు. ఈ నాయకుల లెక్కల ప్రకారం 40 లక్షల నుంచి కోటి ఎకరాల భూమి పంపకానికి ఉందని అంటున్నారు. 2001 నాటికి ప్రభుత్వ ఆర్థిక గణాంక శాఖ ప్రతీ అయిదేళ్ల కొకసారి చేపట్టే సమగ్ర సర్వే లెక్కల ప్రకారం ఐదు శాతం రైతుల చేతుల్లో 25 శాతం దాకా భూమి ఉంది. భూమి ఇలా వేళ్ల మీద లెక్కపెట్టగలిగిన రైతుల చేతుల్లో కేంద్రీకరించబడినంత కాలం అది భూసంస్కరణ కాజాలదు. భూమిలేని పేదలకు న్యాయం జరగదు.

రాష్ట్రంలో అతి పెద్ద భూస్వామి దేవుడే. దేవుడి మాన్యంగా మూడు లక్షల వరకూ ఉందని అంచనా. ఈ భూములను భూస్వాములే అనుభవిస్తూ దేవుడి దీపారాధనకు కూడా గతిలేకుండా చేస్తున్నారు. ఇతర దేశాలతో పోల్చితే చైనాలో 43 శాతం, తైవాన్‌లో 37 శాతం, దక్షిణ కొరియాలో 32 శాతం, జపాన్‌లో 32 శాతం భూమి పునః పంపకం జరగగా, మనదేశంలో పంచింది 1.25 శాతం మాత్రమే. ఇలాంటి ప్రాథమిక సంస్కరణను ఎన్నడో చేపట్టడం వల్లనే ఆ దేశాలు

మనకన్న ఎంతో అభివృద్ధి చేందాయి అని మాజీ ఐ.ఎ.ఎస్. అధికారి ఎస్.ఆర్. శంకరన్ అన్నారు.

చిన్న కమతాల వల్ల ఉత్పత్తి తగ్గే ప్రమాదముందనే వాదన సరైంది కాదని, అధికోత్పత్తికి కమతం పరిణామానికి అతి దగ్గర సంబంధం లేదని ఆర్థర్ లూయిస్ అన్నారు. ఉదాహరణకు జపాన్ దేశంలో 94 శాతం కమతాలు రెండు హెక్టార్ల కంటే తక్కువ ఉన్న కమతాలే. ఈ కమతాల కింద ఉన్న భూమి మొత్తం భూమిలో 77 శాతం. కాని వరి ధాన్యం తలసరి ఉత్పత్తి 5700 కిలోలు కాగా 123 హెక్టారుల కమతాలున్న అమెరికాలో 4600 కిలోలు మాత్రమే. మనదేశంలో వ్యవసాయరంగంలో జరిపిన అనేక ప్రాథమిక సర్వేలను బట్టి ప్రొఫెసర్ సి.హెచ్. హనుమంతరావు అన్ని ఉత్పాదకాలు సక్రమంగా లభిస్తే చిన్న కమతాల ఉత్పత్తి పెద్ద కమతాల ఉత్పత్తికి ఏ మాత్రం తీసిపోదనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. దేశంలో ఇతర ఆర్థిక శాస్త్రవేత్తలు చేసిన పరిశోధనలు ఈ విషయాన్ని నిర్ధారించాయి.

భూసంస్కరణలు, విద్య, ఆరోగ్యం – ఈ మూడు ఆర్థికాభివృద్ధికి మూల స్తంభాలని నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ అనేకసార్లు పునరుద్ఘాటిస్తూ వస్తున్నారు. మాజీ అమెరికా రాయబారి గాల్‌బ్రియల్ ఏమన్నారంటే 'నిజానికి భూసంస్కరణలు విప్లవాత్మకమైన చర్య. ఆ చర్య చేపడితే అధికారం, ఆస్తి, హోదా అన్ని సమాజంలో ఒక వర్గం నుంచి మరో వర్గానికి సంక్రమిస్తాయి. ఏ దేశంలోనైనా ప్రభుత్వాధికారం భూస్వామ్య వర్గాల చేతుల్లో ఉంటే, ఆ వర్గం తన ప్రయోజనాలను కోల్పోయే పరిస్థితి ఏర్పడే పక్షంలో, ఆ దేశంలో భూసంస్కరణలు వారు దయదలిస్తే వచ్చేవేమీ కావు'.

మన అనుభవం కూడా ఇదేచెబుతోంది. గ్రామాల్లో భూమి ఎవరి చేతుల్లో ఉందో, వారిదే గ్రామంలో పెత్తనం. అందుకనేవారు వారిని బలపరిచే ప్రభుత్వాలు భూసంస్కరణలను వ్యతిరేకిస్తున్నాయి. భూమి వారిచేతుల్లో ఉంటే నీటివనరుల మీదా ఇతర వ్యవసాయ సంబంధమైన ఆస్తుల మీదా, గ్రామ పరిపాలన మీద అధికారం ఏర్పడుతుంది. ఈ గుత్తాధిపత్యం గ్రామాభివృద్ధికి, పేదరికం, వెనుకబాటుతనం నిర్మూలనకు ఆటంకంగా నిలుస్తుంది. సంస్కరణలు అమలు చేయనట్లయితే పేదరికం పోదు, పేదరికం వల్ల గ్రామీణ జనాభా కొనుగోలు శక్తి పెరగదు. చవక దుకాణాల్లో బియ్యం గింజలు కొనుక్కోవడానికి కూడా డబ్బు ఉండదు. వారి చేతుల్లో డబ్బు లేకపోతే పరిశ్రమల ఉత్పత్తులను కొనుగోలు చేయలేరు. ఇది భూమిలేని నిరుపేదల పరిస్థితి కాగా రెండెకరాల రైతుల పరిస్థితి భిన్నమేమీ కాదు. ధరల పెరుగుదలతో పెరిగిపోతున్న వ్యవసాయ ఖర్చుల దృష్ట్యా, వ్యవసాయం కొనసాగించటం కష్టమైపోతోంది. దేశంలో నలభై శాతం మంది రైతులు మరో ఉపాధి లభిస్తే వ్యవసాయం నుంచి నిష్క్రమిస్తామని ఇటీవల సర్వేలో వ్యక్తమైంది.

1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టినప్పటి నుంచి వ్యవసాయం సంక్షోభంలో పడింది. వ్యవసాయార్థిక శాస్త్రవేత్తలు వ్యవసాయం సంక్షోభంలో పడితే, దేశమే సంక్షోభంలో ఇరుక్కుపోతుందనీ, పరిశ్రమలు కూడా ఇబ్బందుల్లో పడతాయనీ హెచ్చరిస్తూ వచ్చారు. అంతకన్నా ముఖ్యంగా తిండి గింజల పంట తగ్గి దేశం మళ్లీ తిండి గింజల దిగుమతుల మీద ఆధారపడాల్సిన దుస్థితి ఏర్పడుతుంది. భూ సంస్కరణల మీద ప్రభుత్వమే ఏర్పాటు చేసిన టాస్క్‌ఫోర్స్ తన నివేదికలో 'గ్రామాల్లో ఉన్న నేటి సామాజికార్థిక పరిస్థితుల్లో రాజకీయ సంకల్పం లేనిదే భూసంస్కరణల అమలు ముందుకు సాగలేదు. నేటి రాజకీయ పరిస్థితిలో అటువంటిది సాధ్యం కాదు... సివిల్, క్రిమినల్ చట్టాలు, న్యాయస్థానం తీర్పులు, గత చరిత్ర పరిపాలనా సాంప్రదాయాల అమలు అన్ని ప్రస్తుత సామాజిక వ్యవస్థ పక్షాన పనిచేస్తున్నాయి. ప్రైవేట్ ఆస్తులు అతి పవిత్రమైనవి. వాటిని ముట్టుకోవడానికి వీలులేదు. అలాంటి నేపథ్యం లో గ్రామాల్లో పరిస్థితులను మార్చే అవకాశం సుమారుగా శూన్యం.

ఈ శూన్యాన్ని భర్తీ చేయాలంటే ప్రస్తుత రాజకీయార్థిక వ్యవస్థ మారాలి. నూతన శక్తులు, ముఖ్యంగా యువకులు అధికారం తమ చేతుల్లోకి వచ్చేలా కృషి చేయాలి. ◆





*మహిళా సంఘాల అధ్యయనం చేయకుండా మహిళా ఉద్యమ చరిత్రను సరిగ్గా నిర్మించలేమనీ, దాని స్వభావాన్ని అంచనా వేయలేమనీ అంటున్నారు* **ఎస్. మహబూబ్ బాషా**

# వలసాంధ్రలో స్త్రీల సంఘాలు : వివాదాస్పద 'శ్రీ విద్యార్థిని సమాజ' కథ

*(... గత సంచిక తరువాయి)*

**4**

ఇంతకీ ఇంతటి వివాదాస్పదురాలైన పులుగుర్త లక్ష్మీనరసమాంబ ఎవరు? 1878 వ సంవత్సరంలో జన్మించిన నరసమాంబ సుమారు ఎనభై సంవత్సరాలు జీవించారు[18]. మూర్తీభవించిన ఛాందసవాదియై సంఘసంస్కరణ విషయంలో వీరేశలింగంపై 'ఛాందస మేథోయుద్ధం' చేసిన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యురాలు. సంఘసంస్కరణలో వితంతు పునర్వివాహాలపై తీవ్ర వ్యతిరేకతను ప్రదర్శించినప్పటికీ, పాతివ్రత్యమే స్త్రీల పరమధర్మం అనిప్రవచించి బాల్యవివాహాలను కూడా ప్రోత్సహించినప్పటికీ, రజస్వలానంతర వివాహాల బద్ధవ్యతిరేకి అయినప్పటికీ స్త్రీ విద్యను మాత్రం బాగా ప్రోత్సహించారు: స్త్రీ విద్య ద్వారా స్త్రీలలో పతివ్రతా లక్షణాలు పరిఢవిల్లగలవనేది ఆమె ప్రగాఢ విశ్వాసం. తన ఆదర్శాల ప్రచారార్థం 'సావిత్రి' అనే మాసపత్రికను ప్రారంభించి సంపాదకురాలిగా వ్యవహరించింది. పత్రికకు పతివ్రతా శిరోమణిగా పేరు గాంచిన 'సావిత్రి' పేరు పెట్టడం యాదృచ్ఛికం కాదు. వ్యవహారిక భాషావాద వ్యతిరేకి కావడంతో పేరు గాంచిన 'సావిత్రి' పత్రికలోని భాష కఠిన గ్రాంథికంలో ఇనుపగుగ్గిళ్ళుగా ఉంది. ఛాందస వాద భావప్రచారానికి ఛాందసత్వ కఠిన గ్రాంథిక భాష బాగా తోడ్పడింది.! పత్రిక ప్రచురణకర్త అయిన పులుగుర్త వేంకటరత్నం ఈమె భర్త.

లక్ష్మీనరసమాంబ బహుగ్రంథ కర్త్రి. పదిహేను సంవత్సరాల వయస్సప్పుడే 'మహిళా కళాబోధిని' అనే కావ్యం రచించింది. 'స్త్రీ నీతిగీతములు', సతీధర్మములు', 'నీతిపదములు' అను పద్య గ్రంథాలతో పాటుగా అనేక ఇతర రచనలు చేసింది. పాతివ్రత్య ప్రబోధకములైన ఈ రచనలు 'సావిత్రి'లో ధారావాహిలుగా వెలువడేవి. 1904 ఏప్రిల్ 'సావిత్రి'లోని 'సతీధర్మములు' నుండి ఒక ఉదాహరణ:

"వరునందు నీవెంత భక్తినిల్పెదవొ
తరుణి! దేవుడంత దయచూచు నిన్ను
నగలకైనీ ప్రాణనాథుని మదిని
బొగించుటొక నీచము గనించుమమ్మ!
.....
పతియెట్టివాడైన దైవంబుగానెంచు
మితరులనన్నలట్లం చెము తరుణి
పరపురుషుడింత ప్రాశస్త్యుడైన
దరుణి! యాతని సహోదరునట్టులెంచు
...."

లక్ష్మీనరసమాంబ సమకాలీన పత్రికల్లో అనేక వ్యాసాలను ప్రచురించింది; ఈ వ్యాసాలు ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి. నరసమాంబగారి పాండితీప్రకర్షకు ప్రతీకలవి. వివాదసమయంలో ఈమె సంఘ సంస్కర్తలను, ముఖ్యంగా వితంతు పునర్వివాహోద్యమకారులపై ఆకలిగొన్న ఆడబెబ్బులిలా విరుచుకుపడుతూ కడు సుదీర్ఘమైన వ్యాసాలు ప్రచురించింది. జూన్ 1911 'సావిత్రి' లో 'ఆంధ్రమహిళా మహాసభ' శీర్షికతో ఈమె రాసిన వ్యాసం పొడవు 18 పేజీలు! 'పాతివ్రత్యము' (జూలై 1911) అనే వ్యాసం నిడివి 16 పేజీలు, 'కులాంగనలు' (అక్టోబరు 1911) అనే వ్యాసం పొడవు 9 పేజీలు. తన వాదనిరూపణకై ప్రాచీన ధర్మశాస్త్రాలు, స్మృతులు, పురాణాలనుండే కాకుండా ఆంగ్ల గ్రంథాలనుండి కూడా విస్తృతంగా ఉల్లేఖిస్తూ పాఠకులను ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. అబ్బురపరిచే తర్కం తోటీ సందర్భానుసారమైన చమత్కారం తోటీ, వెక్కిరింతల తోటీ సందర్భానుసారంగా సామెతలను జోడిస్తూ ప్రతికక్షులను ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. ఈ వ్యాసాల్లో ఆమె ప్రదర్శించిన పాండిత్య ప్రకర్ష కడుఇంపుగా ఉన్నప్పటికీ భావాలు మాత్రం పరమ కంపుగా ఉన్నాయి.

నరసమాంబ సంఘసంస్కరణాభిలాషులతో వాదులాడ్డమంతా ఒక ఎత్తైతే, సంఘసంస్కార వటవృక్షమైన కందుకూరి వీరేశలింగాన్ని ప్రత్యక్షంగా, కడు భీకరంగా ఢీకొట్టడం మరో ఎత్తు; 'సావిత్రి'ని వేదికగా చేసుకొని నరసమాంబ వీరేశలింగం పైకి లంఘించింది. మూర్తీభవించిన ఛాందసత్వానికీ, సంఘసంస్కారానికీ మధ్య జరిగిన ఈ అక్షర సంగ్రామాన్ని కొంచెం విపులంగానే చూద్దాం. ఈ సంగ్రామం కూడా సుమారుగా ఒకసంవత్సరం నడిచింది! ఈ సంగ్రామం 1904-1905, అంటే ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంలోనే జరగడం విశేషం.

మన్యం సుబ్బమ్మ అనే ఆమె 'సతీధర్మ ప్రకాశిక' (ఆగష్టు, సెప్టెంబరు 1904) అనే వ్యాసాన్ని 'సావిత్రి'లో ప్రచురించింది. మనుధర్మ శాస్త్రాన్ని తలదన్నే రచన ఇది; అడుగడుగునా మనుస్మృతినుండి

ఉల్లేఖనాలుండడం, సంఘసంస్కరణవాదుల వాదనలను తిరగదోడ్డం అందులోని విశేషం! అది రాసింది మన్యం సుబ్బమ్మ కాదనీ, ఆమె పేరుతో ఒక పురుషుడు రాసాడనీ, 'యాఘను'డెవరో తనకు తెలుసుననీ, అలాంటి 'స్త్రీ పురుషులు' పలుమంది తనకు తెలుసుననీ వీరేశలింగం వాదన. అందులో వ్యక్తమైన భావజాలాన్నీ, ఛాందసవాద స్త్రీలు ప్రయోగిస్తున్న గ్రాంథిక భాషనూ తీవ్రంగా హేళన చేస్తూ 'సావిత్రీ సత్యవతీ సంభాషణము-స్త్రీవిద్య' అనే ఖండికను సంభాషణా రూపంలో ప్రచురించాడు. అందులోని కొంత భాగాన్ని చూద్దాం[19]:

"సత్యవతి - విదుషీమణినగు నక్కా! క్రిందటి నెల సావిత్రీ సుందరీ పత్రికలను జదివితివా?

సావిత్రి - నేనుకాను. నీవు నక్కవు. నన్ను నక్కా అంటావా?

సత్యవతి - కోపపడబోకు, నిన్నక్కాయన్నానుగాని 'నక్కా' యనలేదు. నేనిపుడు వ్యాకరణము చదువుకొనుచున్నాను. 'ఉదంత తద్ధర్మాకవిశేషణమున కచ్చుపరంబగునపుడు నుగాగరుంబగు' నను సూత్రముచేత నక్కాయనురూపము రాదా?...

సావిత్రి - అహహహహా నీ చదువు చట్టబండలయినట్టే వున్నది. ఈ పాటి నీ వ్యాకరణ పాండిత్యము కట్టిపెట్టి తెలిసేటట్టుగా మాటాడు...

సత్యవతి - సావిత్రిలోవున్న సతీధర్మ ప్రకాశిక యెంత బాగావున్నదే? దానిలో యేమిశ్లోకాలు! యేమి వేదవాక్యాలు! యేమి ఇంగ్లీషు వచనాలు! యేమి చోద్యమే?

సావిత్రి - నాపేరిటి పత్రికలో రాసిన తరువాత బాగుండకుండా వుండేది కూడా వుంటుందా? మన్యం వెంకటసుబ్బమ్మ శాస్త్రిగారు వ్రాసిన దానిమాట నీవు చెపుతూవున్నావు?

సత్యవతి - శాస్త్రిగారంటావేమి? అది స్త్రీ రాసినదే.

సావిత్రి - గడ్డాలూ మీసాలూ వుండే పండిత స్త్రీలను శాస్త్రీ అని పిలువవలసినదేనే. అందులో తప్పేమీలేదు.

సత్యవతి - ఓహుహో! ఆడవాళ్ళ పేర్లుపెట్టుకొన్న పురుషులనా నీయభిప్రాయము?.... వెంకటసుబ్బమ్మ గారెవరో యెరుగుదువా? ఆమె వైశ్యాంగనా రత్నమట. ఆమె భర్తను సెట్టిగారనవలెనుగాని శాస్త్రిగానవచ్చునా?

సావిత్రి - అందులో ఉదాహరించిన వేదవాక్యాలూ శ్లోకాలూ చూస్తే, అది యెవడో బ్రహ్మిగాడు వ్రాసినట్టున్నది గాని సెట్టిగారు వ్రాసినట్టు లేదు. అందుచేత శాస్త్రీగారన్నాను. క్షమించు.

సత్యవతి - ఇప్పుడు కోమట్లూ వేదశాస్త్రాలు చదువుతూ వున్నారు. స్త్రీలూ చదువుతూ వున్నారు. అది నిజముగా వెంకటసుబ్బమ్మగారే వ్రాసినది యెందుచేత కాగూడదు?

సావిత్రి - ఈ మధ్య కొందరు పురుషులు స్త్రీల పేర్లు పెట్టి వారిపేరు చెడగొట్టడానికి స్త్రీలు వుచ్చరించరాని పద్యాలూ పాటలూ పత్రికల్లో వ్రాస్తూ వుండడం చేత స్త్రీలయభివృద్ధికి భంగకరంగా ఇందులో వున్న సంగతులను బట్టి నేను భ్రమపడినాను. జయంతి సూరమ్మగారి పేరుపెట్టి మంజువాణిలో ప్రచురించిన పద్యం స్త్రీ జాతికంతకూ అవమానకరంగా వుండలేదా! ఎంత పనికిమాలిన స్త్రీ అయినా ప్రచురించడానికి పరపురుషుడికిటువంటి పద్యం వ్రాస్తుందా?

..........

సత్యవతి - వెంకట సుబ్బమ్మగారూ మొదలైనవారు వ్రాయనే లేరని నీయభిప్రాయమా?

సావిత్రి - వారు వ్రాయగలవారే అయివుండవచ్చును. ఇది మాత్రం స్త్రీ వ్రాసినట్టు నాకు కనపడడం లేదు.

సత్యవతి - అలాగయితే యేమి చేతాము? స్త్రీలపేర్లు పెట్టుకొని వ్రాయవద్దని పురుషులను ప్రార్థింతామా?

సావిత్రి - ప్రార్థింతాము. ఓ పురుషులారా! మీరు మా పేర్లుపెట్టుకొని మీ పౌరుషమును పోగొట్టుకోకండి. మేము కోరనిదానిని కోరి మావృద్ధికి భంగము కలిగించకండి. వంచనకు మాకు దారిచూపకండి. చేతనైన పక్షమున మాకభివృద్ధి మార్గమును మీపేర్లతోనే చూపండి. ఇది మా హృదయపూర్వకమైన ప్రార్థన."

దీనికి తీవ్రంగా ప్రతిస్పందించిన లక్ష్మీనరసమాంబ సావిత్రిలో (నవంబరు 1904, పు. 1-8) 'కమలా-విమలా సంవాదము: (స్త్రీవిద్య)' అనే దానిని సంభాషణారూపంలో ప్రచురించి వీరేశలింగంపై తీవ్రంగా దాడి చేసింది: హేళనకు హేళనే సమాధానమంది. నరసమాంబ భావాజాలానికి ప్రతినిధియైన కమల విమలతో 'నా వెఱ్ఱిసోదరీ! (వీరేశలింగం పంతులులాంటి) విద్వాంసులైనవారు స్త్రీల విద్యకు దగుప్రోత్సాహము నిచ్చుచున్నారని నీవు భ్రమపడుచున్నావు. అంతియేకాని స్త్రీ విద్యను నిరుత్సాహపరచుటలో వీరగ్రగణ్యులగుచున్నారనీ నీవెరుంగకున్నావు" అనీ "...స్త్రీ విద్యాభిమానులమని పేరుపెట్టుకొని కొందరు లోకములోపన్యాసములిచ్చు సమయములందును బరులపై దండెత్తు సమయములందును నెంత స్త్రీ విద్యాభిమానము కనుపరచినను గ్రియలో దానికి వ్యతిరేకముగా నడచుచున్నారు..." అనీ, వారి అడుగులకు మడుగులెత్తకుండా 'యబలలు తమబుద్ధిని గూడ నుపయోగపరచుకొని తమకు మంచిదని తోచినదానిని జెప్పుచుండుటచే' ఈ పండితులు 'మాత్సర్యమునుబూని నిర్దయులై స్త్రీలువ్రాసిన వ్రాతలై విమర్శనములను వ్రాసియును బ్రకటించియును. జాల నిరుత్సాహమును గలిగించుచున్నారు' అనీ అన్నది స్త్రీలు రాసిన రాతలను విమర్శించినంత మాత్రముచేత అలాంటివారిని 'మనకును మనవిద్యకును శత్రువులని తలంపవచ్చునా?' అని ప్రశ్నించిన విమలతో 'మనబాగునకై యోగ్యములగు విమర్శనములొనర్చు' వారి గూర్చి తననడం లేదనీ, 'మాత్సర్యమును బూని యుక్తాయుక్తములాలోచింపక మన వ్రాతలపై దగని కువిమర్శనములొనరించు' వారిని గూర్చియే తను మాట్లాడుతున్నదనీ తెలిపింది. 'జనానా పత్రిక'లో మన్యం సుబ్బమ్మను వీరేశలింగం అవహేళన చేసిన విషయాన్ని ప్రస్తావిస్తూ స్త్రీలు చదువుకోవడానికై సరైన అవకాశాలే లేని సందర్భంలో కొందరు ఎన్నో కష్టాలనెదుర్కొంటూ చదువుకుంటున్నారనీ, వారు పత్రికలల్లో వ్యాసాలు రాయడం, సభలలో ఉపన్యాసాలివ్వడం చేస్తుంటే అధిక్షేపించే 'శూరాగ్రగణ్యులు పూర్వనాగరికులందును నవనాగరికులందును గూడ హెచ్చుగా బయలు వెడలుచున్నారు' అనీ, అట్టి స్త్రీలకు 'అపయశస్సు కలిగింపవలెనను తలంపుతో వారిని "శాస్త్రి" మున్నగునామములబెట్టి' ప్రాజ్ఞులమనుకునేవారు పరిహసించుచున్నారని విమర్శించింది.

వీరేశలింగం వ్యాసాన్ని జనానా పత్రిక సంపాదకుడైన రాయసం వేంకటశివుడు ఎలా ప్రచురించాడని అన్యాపదేశంగా ప్రశ్నించింది. వీరేశలింగం స్త్రీలకోసం తన జీవితాన్నంతటినీ అంకితం చేశాడనీ, ఇంకా ఇలాగ ప్రశంసించిన విమలతో అంతటి స్త్రీజనోద్ధారకుడు సుబ్బమ్మలాంటి విదుషీమణుల పట్ల అంతనీచంగా ఎలా వ్యవహరించగలిగాడని ప్రశ్నించింది. 'వెంకట సుబ్బమ్మ శాస్త్రి' అనే వ్యక్తీకరణలోని పురుషదురహంకారస్వభావాన్నీ; స్త్రీలను అత్యావశ్యకం చేసే రాజకీయాన్నీ ఈ క్రింది విధంగా బట్టబయలు చేసింది:

"శరీరమున స్త్రీలక్షణములున్నను దత్త్వజ్ఞానమున్న యెడల నాస్త్రీలు పురుషులుగానే భావింపబడుదురు. తత్త్వ జ్ఞానశూన్యులై లోకమోహాని మగ్నులై యుక్తాయుక్తములనాలోచింపక మత్సరగ్రస్తులై సాధుజనులపై నపవాదముల వేయుచు బేరునకై స్వమతమును స్వసంఘమును స్వకులమును నిందించుకొనుచు... స్త్రీలపైకి దాడివెడలు పురుషులు మీసమును గడ్డమును గలవారైయున్నను స్త్రీలుగానే భావింపబడుదురు"

ఈ విధంగా లక్ష్మీనరసమాంబ 'బాబయ్య' గారైన వీరేశలింగాన్ని తప్పుపట్టగా, ఇంకోవైపు మన్యం సుబ్బమ్మ అతి తీవ్ర పదజాలంతో దూషిస్తూ 'ఒక ప్రకటనము ఒక మనవి' అనే వ్యాసాన్ని (సావిత్రి, డిసెంబరు 1904,పు.1-9) ప్రచురించింది. మన్యం సుబ్బమ్మ పేరుతో వాస్తవంలో ఒక 'బ్రహ్మిగాడు' 'సతీధర్మప్రకాశిక' ను ప్రకటించాడన్న వీరేశలింగం 'ఆరోపణ'ను ఖైమా కొట్టింది! '...ఈసుతో నన్నపయశస్సులో ముంప వ్రాసిన నీచ వ్యాసము' అయిన 'సావిత్రీ సత్యవతీ సంభాషణము' లాంటి 'యనుచితపు వ్రాతల' పట్ల తన అందమెంతో తెలిసికొనకుండా దారిన పోయేవారిని 'వృథాగా' వెక్కిరించే కోతిని 'కోతిచేష్టలుకదాయని' ఉపేక్షించునట్లుగా, రాజమార్గమున పోయేవారిని చూసి మొరిగే కుక్కను (గ్రామసింహము) కుక్క బుద్ధికదాయని' ఉపేక్షించునట్లుగా ఉపేక్షవహించుమని 'నెచ్చెలులు కొందఱు' ఆమెకు సలహాయిచ్చారంది. కానీ తనుమాత్రం వీరేశలింగం వ్రాత 'స్త్రీలకందరకునుగూడ' అవమాన పర్చేదిగా పరిగణించినందువల్ల సమాధానం రాస్తున్నాననీ తెలిపింది. ఇలాంటి స్త్రీ జనోద్ధారకులను నమ్ముకుంటే స్త్రీల పరిస్థితి 'కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదడం' లా మారుతుందనీ,' జనులు వేళాకోళము చేసినను, బంధువులు నిందించినను, మీరేమో తమకు సహాయ మొనర్తురను పుట్టెడాశతో సతీతిలకములు పలువురు జంకువిడచి పత్రికలో వ్యాసములు వ్రాయమొదట పెట్టిరి. వెలుగు చేనుమేసినట్లు, తల్లి పిల్లనుదివినట్లు, మిమ్ము నమ్మకొనినవారినే నింద్యములైన యాక్షేపణములకు మొదలుపెట్టినారు. మీ సావిత్రీ సత్యవతీ సంభాషణము నాకొక్కతికే యవమానమును దెచ్చునదిగా లేదు. చదువుకొని మంచి వ్యాసములు వ్రాయు సామర్థ్యమును సంపాదించిన సుదతీమణులకందరకును గూడ నవమానమును దెచ్చునదియైయున్నది. చూడుడు...' అని వీరేశలింగాన్ని నిలదీసి లెంపకాయ కొట్టింది. 'తెలివి తక్కువ వ్రాత' వ్రాసినందుకు మాడు అదిరిపోయేలా మొట్టికాయలేసింది. తన వ్యాసరచనా సామర్థ్యాన్నీ, పాండిత్యాన్నీ శంకించి, కించపరచిన వీరేశలింగాన్ని ఛాలెంజ్ చేస్తూ తను ఎలాంటి పరీక్షకైనా సిద్ధమేనని బహిరంగంగా ప్రకటించింది. 'ఇందులకు మీకంగీకారమైన యెడల పరీక్ష జరగవలసిన పద్ధతులు బుద్ధిమంతులు నలుగురుచితమను వారి నేర్పరచుకొందము. ఆపైన పరీక్షకావచ్చును' అంటూ ఎప్పుడైనా ఎక్కడైనా బస్తీమే సవాల్ అంది.

'విదుషీమణులగు సోదరీమణుల'ను సంబోధిస్తూ తాను 'సతీధర్మ ప్రకాశిక' అనే వ్యాసాన్ని 'సావిత్రి'లో ప్రచురించిందనీ, దాన్ని మీరు చూసే ఉంటారనీ, అందులో తానేవరినీ దూషించలేదనీ, ఒక వేళ ఎవరైనా చూడకుండా ఉంటే ఒకసారి 'చిత్తగింపుడ'నీ కోరింది. తన వ్యాసంపై 'సావిత్రీ సత్యవతీ సంభాషణము' అనే 'విమర్శనము' జనానా పత్రికలో ప్రచురితమైందనీ, 'అది నాకే గాక జదువుకొనిన స్త్రీలకందరికిని నవమానము తెచ్చిపెట్టునదిగా' ఉన్నదనీ, మీరంతా వాటిని చదివి ఏది ఉచితమో, ఏది అనుచితమో, పంతులుగారు అలాంటి రాతల్ని రాయడం ఎంతవరకు సబబో 'నిష్పాక్షిక బుద్ధితో' నిర్ణయించండనీ కోరింది. అంతేకాక 'ఉపేక్ష చేయకుడు, ఈ వేళ నన్ను నిందించినవారు రేపు మిమ్ము నిందింపగలరు. పక్షపాతము వహింపకుడు. అనవసరమని తలంపకుడు. ఇది స్త్రీ జాతిని గూర్చిన విషయముగా' భావించి ప్రతిస్పందించమని హెచ్చరించింది.

పులుగుర్త లక్ష్మీనరసమాంబ, మన్యం వేంకట సుబ్బమ్మల వ్రాతలను 'యపాత్రపు వ్రాతలు' గానూ, 'అవివేకుల దూషణములకు బదులు వ్రాయుట యుచితము' కాదని భావించిన వీరేశలింగం ఉపేక్షించి ఊరకున్నారు. ఈ ఉపేక్షను ఆయన 'అసమర్థత'గా పరిగణించిన దురభిమానులైన ప్రతికక్షులు 'ఆర్యమతబోధిని'(?) ఏప్రిల్ 1905 సంచికలో "మన్యము వేంకట సుబ్బమ్మ గారిచ్చిన ప్రత్యుత్తరమునకును వేసిన పందెమునకును మారు బలుక జాలక పంతులవారును తదనుచరులును గతించినదానికి చింతిల్లుచు నూరకుండి"రని వెటకారం చేశారు. దీనికి స్పందిస్తూ వీరేశలింగం ఏప్రిల్-మే 1905 నాటి 'తెలుగుజనానా' పత్రికలో 'జనానా పత్రిక-సావిత్రి' అనే వ్యాసాన్ని ప్రచురించారు. మన్యం వేంకటసుబ్బమ్మ "పేరుపెట్టి" ప్రకటించిన వ్యాసములో 'గేవల దూషణోక్తులును దోషారోపణములును తప్ప నుత్తరమీయదగిన సారాంశమందేదియు లేద'నీ, ఆ తుచ్ఛపు వ్రాతలన్నియు వీథినాటకముల యందు వేషము మార్చి వేరు వేరు పేరులు పెట్టుకొనివచ్చే యేకపరిహాసకునిచే వినిపింపబడు కథల వలెన్ పాపభీతిలేక యసత్యములకును దూషణములకును దోషారోపణములకును బిరుదందె వేసికొన్న కాకినాడ పుర వాస్తవ్యుడగు నొక్క పుణ్యపురుషుని చేతనే వ్రాయబడినవనియు, వేంకట సుబ్బమ్మగారు తమపేరు వేయుట కంగీకరించుట తప్ప వేరుదోషమెరుగరనియు' తాను 'నిశ్చయముగా' చెప్పగలననీ అన్నారు. 'మారుపేరుపెట్టుకొన్న యాఘనుని' పేరును పేర్కొని పత్రికను 'అపవిత్రం' చేయజాలనన్నారు. స్త్రీ విద్యాభిమాని అయిన తను 'నిజముగా స్త్రీలు కవయిత్రులయి గ్రంథరచన చేసినప్పుడు' ఎంతగానో సంతోషిస్తాననీ, కానీ తాము రాయని గ్రంథములకు తమ పేర్లు పెట్టుకొని ఇతరులను వంచిస్తే మాత్రం క్షమించలేననీ హెచ్చరించారు. మన్యం సుబ్బమ్మ పాండిత్యాన్ని చూచి సంతోషించాలని కుతూలహలపడుతున్నాననీ, 'ఆమె కనుకూలమయిన కాలమును స్థలమును దెలిపిన యెడల, నామె పాండిత్య ప్రకటన సమయమునందు మేముండి యామెకీర్తిని కొనియాడెదము. ఆమె తప్పక మా ప్రార్థనమునంగీకరించి తన ప్రతిజ్ఞను శీఘ్రకాలములోనే' నెరవేర్చాలనీ కోరారు. తనను పలువిధములుగా నిందించిన పులుగుర్త లక్ష్మీనరసమాంబ వాదాలను చింతతొక్కు కొట్టినట్లుగా కొడుతూ స్త్రీల అభివృద్ధికై పలువిధాలుగా తను పాటుపడనారంభించిన నాటికి పుట్టనుగూడా పుట్టని నరసమాంబ, 'నిరుటి సంవత్సరము క్రొత్త

పత్రికనారంభించి' పురుషుల రాతలకు స్త్రీల పేర్లు పెట్టి నిస్సగ్గుగా ప్రచురిస్తున్న నరసమాంబ తనను నిందించడం విడ్డూరంగా ఉందన్నారు. అంతేకాక 'సతీధర్మ ప్రకాశిక' ను వాస్తవంగా ఎవరు రాశారో ఆమె భర్త అయిన పులుగుర్త వెంకటరత్నం ద్వారా తెలుసుకున్న 'కాకినాడ వాస్తవ్యులగు కొందరు పెద్దమనుషులు' తనతో చెప్పారన్నారు. సుబ్బమ్మ పరీక్షార్థమై 'సాధ్యమయినంత శీఘ్రముగా' సభను జరపమని కోరారు.

వేంకట సుబ్బమ్మ గారి పాండితీప్రకర్షా పరీక్ష జరిగిందో లేదో తెలియరావట్లేదు. సమకాలీన స్త్రీల పత్రికలు దేంట్లోనూ దీని తాలూకు ప్రస్తావన వ్యాసకర్తకు దొరకలేదు. ఈ పరీక్ష జరగలేదనే అనిపిస్తున్నది; ఎందుకంటే జరిగి ఉంటే సమకాలీన పత్రికలు దీన్ని విశేషప్రాధాన్యతతో ప్రచురించి ఉండేవి. అనేక విషయాలను తన 'స్వీయచరిత్రము'లో చర్చించిన పంతులుగారు మారుపేరుతో రాసిన 'యాఘనుని' గూర్చి, ఇంత గడబిడ జరిగినాక కూడా, చెప్పకపోవడం ఆశ్చర్యంగా ఉంది.

'స్త్రీల పేరులు పెట్టి పత్రికలకు వ్రాయుచున్న పురుషులనేకులను మేమెరుగుదుము' అని గాఢ విశ్వాసంతో ప్రకటించిన వీరేశలింగం వాళ్ళ పేర్లిచ్చి ఉంటే చాలా బాగుండేది. వీరేశలింగం వాదన చాలా వరకు సరైందే. స్త్రీల పేరుతో రాస్తే తప్పక అచ్చవుతాయని చాలామంది పురుషులు భావించేవారు. కొంతమంది దీన్ని ఆచరణలో పెట్టారు[20]. కానీ వ్యవహారం మొత్తం గమనిస్తే 'స్త్రీలకింత పాండిత్యం ఎక్కడినుండి వస్తుంది', 'బహుశా ఏ బ్రహ్మిగాడో రాసి ఉండవచ్చు' అన్న పురుషాధిపత్యపు అనుమానం వీరేశలింగం మనసులో ఏ మూలనోదాగి ఉందన్నట్లు మనకనిపిస్తుంది. ఈ విషయాన్ని రూఢీపర్చే ఉదాహరణలు కొన్ని.

ఇరవయ్యవ శతాబ్దారంభంనుండే స్త్రీలు 'సొంతంగా' ఆలోచించడం మొదలు పెట్ట నారంభించి, సంఘాలనూ, స్త్రీల పత్రికలనూ ఆరంభించారన్నది ముందే చూసినాం. 'హిందూసుందరి', 'సావిత్రి' పత్రికలకు స్త్రీలే సంపాదకురాండ్రు. స్త్రీల రచనలకే ఇవి మొదటి ప్రాధాన్యతనిచ్చేవి. పురుషులను దూషించిన వ్యాసాలను ప్రారంభయ్యి అవ్వక ముందే ప్రచునారంభించాయీ పత్రికలు. దీని పట్ల వీరేశలింగం మండి పడ్డారు కూడా! (తెలుగు జనానా, ఏప్రిల్–మే 1905, పు. 326–28) అంతే కాకుండా స్త్రీలు ఇంకా తగినంతగా విద్యాధికురాళ్ళు కాలేదనీ, వారికి పురుష సహాయం అవసరమనీ (పత్రికలు మొదలైనవి నడపడంలో; ఎందుకంటే స్త్రీలకింకా సొంతకాళ్ళపై నిలబడే శక్తి రాలేదు; కాబట్టి పురుష పుంగవులనే ఊత కర్రల అవసరం ఉంది!) లింగం బలంగా భావించారు. ఆయన మాటల్లోనే– "....ఈ దేశమునందలి స్త్రీలెవ్వరో యొకానొకరు దక్క నింకను స్వతంత్రముగా పత్రికను నడుపునంతటి సమర్థురాండ్రు గాలేదు. పత్రికలను జక్కగా నడపుటకొక్క భాషా పాండిత్యము చాలదు; వివిధ విషయములను దెలిసి యుండవలెను... స్త్రీలకట్టి శక్చి వచ్చు వరకును విద్యాధికులయిన పురుషుల సాహాయ్యమవశ్యకముగా గావలెను...." ఈ విషయాన్ని రాయసం వెంకట శివుడు కూడా నిరూపించారు. 'హిందూసుందరి', 'సావిత్రి' స్త్రీలపత్రికలు ప్రారంభమయ్యాక కూడా తెలుగుజనాన అవసరమేంటన్న విషయమై రాయసం వారికి 'తీవ్రమైన సందేహాలు' కలిగాయి. ఈ విషయాన్ని వీరేశలింగంతో ప్రస్తావించగా ఆయన 'స్త్రీల పత్రికలు' (స్త్రీలేనడిపినవి) ప్రారంభమైనాకూడా పురుషుల ఆధిపత్యంలో నడిచే స్త్రీల పత్రికలు తప్పక అవసరమనీ, అనుమానాలు పెట్టుకోకుండా ముందుకు సాగిపొమ్మనీ సలహా ఇచ్చారు; అంటే ఊతకర్రలు అవసరమే, లేకపోతే స్త్రీలు పడిపోతారు అన్నారు!

మన్యం సుబ్బమ్మ, వీరేశలింగాల మధ్య జరిగిన గడబిడను 'కులం' దృక్పథంనుండి కూడా చూస్తే విషయం ఇంకాస్త మెరుగ్గా అర్థంమౌతుంది. సంప్రదాయ అధిపత్యంలో తనకన్నా కిందివారైన వైశ్యులు, అంచనా ఒక స్త్రీ బ్రాహ్మణీయ ప్రామాణిక గ్రంథాలు అయిన వేదాలు, స్మృతులపై అంతటి పట్టుకలిగి ఉండడం పంతులుగారికి నచ్చకపోయి ఉండవచ్చు. అందుకే సుబ్బమ్మ వ్యాసాన్ని ఒక 'బ్రహ్మిగాడు' మాత్రమే రాయగలడని వాదించి ఉండొచ్చు. ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజికీ (వైశ్యుడు), పంతులుగారికీ మధ్య వివాదం, కారణం మనకు బాగా తెల్సిందే! పలు విషయాల్లో తనే ప్రారంభకుడని స్వీయచరిత్రలో అడుగడుగునా చెప్పి, నరహరి గోపాలకృష్ణమ చెట్టిని మరుగు పరిచిన విషయమూ మనకు తెలుసు. కులాధిక్య భావన జంధ్యాన్ని విడిచిపెట్టిన, కులాన్ని 'నిరసించిన' 'పంతులు' గారికి ఉండడంవల్లకూడా, మిగతా విషయాలు కలుపుకొని, సుబ్బమ్మపై దాడికి ప్రేరేపించి ఉండవచ్చు.

ఈ విధంగా వాదంలో వీరేశలింగంలాంటి పెద్దమనిషినే ఇరికింప చేసి, భీకరంగా ఢీకొట్టి, సాహసంతో నిలబడ్డ లక్ష్మీనరసమాంబ ఘనురాలే! వివాదాలను లేపడం, కొనసాగించడం, ప్రోత్సాహిచడం, పంతులు లాంటి సంస్కార గజాలతో తలపడ్డం, అందునా గత శతాబ్ది ప్రారంభంలోనే, చూస్తే నరసమాంబ సామర్థ్యం ఏంటో మనకిట్టే అర్థమైపోతుంది. పలు వివాదాలకాలవాలమైన లక్ష్మీనరసాంబకు 'వివాదలక్ష్మి' అనే బిరుదు చక్కగా సరిపోతుంది.

*(మిగతా వచ్చే సంచికలో...)*

**అంత్యసూచికలు**

18. నరసమాంబను గూర్చిన కొంత సమాచారినికై చూడండి : ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, ఆంధ్ర కవయిత్రులు, 1980 (తొలికూర్పు 1953), పు. 141–143. నరసమాంబ ఎప్పుడు పరమపదించారో వ్యాసకర్తకు లభించలేదు.

19. కందూకూరి వీరేశలింగం, 'సావిత్రీ సత్యవతీ సంభాషణము : స్త్రీవిద్య', తెలుగు జనాన అక్టోబర్ 1904, పు. 121–126. ఇది మహావ్యంగ్య రచన.

20. స్త్రీల పత్రికలు స్త్రీల రనచలను ప్రాధాన్యతతో ప్రచురించడం వల్ల కొంత మంది పురుషులు స్త్రీలపేర్లతో రాసేవారు. ఇలాంటి దొంగలు (అయితే వీళ్లు 'మంచి దొంగలే') ఎవరెవరన్నది కనుక్కోవడం కష్టం. 'గృహలక్ష్మి' పత్రికా సంపాదకుడైన కె.ఎన్.కేసరి ఇలాంటి వారినుద్దేశించి కొంచెం చెప్పారు. అయితే నాకు ఒక 'దొంగ' దొరికాడు. తానిలాంటి దొంగపని చేశానని తిరుమల రామచంద్ర తన స్వీయచరిత్ర అయిన హంపీ నుంచి హరప్పాదాకలో ఒప్పుకున్నారు. కోమల అనే ఆవిడ పేరుతో 'గృహలక్ష్మి'కి రచనలు పంపారు. ఆయన చేసిన ఘనమైన చోరకార్యాన్ని ఆయన నోటినుండే విని తరిద్దాం : '...నేను గృహలక్ష్మి పత్రికలోనే గేయాలూ, అవీ వ్రాసేవాడిని. సంపాదకుడు రామచంద్రయ్య నా మిత్రుడే. అయినా నేను ఆ మైత్రిని దుర్వినియోగించు కోలేదు. అతనికి ముందు నేను కొన్ని రచనలు పంపాను. త్రిప్పి పంపారు. ఒకసారి కోమలను కలుసుకుని, 'నీపేరుతో పద్యాలూ, గేయాలూ, సంస్కృత గేయాలూ పంపుతాను గృహలక్ష్మికి, గాభరా పడక' అని చెప్పాను. 'అన్యాయంకదా' అన్నది. 'అన్యాయమే. కాని పత్రికలవారి బుద్ధి తెలుసుకుందాం అన్నాను' అన్నాను. ఆమె పేరుతో పంపాను. పడ్డాయి. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు తమ ఆంధ్ర రచయిత్రులు అనే గ్రంథంలో కోమల గేయాలను ప్రస్తావించి ప్రశంసించారు. నవ్వుకున్నాను...' (పు. 381) ◆

**ప**శ్చిమ బెంగాల్ కోళ్ల పరిశ్రమ బర్డ్‌ఫ్లూ (ఎవియన్ ఇన్‌ఫ్లూయంజా) తో అతలాకుతలమైంది. ముఖ్యంగా బీర్భూమ్, దక్షిణ దినాజ్‌పూర్, బర్ద్వాన్, నదియా, ముర్షిదాబాద్ జిల్లాల్లో ఈ వ్యాధి తీవ్రత ఎక్కువగా ఉంది. తరువాత దశలో కూచ్ బీహార్ తదితర జిల్లాలకు కూడా ఈ వ్యాధి విస్తరించింది. వ్యాధి తీవ్రతపై అంచనాల కోసం జార్ఖండ్, ఒరిస్సా, బీహార్, ఈశాన్య రాష్ట్రాలలో నిఘా కార్యక్రమాలు చేపట్టారు. ఎచ్5ఎన్1 అనే రోగకారక వైరస్ చైనా నుంచి ఆసియా, యూరప్, ఆఫ్రికా ఖండాలకు వ్యాప్తి చెందింది. 2003 నుంచి ఇప్పటికి నలభై ఎనిమిది దేశాలు ఈ బర్డ్‌ఫ్లూ ఉధృతికి లోనయ్యాయి. ఈ వ్యాధి వల్ల ఇప్పటికి 250 మిలియన్ల కోళ్లు చనిపోవడమో, రోగ వ్యాప్తి జరకుండా వాటిని చంపేయడమో జరిగింది. కోళ్లకే కాకుండా పద్నాలుగు దేశాలలో 350 మంది మనుషులకు కూడా ఈ వైరస్ సోకింది. వారిలో 218 మంది చనిపోయారు. బెంగాల్‌లో కూడా ఈ వ్యాధి తీవ్రతను దృష్టిలో పెట్టుకొని ఇరవై లక్షల కోళ్లను ముందు జాగ్రత్తగా నిర్మూలించారు. సామాన్య రైతులు, ప్రజానీకం దీనివల్ల చాలా నష్టపోయారు.

**ప్ర**ముఖ సామాజిక కార్యకర్త, గాంధేయవాది బాబా ఆమ్టే తన ఆనందవన్ ఆశ్రమంలో ఫిబ్రవరి 9న మరణించారు. మహారాష్ట్ర చంద్రపూర్ జిల్లాలో ఈ ఆశ్రమం ఉంది. ఆమ్టే 26 డిసెంబర్ 1914లో మహారాష్ట్రలోని వార్ధాలో జన్మించారు. ఆయన అసలు పేరు మురళీధర్ దేవిదాస్ ఆమ్టే. ఆయన కుష్ఠు వ్యాధిగ్రస్తులకు విశేష సేవలు అందించారు. నర్మదా బచావో ఆందోళన్ లాంటి ఉద్యమాల్లో కూడా పాల్గొన్నారు. పద్మభూషణ్, రామన్ మెగసెసె, గాంధీ శాంతి బహుమతి, టెంపుల్‌టన్ ప్రైజ్ లాంటి అవార్డులు అందుకున్నారు. ఆమ్టేను గాంధీ 'అభయ సాధక్'గా పిలిచేవారు.



**2002** గుజరాత్ మారణకాండ తరువాత తగిన సాక్ష్యాధారాలు లేవంటూ గుజరాత్ ప్రభుత్వం మూసివేసిన కేసులు కనీసం రెండు వేలు ఉంటాయి. సర్వోన్నత న్యాయస్థానం ఆదేశాల మేరకు 2004లో ఈ కేసుల పునఃపరిశీలన ప్రారంభమైంది. గోధ్రా ఘటనకు బాధ్యులెవరైనా అనేకమంది అమాయక ముస్లిం ప్రజలు నష్టపోయిన తీరుగానే బిల్కిస్ బానో కూడా సర్వం కోల్పోయింది. 'చెల్లీ' అని చిన్ననాటి నుంచి సంబోధించిన వారే ఆరు నెలల గర్భవతిగా ఉన్న బిల్కిస్ బానోపై ఉన్మాదంతో అత్యాచారం చేశారు. నాలుగేళ్ల కుమార్తె తలను బండరాయికేసి బాది చంపారు. తనతో పాటు ప్రాణాలు కాపాడు కోవటానికి గ్రామం విడిచి పారిపోతున్న పద్నాలుగు మంది కుటుంబ సభ్యులను నరికేసి చంపేశారు. అన్ని కోల్పోయినా దోషులకు శిక్షపడాలని భర్త, వివిధ సంస్థలూ, వ్యక్తుల సహకారంతో ఆరేళ్ల పోరాటం తరువాత కేసు గుజరాత్ నుంచి మహారాష్ట్రకు మార్చాక ముంబై ప్రత్యేక న్యాయ స్థానంలో దోషులకు శిక్షపడింది. పన్నెండు మంది నిందితుల్లో పదకొండు మందికి యావజ్జీవ ఖైదును ప్రత్యేక న్యాయస్థానం నిర్ణయించింది.

**ఆ**టలు మనిషి శారీరక, మానసిక ఆరోగ్యాలకు బాటలు వేస్తాయి. జీవితంలో పడటమే కాదు లేవడం ఉంటుందనే స్ఫూర్తినిస్తాయి. ఓడిపోవడమే కాదు పోరాట పటిమతో, ఆత్మ స్థైర్యంతో నిలిచి గెలవాలనే పట్టుదలకు ప్రాణం పోస్తాయి. ఆటలూ, మైదానం పడిలేవడం నుంచి జీవితాన్ని అర్థం చేయిస్తాయి. నిశ్శబ్దంగా మైదానాలు గాయానికి మట్టిని పూసి బతికే తత్వాన్ని నేర్పుతాయి. ఇప్పుడు ఊళ్లో పొలాలు, పచ్చిక బయళ్లు సెజ్‌లకూ, పట్టణాల్లో మైదానాలు రియల్ ఎస్టేట్ కబ్జాలకూ బలైపోతున్న కాలంలో మనమంతా ఉన్నాం. ఆటలంటే ఇప్పుడు ఆడేవారిని టి.వి.లో చూసి మాట్లాడుకోవడమే. డబ్బు ఉండి ఆడగలిగే వాళ్లు మాత్రమే క్రికెటర్సో ఇంకొల్లో అవుతారు. అయితే ఈ ఆటలు ఆటలుగానే కాక కోట్లాది రూపాయల వ్యాపారానికి కావాల్సిన భావ సంచలనం కలిగించడానికి ప్రకటనా వేదికలవుతున్నాయి. గ్లోబలైజేషన్ క్రమంలో దేశీయ ఆటలు ప్రాధాన్యత కోల్పోయి, కోట్లు కురిపించే ఆటల చుట్టూనే ప్రపంచం తిరుగుతోంది. అందులో భాగమే ఈ క్రికెటర్ల వేలం.

**ని**రుద్యోగులకు వందరోజుల పనికల్పించాలనీ, ఎస్.ఇ.జెడ్. విధానాన్ని రద్దుచేయాలనీ, ముస్లింలకు ఉద్యోగాలలో కోటా కల్పించాలనీ, రిటైల్ వ్యాపారంలోకి బహుళజాతి కంపెనీల రాకను నిషేధించాలనీ డిమాండ్ చేస్తూ పశ్చిమ బెంగాల్‌లో ఫార్వర్డ్ బ్లాక్ పార్టీ రాష్ట్ర వ్యాప్త ఆందోళనకు పిలుపునిచ్చింది. అందులో భాగంగా కూచ్ బీహార్ జిల్లాలోని దిన్‌హతా సబ్‌డివిజనల్ అధికారి కార్యాలయం ముందు ఫిబ్రవరి 5న ఫార్వర్డ్‌బ్లాక్ కార్యకర్తలు శాసనోల్లంఘన కార్యక్రమాన్ని చేపట్టారు. పోలీసులకు, ఆందోళనకారులకు మధ్య ఘర్షణ చోటుచేసుకుంది. తదనంతర పరిణామాల్లో జరిగిన కాల్పుల్లో ఐదుగురు ఫార్వర్డ్‌బ్లాక్ కార్యకర్తలు మరణించారు. అధికార సి.పి.ఎం.తో సంకీర్ణ భాగస్వామి అయిన ఫార్వర్డ్‌బ్లాక్ కార్యకర్తలపై కాల్పులు జరపడాన్ని ప్రతిపక్షాలతో సహా అందరూ ఖండించారు. ప్రజలైనా, మిత్రపక్షమైనా విధానాలను ప్రశ్నిస్తే తూటాలే సమాధానంగా 'వామపక్షం' వర్ధిల్లుతోంది.

**వం**దలాది మంది నిరుద్యోగులను వంచించి, ఉద్యోగాల ఆశచూపి, కొందరినుంచి కిడ్నీలు దొంగలించి సుమారు ఆరువందలకు పైగా అక్రమ కిడ్నీ మార్పిడి శస్త్ర చికిత్సల ద్వారా కోట్లాది రూపాయల వ్యాపారం చేసిన డాక్టర్ అమిత్ కుమార్ పట్టుబడ్డాడు. గుర్గాంవ్‌లోని ఆయన ఆసుపత్రిపై జనవరి 24న దాడి చేసినప్పుడు ఈ విషయం వెలుగులోకి వచ్చింది. అప్పటి నుంచి పరారీలో ఉండి ఫిబ్రవరి 8న నేపాల్ భారత్ సరిహద్దులోని ఒక హోటల్‌లో డాక్టర్ అమిత్ కుమార్ పట్టుబడ్డాడు. జ్ఞానం సంక్షేమానికికాక డబ్బు సంపాదించే మార్గంగా మారిపోయి చాలా కాలమే అయింది. ◆

## ఆదిమ జాతులకి క్షమాపణ చెప్పిన ఆస్ట్రేలియా ప్రభుత్వం

ఆస్ట్రేలియాలో నివసించే ఆదిమ జాతులని విచక్షణా రహితంగా, నిర్దయగా చంపివేసి ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకొన్న శ్వేతజాతులు తర్వాతి కాలంలో ఆదిమ జాతి పిల్లలని వారి తల్లిదండ్రులకి దూరంగా తీసుకు వెళ్లిపోయి వేరే ప్రదేశాలలో వాళ్ల భాషకి, సంస్కృతికి, కుటుంబానికి దూరంగా పెంచారు. ఈ పరిస్థితి 1910 నుంచి 1970 వరకు కొనసాగింది. 10 నంచి 30 శాతం వరకు పిల్లలు ఇలా వాళ్ల కుటుంబాలు, సమాజాల నుంచి దూరంగా అనేక రకాల హింసను అనుభవిస్తూ బతికారు. చేసిన తప్పులకి, అన్యాయాలకి ఆస్ట్రేలియా ప్రభుత్వం క్షమాపణ చెప్పాలని ప్రభుత్వ రిపోర్ట్ 1997లోనే సూచించింది. అయితే ఇంతకుముందు అధికారంలో ఉన్న జాన్ హొవర్డ్ క్షమాపణ చెప్పడానికి నిరాకరించారు. ప్రస్తుతం అధికారంలో ఉన్న, లేబర్ పార్టీకి చెందిన ప్రధాని కెవిన్ రడ్, ఆదిమ జాతుల సమక్షంలో, పార్లమెంటులో జరిగిన అన్యాయాలకి చారిత్రాత్మక క్షమాపణ తెలియజేసారు.

కొసావో సెర్బియా దేశం నుండి విడిపోయి, స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొంది. 1998 – 99 మధ్యలో సెర్బియాకి వ్యతిరేకంగా పోరాడిన గెరిల్లాలు, ఇతర నాయకులు కలిసి 90 శాతం అల్బేనియా ప్రజలున్న కోసావో సెర్బియాలో భాగం కాలేదని, అది స్వయం ప్రతిపత్తి గల వేరే దేశంగా మనడానికి సెర్బియా నుంచి విడిపోతోందని ప్రకటించారు. ఐతే, సెర్బియా దేశం కొసావోని వేరే దేశంగా గుర్తించడానికి నిరాకరించింది. అమెరికా, ఇతర పశ్చిమదేశాలు కొసావో దేశాన్ని సమర్థిస్తుండగా రష్యా, సెర్బియాలు మాత్రం దీన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. కొసావో విడిపోవడానికి వ్యతిరేకంగా సెర్బియా ప్రజలు తమ రాజధాని బెల్‌గ్రేడ్‌లో పెద్ద ఎత్తున నిరసన కార్యక్రమాలు నిర్వహించారు.



ఈ నెల పాకిస్తాన్‌లో జరిగిన ఎన్నికలలో ప్రతిపక్ష పార్టీలైన పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ (పి.పి.పి.), పాకిస్తాన్ ముస్లిం లీగ్ (ఎన్) (పి.ఎం.ఎల్.ఎన్.) అత్యధిక ఓట్లు, సీట్లు గెలిచాయి. ప్రస్తుతం అధికారంలో ఉన్న పాకిస్తాన్ ముస్లిం లీగ్ (క్యూ)కి కేవలం 38 సీట్లు రాగా, ప్రతిపక్ష పార్టీలు రెండింటికి కలిపి 150 సీట్లపైనే వచ్చాయి. పి.పి.పి. నాయకుడు, బెనజీర్ భుట్టో భర్త అసిఫ్ అలీ జర్దారీ, పి.ఎం.ఎల్.ఎన్. నాయకుడు నవాజ్ షరీఫ్ ఎన్నికల ఫలితాలు వెలువడిన తరువాత పలుసార్లు భేటీ అయ్యారు. రెండు పార్టీలు కలిసి ప్రభుత్వాన్ని ఏర్పరుస్తాయని ఇరువురు నాయకులు ప్రకటించారు. ఐతే పి.ఎం.ఎల్.ఎన్. పార్టీ ప్రభుత్వంలో భాగస్వామిగా ఉంటుందా, లేక బయట నుండి మద్దతునిస్తుందా అనేది ఇంకా నిర్ణయం కాలేదు. అలాగే రద్దు చేసిన సుప్రీంకోర్టు జడ్జీలను తిరిగి వారి స్థానంలో నియమించే విషయంలో కూడా రెండు పార్టీలు ఇంకా ఏకాభిప్రాయానికి రాలేదు. ఐతే, అధ్యక్షుడు ముషారఫ్‌తో కలిసి పని చేయాలని రెండు పార్టీల మీదా అమెరికా ఒత్తిడి ఉన్నట్టు సమాచారం. ఏది ఏమైనా పాకిస్తాన్‌లో ఎన్నికలు ఎటువంటి అవాంతరాలు లేకుండా జరగడం, ప్రజాభీష్టం ఇంత స్పష్టంగా వ్యక్తం కావడం అనేది పాకిస్తాన్ రాజకీయ చరిత్రలో ఒక మైలురాయిగానే చెప్పుకోవాలి.



దాదాపు యాభై ఏళ్లు క్యూబా అధ్యక్షుడిగా ఉన్న ఫిడెల్ కాస్ట్రో అధ్యక్ష పదవి నుంచి, మిలటరీ ఉన్నతాధికారి పదవి నుంచి తప్పుకున్నారు. అత్యధిక కాలం దేశాధ్యక్ష పదవిలో ఉండి, ప్రపంచ రికార్డు సాధించిన కాస్ట్రో, తొమ్మిది మంది అమెరికా అధ్యక్షులు ఆయనపై, క్యూబాపై సాగించిన ప్రత్యక్ష, పరోక్ష యుద్ధాన్ని ధైర్యంగా, వ్యూహాత్మకంగా ఎదుర్కొని నిలిచారు. సోవియట్ యూనియన్ పతనం తర్వాత క్యూబాకు ఉన్న కొద్దిపాటి మద్దతు నిలిచిపోయినా, అమెరికా దేశం రాజకీయ, ఆర్థిక ఆంక్షలని విధించి ప్రజాజీవనాన్ని మరింత కష్టతరం చేసినా ఆయన నాయకత్వంలో క్యూబా ప్రజలు చాలా ధైర్యంగా ముందుకి సాగారు. అవసరమున్న పేద దేశాలన్నిటికి వైద్యులని, ఉపాధ్యాయులని పంపటమనేది క్యూబా తప్ప వేరే ఏ దేశ ప్రభుత్వం చెయ్యలేదు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకి, ప్రభుత్వాలకి మద్దతుగా క్యూబా తన సేనలని కూడా పంపిన ఉదంతాలు ఉన్నాయి.

ఇండోనేషియాని 32 ఏళ్లు అతి క్రూరంగా పరిపాలించి, వేలాది మంది ప్రజలని కమ్యూనిస్టులనే ముద్రవేసి చంపించి, మిలియన్ల కొద్దీ డాలర్లని అవినీతి ద్వారా కూడబెట్టిన మాజీ నియంత సుహార్తో మరణించాడు. స్వాతంత్ర్యానంతరం ఇండోనేషియాని పాలించిన అధ్యక్షుడు సుకర్ణోని మిలటరీ సహాయంతో పదవీచ్యుతుణ్ని చేసి 1966లో అధికారంలోకి వచ్చిన సుహార్తో, అమెరికా, ఇంకా ఇతర పశ్చిమదేశాల అండతో మారణహోమం సాగించి, దేశ ప్రజల మానవ హక్కులను కాలరాసాడు. విపరీతమైన అవినీతికి పాల్పడ్డాడు. చివరికి 1998లో ప్రజానిరసన పెద్ద ఎత్తున వెల్లువెత్తడంతో పదవి నుండి తప్పుకున్నాడు. ఆసియా ఖండంలో, అమెరికా అండతో పదవిలో కొనసాగిన నియంతల్లో, ఫిలిప్పీన్స్ మార్కోస్‌కి సరితూగేవాడు సుహార్తో. ◆

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - ఏప్రిల్ 2008 : కేంద్ర బడ్జెట్
- ఫోకస్ - మే 2008 : ప్రపంచీకరణ సందర్భంలో కార్మికోద్యమాల పాత్ర
- జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం - ఒక పరిశీలన - కె. సీతారామారావు, బూర విజయమోహన్

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.01.08 నుండి 27.01.08 | 4 | – | 13 | – | – | – | 6 | – | – | – | 14 | 15 | 4 | – | – | – | 1 | – |
| 27.01.08 నుండి 03.02.08 | 4 | – | 9 | – | – | – | 3 | 4 | – | – | 4 | 17 | 3 | – | – | – | 4 | – |
| 04.02.08 నుండి 10.02.08 | 4 | – | 10 | – | – | – | 4 | 6 | – | – | 21 | 12 | 2 | – | – | – | 6 | – |
| 11.02.08 నుండి 20.02.08 | 3 | – | 11 | – | – | – | 6 | 7 | – | 1 | 31 | 22 | 2 | – | – | – | 5 | – |
| మహబూబ్‌నగర్ | 9 | 1 | 27 | 2 | – | – | 8 | 5 | 3 | 5 | 47 | 37 | – | – | – | – | – | – |
| ఆదిలాబాద్ | 4 | – | 42 | – | – | 1 | 6 | 7 | – | 2 | 20 | 34 | 24 | – | – | 1 | – | – |
| వరంగల్ | 9 | 1 | 51 | – | – | – | 17 | 5 | 1 | 9 | 32 | 26 | 22 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | 5 | – | – | – | 4 | – | – | – | 22 | 17 | 7 | 1 | – | – | – | – |
| గుంటూరు | 1 | – | 1 | – | – | – | 19 | 9 | – | 10 | 20 | 10 | – | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | 5 | – | – | – | 5 | 2 | – | 4 | 27 | 11 | 10 | – | – | – | 2 | – |
| చిత్తూరు | 6 | – | 22 | – | – | – | 10 | 15 | – | 9 | 41 | 14 | 12 | – | – | – | – | – |
| మొత్తం | **44** | **2** | **196** | **2** | **–** | **1** | **88** | **60** | **4** | **40** | **279** | **215** | **86** | **1** | **–** | **–** | **18** | **–** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఆదిలాబాద్ – శ్రీమన్నారాయణ మూర్తి; గుంటూరు – బి. అంజమ్మ; శ్రీకాకుళం – జి. సుధీర్; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; చిత్తూరు – పలమనేరు బాలాజి; వరంగల్ – కె. శ్యాంరావు; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్

## విడుదలైన రెండేళ్లలోనే ఆరవ ముద్రణ!

## మీ ఆత్మీయ స్పందనకు మా హృదయపూర్వక ధన్యవాదాలు

- వీక్షణం పబ్లికేషన్స్




ప్రపంచబ్యాంక్ వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు పేద దేశాల అవసరాలు పెంచి, కొత్త అవసరాలు సృష్టించి ఆ అవసరాలు తీర్చుకునేందుకు ఇబ్బడిముబ్బడిగా అప్పులు ఇచ్చే కుట్ర, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చేందుకు ఉద్దేశించిన ఓ అంతర్జాతీయ కుట్ర ఇప్పుడు బట్టబయలైంది. 'ఎకనామిక్ హిట్‌మాన్' అనే ఆర్థిక దళారీలను నియమించి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాధినేతలను ప్రలోభపెట్టి, ఆ దేశాలను అమెరికన్ సామ్రాజ్యవాదానికి బంట్లుగా మార్చేసిన ఈ కుట్ర గుట్టు విప్పారు జాన్ పెర్కిన్స్. స్వయంగా ఎకనామిక్ హిట్‌మాన్‌గా పనిచేసి ఇప్పుడు చేతికంటిన సామాన్యుల రక్తాన్ని పశ్చాత్తాపంతో కడుక్కోవాలనుకుంటున్న పెర్కిన్స్ అంతరంగ కథనమే ఈ సంచలనాత్మకమైన పుస్తకం.

వెల
రూ.50/-

**కాపీలు లభించు షాపులు :**

**హైదరాబాద్ :** ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర, దిశ పుస్తక కేంద్రం - చిక్కడపల్లి, సాహిత్య నికేతన్ - బర్కత్‌పుర, నవోదయా బుక్‌షాప్ - కోఠి, తెలుగు బుక్‌షాప్ - కోఠి, సహచర బుక్ మార్క్ - బాగ్‌లింగంపల్లి. కుశల పుస్తక కేంద్రం - బాగ్‌లింగంపల్లి.

**విజయవాడ :** ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి బుక్‌హౌస్, సాహిత్య నికేతన్

**నెల్లూరు :** మణి బుక్‌స్టాల్ - సండే మార్కెట్, గుంటూరు - అష్టలక్ష్మీ పుస్తక భండార్

విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు.
ఖమ్మం, హన్మకొండ, నల్గొండ } ప్రజాశక్తి బుక్ హౌస్, విశాలాంధ్ర

ఎం.ఓ / డి.డి. కింది అడ్రస్‌కు పంపి కూడా మీ కాపీ పొందవచ్చు.




**వీక్షణం పబ్లికేషన్స్**
3-6-394, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం.3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్-ఫ్యాక్స్ : 040-6684 3495.

RNI Regn.No.APTEL/2003/11482 Published 01/03/2008 **PRINTED BOOK**





# వినూత్నం... విజయవంతం!

## ప్రతి పథకం ప్రజలకే సొంతం

**విజయవంతమవుతున్న పథకాలు**

| | | |
|---|---|---|
| జలయజ్ఞం | : | 1.30 లక్షల కోట్ల రూపాయలతో 1 కోటి ఎకరాల సాగు |
| ఇందిరమ్మ | : | ఏటా 20 లక్షల గృహాల నిర్మాణం. మొత్తం 80 లక్షల గృహాల నిర్మాణం లక్ష్యం. |
| ఇందిరాక్రాంతి పథకం | : | పావలా వడ్డీకే రుణాలు. మూడేళ్ళలో 6,500 కోట్ల రూపాయలు పంపిణీ. 2008-09లో 10 వేల కోట్ల రుణాలు పంపిణీ లక్ష్యం. |
| రాజీవ్ గృహకల్ప | : | పట్టణ పేదలకు సొంత ఇల్లు. |
| ఉపాధి హామీ పథకం | : | 19 జిల్లాల్లో పేదలకు ఉపాధి. 36.50 లక్షల కుటుంబాలకు ప్రయోజనం. |
| ఇందిరప్రభ | : | 500 కోట్లతో అసైన్డ్ భూముల అభివృద్ధి |
| ఆరోగ్యశ్రీ | : | నిరుపేదలకు ఉచితంగా వైద్యం, శస్త్ర చికిత్సలు. 8 జిల్లాల్లో అమలు |





ఇవి... రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వినూత్న పథకాల్లో ప్రముఖమైనవి. ప్రజల భాగస్వామ్యంతో అమలవుతున్న ఈ పథకాలు రాష్ట్రాన్ని హరితాంధ్ర ప్రదేశ్ వైపు నడిపించే దిశగా విజయవంతంగా అమలు జరుగుతున్నాయి.

**ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం**

R.O.No.870/Sou/Advt.I/2007-08

జారీచేయువారు: సమాచార, పౌరసంబంధాలశాఖ

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao